# తోమాలియ

గ్రంథకర్త్రి:
కవితిలక, కవితావిశారద,
కాంచనపల్లి కనకాంబగారు



ప్రకాశకులు:
శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము,
బెజవాడ.



 1942 వెల రు. 1-8-0



శ్రీ భాస్కరాయ నమః

# తోమాలియ ప్రస్తావన



కవితిలక కాంచనపల్లి కనకాంబగారి ప్రబంధములయందుఁ దోమాలియ విలక్షణమైనది.

"నిస్తులరసభావధ్వను, లాస్తికులకుఁ బద్యశతము లగుఁ దోమాలెన్"

ప్రాస్తావికములు ప్రతిపద్యరసోదయము లనుట యీగ్రంథమున కెంతయుఁ దగియున్నది. సాధారణముగాఁ బ్రాస్తావికము లన్యోక్తులుగా నుండునని యనుకొందురు. ఆయా ప్రస్తావనలకుఁ దగు సందేశ మొసంగు పద్యరత్నంబులును రుచిరంబులై రసికజనములకుఁ గంఠాభరణము లగును.

ధర్మప్రచారమున కిది యొకసాధనముగాఁ గైకొని కవయిత్రి యపూర్వవిజయమును గాంచినది. ప్రాచీన ధర్మములపై నేవగింపు కలిగి సాహసమునఁ బాశ్చాత్యసంప్రదాయము లన్నింట నవలంబించిన నేఁటికాలపు వారలకు హితోపదేశము సేయుటయు స్వధర్మము నిరూపించుటయు వక్రము లగు సాహిత్యగతులఁ జక్కనొత్తుటయు నీ తోమాలియ యందుఁ గానవచ్చును.

ప్రాయికముగాఁ గవులు నానాదేశాధీశుల దర్శించుచు వారి సంతుష్టికై చమత్కారముగాఁ బద్యములు రచించుచుందురు. ఈ మహాకవయిత్రి కవిత్వమంతయు గురుబోధములు ప్రబంధములుగా రచించుటకు, ధర్మప్రబోధము సేయుటకు వినియోగపడినది.

వాణిజ్యంబ యగున్ గవిత్వమునఁ జేర్పన్ రాణివాసంబులన్
వాణీదత్తము మత్కవిత్వ మది భూపా! తత్త్వమున్ దెల్పుటన్

రాణించెన్' అని కవయిత్రి స్వీయకవితాసార్థక్యమును బ్రకటించినది. వేదాంతదేశికులు పోతనమహాకవి మొదలగువారిదియు నిదియే మార్గము.

కవయిత్రి జీవితము పరమపవిత్రమైనది. స్వధర్మానుష్ఠానమందుఁ బరమప్రీతి కలదియగుటచే బాల్యమునుండియు భగవద్భక్తి, భాగవతశ్రవణాసక్తి, సాహిత్యానురక్తి, కవితాపసక్తి యీ కనకాంబగారియందుద్భూతరూపములై క్రమక్రమముగా నయనగోచరములై ప్రఖ్యాతములైనవి.

తోమాలియలోని పద్యములాచంద్ర తారకముగా నాంధ్రదేశమునఁ బ్రచారము కాఁదగినవి. అందలి సుభాషితము లిమ్మహామాలనుండి యక్షయముగా స్రవించు మధుబిందువులవలె రసికుల కాస్వాద్యమాన మగుచుండు నని యీ మధుబిందుసందోహము నిందుఁ బొందుపఱచినాము.

బెజవాడ,
26—10—1942.

ఇట్లు,
శ్రీతిలింగ మహావిద్యాపీఠ పరిషత్తువారు.

# త్రోమాలియ ప్రస్తావనలు



పుటలు.


1. “తోమాలియ పద్యవితతితో రచియితుఁడు ౧
2. న్యాయ్యమకా నీ పదభక్తురాండ్రకు ననాద్యం బేది కాత్యాయనీ ౩
3. భగవద్భాగవతాంఘ్రిసేవనమె మహాభాగ్యంబుగా వ్రాసిపెట్టఁగఁ బంకేజభవుండు ౪
4. ధీరుఁడు కొమ్మనార్యుని ప్రతిష్ఠను రీతి పేరుకొన్న గుంటూరు ౪
5. నిస్తుల రసభావధ్వను లాస్తికులకుఁ బద్యశతము లగుఁ దోమాలెన్ ౫
6. ఎట్టులో, నెట్టుచునుంటిఁ గాలమును నీ భజనంబున నీరజేక్షణా ౫
7. పలుకుఁ దొయ్యలి ముంజేతి చిలుకపాటి సీతమాంబ ౬
8. ఈ కల్ల జగంబునన్ మఱచి, కాంతుము స్వాంతమునందు శాంతినిన్ ౯
9. చల్లగను దాటెను మొల్ల భవా పెల్లువన్ ౧౦
10. జాతి ప్రధానమా? గుణము సర జన స్తవనీయము ౧౧
11. కృతయుగఖండ మిక్కలిని శ్రీపతి పీఠము ౧౬
12. న్యాయ్యమకాదె సద్గురుల యాజ్ఞల శిష్యులు నిర్వహించుటల్. ౧౬
13. సరదాలన్ బరమార్థముల్ దొఱకునా? ౧౬
14. ఏటి కీపరిహాసంబగు నుద్యమంబు లుభయభ్రష్టత్వ సంప్రాప్తికా? ౧౬
15. శక్తుల్ విత్తులు వారి నిల్పుకొనఁగా విజ్ఞానమున్ బండు ౧౭
16. చిత్త విశ్రాంతిని గూర్చు నర్థులకు సద్గురు పీఠము లెల్లకాలమున్ ౧౭
17. ఔఁగదా! భారము నేటి వారి కసువారము నిల్ప ననారతం బహో? ౧౭
18. దేవుని తోడఁ బుట్టె మన దేశమున న్నిగమంబులు ౧౭
19. వ్యవహారంబున కంచు నొప్పుకొన ముంపం జొచ్చెఁ బో కొంపలు ౧౮
20. కొల్లగ నిండియున్న దెటకుం జన నేల? ౧౮
21. అన్నియు నున్న రాజులకు నైనఁ బ్రశాంతి మనంబులోపలన్ సున్న ౧౮
22. పెద్దలు వచియించు వాక్యములె తారకముల్ భయవారకమ్ములున్ ౧౮
23. కలుగుట దుర్ఘటం బెటులొ కల్గినచోఁ బరమార్థబుద్ధి
యిక్కలి ఫలియించు శీఘ్రముగ ౧౮
24. తద్జ్ఞులు మున్ను దెల్పు పెందోవకు సాటిరావు పెఱతోవలు పావను
జేయ జీవునిన్ ౧౯
25. నికం బెన్ ఘనుఁ డెవ్వఁ డార్తులకు సందేహంబులం బాప ౨౨
26. భోజాస్థానమునందు నుండఁదగు ముమ్మార్తుల్ ౨౩
27. తీర్థత్వంబు నొసంగఁ జాలుదు రహో తీరాళికిన్ వీరు ౨౩
28. విద్యాగంధము లేనివారు కలిలో విశ్వోపదేష్టృత్వమున్, సద్యస్సి గఁ గాంతు ౨౪
29. భాగ్యముగల్గినవారికిందు స,మ్మోదము పెట్టఁ డీశ్వరుఁడు పోవు నెటో సకల
ప్రచారముల్ ౨౫
30. గుర్వాశీర్వచన ప్రభావమున జంకున్ మాని ౨౬

31. కవులు తారసిలెదరీ కలినరులకు ౨౮
32. ఒకనోటిమీఁదుగా సకలభారతము నాంధ్రమునఁ బల్కఁగఁజాలు
దక్షుఁ డొకట ౨౮
33. ఏఱులు పొంగిపాఱ నెవ రేమి యొనర్చెదరు ? ౨౯
34. దేవుని త్రోసి రాజని...శాస్త్రపుందోవలఁ గంప గొట్టి వినతుల్ పొన
రింతురు లాఁతివారి ౩౦
35. అధికారంబును మించి కృత్యములఁ జేయఁగఁజూచు బాలుండు ౩౦
36. వింతలు లేవు విజ్ఞులకు వీరులకు ౩౦
37. ధీరుల్ గావలె విద్యలం గళల వృద్ధింజేయ ౩౧
38 శిష్యునకున్ సద్గురుమూర్తికిం గలిగె సద్యోగంబు ౩౭
39. అభ్యనుజ్ఞనే చదువులఁ బాదుకొల్పెదరు ఛాత్రులమానసమందు సద్గురుల్ ౪౦
40. అడ్డ మహంబె శాస్త్రమున నడ్డులు గడ్డులు లేవు ౪౦
41. అసిధారావ్రతచర్య నూనిన యసూర్యంపశ్య ౪౧
42. భారతవిద్యకుం గళకుఁ బాదులు నిల్పు త్రిరంగపీఠి ౪౨
43. నీమాదిరి దె నీ కిల సమానునిఁ గాన జగాన ధీమణీ ౪౨
44. పాపములు పూర్తిగఁ బండవ? నూఱు నిండవా ? ౪౩
45. చైద్యునకు దుర్దైవంబుగాకేమి వచ్చెను బోగాలము మా ముందు బలుకన్
శ్రీకృష్ణుఁ డిట్టంగ ౪౩
46. అర్భకు లెల్లెఱుంగఁగల రంబుజనాభ! భవత్ప్రభావమున్ ౪౩
47. ఎప్పట్టున లాలనంబునకుఁ బాత్రులు శిశువు లాంగువారలే ౪౪
48 కృష్ణ! నీయుడుఁగులజాడ గోపికలకా సనకాదులకా యెఱుంగనా ? ౪౪
49. కిరీటి నిచ్చి చేసితివి కృష్ణ కిరీటికి సాయము ౪౪
50. ఎన్నఁడు నిన్నుఁ గాంతు ననియే మది వెన్నుఁడ దాసురాలికిన్ ౪౫
51. అంబర మైతి నీకుఁ గనకాంబర! నేఁ గనకమ్మునాట ౪౬
52. నల్లనిసామి నటించిన, దెల్లన్ భాగవతమయ్యె ౪౬
53. గోపకుమార! భారతమగుం గద నీ చరితంబు ద్రవ్వినన్ ౪౬
54. ధ్యానమె చాలును దాసురాలికిన్ ౪౮
55. ఏమి నీ, పరమరహస్య మందఱకుపాస్యుఁడ వైతివి నందనందనా! ౪౮
56. అహమున్ డించినఁగాని చేకొనవు కృష్ణా! శత్రులన్ మిత్రులన్ ౪౮
57. బాదరాయణసంబంధబాంధవంబు, గలదు పైపెచ్చు మనకు నో జలజనయన! ౪౭
58. కవికిఁ జాలిన మిత్రుండు కలఁడె జగతి ౫౩
59. ధైర్య మిచ్చు వానిం దగు దేశికుం డనఁగ ౫౪
౧. ఈ విశ్వమం దాద్యం బాంధ్రుల భూమి శ్రీనగము శేషాద్రిందర
మందుండుటన్ ౫౪
మంచివాఁడు హితము మఱఁగువాఁడు ౫౬

62. చిత్తమందుఁ గలదు చెడ్డ మంచి ౫౭
63. వానికన్న వ్యర్థుం డిల లేఁడు వాఁడు ధనదుండగునేనియు దాత కానిచో ౬౪
64. చవులూరదవం వ్రాయు కవిచంద్రుల కబ్బు మహత్త్వసంపదల్ ౬౨
65. రాయలె యుండెనేని తన రాజ్యమునన్ సగ మిచ్చి మెచ్చఁడే ౬౩
66. ఎవ్వరున్, జేసెడి దేమి సత్త్వమున సిద్ధి సమగ్రము గొన్న వానికిన్ ౬౪
67. వ్రాత్యులకుఁ బండిత గౌరవ మెల్లెఱుంగనా ౬౪
68. ఏకలవ్యుండున్ బాండవమధ్యమున్ గెలువఁడే యోహో గురూపాస్తిచే ౬౫
69. శ్రీనగకాననంబునను జెంచెత చెప్పిన దారిఁ బట్టి నేఁ బోఁకను ప్రాజ్ఞుఁ
డుండునె ౬౬
70. స్వస్థాయిన్ విడనాడ నేరయిన స్వాస్థ్యంబున్ గనంజాలిరే ౬౭
71. కడుఁ బొగడంగ రాదె గుణగౌరవముం గల యద్వితీయులన్ ౬౮
72. సద్హృదయముల్ వికసింపఁగఁ జేయు దీక్షకున్, సవనము లెన్నియైన
నిలఁజాలునె ౬౮
73. ధారుణిఁ బారమార్థికులఁ దన్నెదు ధీరులు గానరారుగా ౬౮
74. ఉఱుము సెలయేఱు గలసిన యొప్పు జూపు, శుకపికంబులు జతగూయు
చొప్పు దోఁచు ౬౮
75. మును సన్మునీశ్వరుల్ ప్రవిమలతత్త్వమే కడలఁ బాడిరి వ్రాసిరి
తాళ్ళ రంగులన్ ౭౦
76. మామిడి నీడ గోరి మఱిమంతుఁడు పెంచునె? ౭౦
77. ఏమేమియుఁ గాని చాయలకు నిట్టటు ధావనసేయఁ జెల్లునే? ౭౦
78. నిస్త్రైగుణ్యుల భరించు నిపుణుం డేఁడీ? ౭౧
79. చల్లం డెల్లెడ విత్తనంబులను శాస్త్రంబుల్ కళల్ పండఁగన్ ౭౨
80. నవరసములు కవినోటన్, బ్రవిమలమోదం బొసంగు రసికుల కెల్లన్ ౭౩
81. ధీరకవివరుల్ తారకుల్ గారె ప్రజకు ౭౩
82. కవులు శాసింప శిక్షింపఁ గలిగినారు ౭౩
83. దంపుపాటలు రుచియించు దంపు సాగ ౭౪
84. గ మోపులు సభలలో గారవింత్రె? ౭౪
85. తెంపులకు నేలగీతాల సొంపు లకట ౭౫
86. ఎవరిది వారి కింపగుచు నీయిల వేయివిధాలు పట్టి ౭౫
87. కలిలో వేంకటనాయకుం డొకఁడె నిక్కంబైన దిక్కౌరయన్ ౭౫
88. ఘంటానాదమువోలె వేద మది మ్రోఁగన్ జంక నింకేటికిన్ ౭౬
89. ఎంతేఁ బండిన గుజ్జుమెత్తయినఁగాదే యేనుఁగు ౮౦
90. సంపదయని యుబ్బ రాపదల మ్రొన్నపడ రాంతరదృష్టిపాల్పుచున్ ౮౦
91. ఆయువు నెట్టొ నెట్టు ఘనమా? ౮౧
92. దేశము బాస వేసము విధించెను నన్నయ మున్నె ౮౧
93. పరదృష్టిన్ స్వమతమ్మునుం గనుట సంభావ్యమ్ముగాదు ౮౧

94. మాటలె వేదశాస్త్రముల మార్గముఁ బెంప భరింప ౮౧
95. వాసుదాసుఁడు ప్రశస్తయశస్తనుఁడయ్యె ౮౨
96. ముక్కంటిన్ గొలువ ముక్కుమూయఁ డొకండున్ ౮౩
97. ఏటికి నెదురీదంగల ధీరత గల్గు నిశుకరుణ నొకనికిన్ ౮౩
98. దేవునిగా దేశికునిఁ గొల్చు బుద్ధి యలఁతియే ౮౩
99. లేశంబేయాశయు లేకుండ మెలఁగుటది యెవ్వనికో ౮౪
100. సాధురక్షకై, శ్రీపుల భూపులన్ నడువఁ జెల్లునె సాటికి నీకు మాటికిన్ ౮౭
101. చదువరుల్ సంధ్యలు పోయె వేదములునున్ శాస్త్రంబులుం బోయె ౮౭
102. కులమున్ గోత్రము శౌచమున్ దయయుఁ దక్కంగల్గు సద్ధర్మముల్
గలుగన్ భారత జాతికింగలుఁగు నిక్కంబైన జీవంబు ౮౭
103. బుధుండు తెడ్డు నొక యించుక నాకి వ్రతంబు వీడునే ౮౯
104. కొండగుర్తులన్ లేశము దారిదప్పక చలింపక ధీరుఁడు చేరుఁ బారమున్ ౮౯
105. కూలికి వ్రాయలే దొరుల కోసము లేశము నాసచేసి భూపాలుర వేడలేదు ౯౦
106. ఆంధ్రదేశమునం దన్యుల గొప్పచేయుటయె నిచ్చల్ గాంతుము ౯౨
107. అవసరమందు నాంగ్లమున నందఱకుం దెలియంగఁ బల్కినన్
బ్రవిమల సంస్కృతంబును స్వభాషను వీడకుమయ్య ౯౩
108. కవీశుల నాదరించు ఱేం డెక్కడ నుందురో ౯౪
109. సాధువులగు వారికిన్ దిగతుల్ గనిపెట్టెడి ధీరుఁ డెవ్వఁడో ౯౫
110. నేఁడు ప్రాజదువుల వారు పుట్టినను జచ్చిన నెంచెడు వాఁడెవండు ౯౭
111. పలుకఁగ నేర్చు సత్కవికి బత్తెము పుట్టనినాఁడు ౯౯
112. ఏనుఁగు లమ్మి కార్లపయి నెక్కుడు కక్కుఱితిన్ జరించు భూ
జానులు సత్కవీశ్వరుల సాఁకగ నేర్తురె? ౯౯
113. ఇచ్చక మేల రాజుల కొకింత కవీశుల కుండుఁగాక ౧౦౦
114. మరుపదమునఁ బెట్టిన శాలిబీజముల్ ౯౯
115. అద్దిరా మంచియ కాదయేని గడమంచియ ౯౯
116. అడవిఁ గుయ్యిడ దయ్యుటగాదె ౧౦౦
117. కన్నని యంత ముందుఁ బృథివీపతులన్ ౧౦౧
118. ధర్మము నిల్పఁ బెట్టు టీ దేశమునకుఁ గర్తవ్య ముఖ్య సంపద లదియే ౧౦౧
119. ఆర్చునో తీర్చునో పిదప నాదరమొప్పఁగ విన్నవాఁడు పోకార్చును
చింత గొంత ౧౦౧
120. ఒక్కొక్క విద్య కొక్కొకని నొక్కొక మండలమందు నిల్పినన్
దక్కును బీజము ౧౦౧
121. కొమ్మల నుండఁగాఁదగిన కోతులఁ గొంపల నిల్పి ౧౦౨
122. ఇచ్ఛాద్వేషము లీ జగమ్ముపయి మా కేమాత్రమున్ లేవు ౧౦౨
123 స్వచ్ఛమై న స్వధర్మరక్షణము నాత్మార్థంబు జేయంగనౌ ౧౦౨
124. ధనమున మి వచ్చునది తానె ప్రసక్తి ఘటిల్ల ౧౦౨

125. సత్కవులన్ సాధుల శిల్పులన్ మనుపఁగాదా కల్గె సంస్థానముల్ ౧౦౪
126. వట్టి తద్దినాలకుఁ దిను లెప్ప దంచు మిగులన్ దగవుల్ ఘటియింతుర్ శోధకుల్ ౧౦౪
127. చిలుకు గల్గుఁ బో కవుల చేతుల ౬౯
128. పలుకు లెప్పునున్ బుద్ధులు చెప్పుచుందురు ముముక్షుల కాపదఁ బాప నోపిన్ ౮౯
129. ధార్మికులం బోషించు వాఁడు పృథివిం గలఁడే? ౯౩
130. ఐక్యసమయ్యో జీవితము వైవిధ్యముల్ పరధర్మచింతలన్ ౧౦౫
131. ధర్మవిహీనమై చెడును సర్వస్వమ్ములున్ గ్రామముల్ ౧౦౫
132. పామరుల్ పొంగన్ క్షుద్రులు వ్రాయు పాత్రములు మున్నున్ నేఁడు నింద మ్మలే ౧౦౬
133. భారత భూమినిం గల ప్రభావము భావము లంతరింప ని స్సారమగున్ జగంబు ౧౦౪
134. ఇచ్చిన యట్టి యిచ్చునదియెందును బొందదు సత్కవీశులన్ మెచ్చినయట్టి మెచ్చు నొక మే లొనరింపఁడు ౧౦౪
135. సార్థక్యంబు గనున్ బ్రబోధ మది సమ క్ప్రార్థితంబైన ౧౦౫
136. విరహమునఁ గరుణరస మగు, విరహార్తిఁ గూరించు రామవిభుయోగమునన్ ౧౦౬
137. క్షమసారం డవు సర్వపక్షములకున్ సాయంబు గావింతు ౧౦౩
138. హా స్తంబందు శల్యంబు లే, దవురా నిక్కము విశ్వదాతకు ౧౦౩
139. తోఁచినటు చేసి చెడియె మన్ దొరల వాఁడు, చూచినది గోరి సీతయు శోక మొందె ౧౧౫
140 క్రొత్త ప్రాఁత లేదు గురునిగ మోక్షికి ౧౧౫
141. ఆత్మ ధర్మంబు ప్రాఁతదై యమృతసమము, నన్యధర్మంబు క్రొత్తదై హాలహలము ౧౧౫
142. మున్ను ద్రౌపది దమయంతి బన్నములను బడియుఁ దమతమ శీలముల్ విడువ రైరి ౧౧౫
143. ఇహము పరము లేక యిల్లేది? యాలేది?, పశులమంద గాక ప్రజలమూక ౧౧౬
144. నూటిగఁ బెద్దలు చెప్పిన, మాటకుఁ బైమాటలేదు ౧౧౩
145. మతిలేమిని గతులు పెక్కు మదవతి కకటా ౧౧౩
146. సంస్కృతిని మాని చేసెడు సంఘసేవ, సంకరమె కాక యదియు సంస్కార మగునె ౧౧౭
147. కొంపలను వీడి రచ్చలఁ గూడరాదు ౧౧౭
148. పశువులను జేయు రష్యనుపద్ధతులకు, భారతసతీమణులు పాలుపడఁగ రాదు ౧౧౭
149 కావ్యమే కాంత, కాంతయే కావ్యమండ్రు, సహజపాండిత్యవిలసిత చానగాన ౧౧౭
150. పూరుషుల నుపదేశించి దారి నిలుపు, తరుణియే తగుఁ బూనంగ ధర్మదీక్ష ౧౧౭

151. గుణము పితరులయందునఁ గొఱఁతవడినఁ 1
బందిపిల్లల యటు వృద్ధిఁజెందు మంది ౧౧౯
152. పురుషుఁ డొకజాతి యొకజాతి పొలఁతి యందు 1
జాతి యగు నెట్లు కలియక సతియుఁ బతియు ౧౨౧ 1
153. చిన్నబుద్ధులు మనవౌట శ్రేయమేదియొ, హేయమేదియొ వేదంబులే వచించె ౧౨౨ 1
154. బుధుఁడు, ధర్మమని చేయు మాను నధర్మ మనుచు ౧౨౪ 1
155. పూవుఁ దావియునుం బోలి పురుషుఁ డతివ, పొంది పొసఁగిన 1
లోకమామోద మొందు ౧౨౦ 1
156. ఆర్తరక్షణకై చేయ రాహవములు ౧౨౪
157. అడ్డముల ద్రోసి కుడిచెద రన్నికూళ్లు ౧౨౫
158. సదసద్వివేచనంబున నెదకుటసుమి ఫలము వేదవీథుల నజానిన్ ౧౨౬
159. ఇంతకున్, మూలము స్త్రీలు వారి పరిపూర్ణత పూర్ణత జాతి కంతకున్ ౧౨౭
160. ఈదేశంబుతో సాటి రా,వే రాజ్యంబులు పైమెఱుంగుకద యెందేమున్న
దాసింపఁగన్ ౧౩౭
161. సాధ్వులార!స,ద్వృత్తము మీదుపున్నెమున నేకద నిల్చెనుగర్మభూమిలోన్ ౧౩౭
162. పతగంబులు మింట సూత్రముల్, దగి యెటువ్రాలునో యెఱుఁగ దేవుని
కేనియు సాధ్యమానోకో ౧౩౯
163. ధీరస్వాంతలు వీరమాతలును సాధ్వీరత్నముల్ యోగినుల్
గారే భారతనారులు ౧౩౭
164. క్రొత్తొక వింతగాజరగఁ గొన్నిదినంబులు పోవఁబోవ నీ,షత్తును మేలులేదు ౧౩౭
165. చెలియలికట్ట శీల మది స్త్రీలకుఁ గాలము గర్మమెంతగాఁ
గలఁచిన దాని దాటరు ౧౩౯
166. ఉపాధిదోషములు గ్రమ్మన్ బ్రజ్ఞతోనెట్టి శ్రీ,గురుపీఠమ్మున సాధువృత్తిఁ
గొని మాకుం బ్రీతి గావింపుమా. ౧౪౦
167. బల మెటుల్ దృఢధర్మమె రామమూర్తికిన్ ౧౦౪
168. పురుషుల్ లెక్కయె నిన్ ఋషుల్ గనియు సమ్మోహంబునుం గాంత్రు
సుందరరామా ౧౪౧
169. మెచ్చుల కైతగాండ్రు మెఱమెచ్చుల దాతల యూఁతఁ జూచుకొం
చచ్చులఁగూర్చి పాడెద రహో చిటిగీతలు ౧౪౨
170. ఈ విశ్వంబునం దేనినేనెన్నన్ రాదది మంచిచెడ్డయని ౧౪౩
171. కాళిదాసుఁడై పలుకదె మున్న దెన్నటికి భక్తియె శక్తిగ దాసురాలికిన్ ౧౪౩
172. ధర్మ బీజముల్ విజయుని వాడనుండి పృథివీతల మెల్లను జల్లఁగాఁ బడున్ ౧౪౪
173. ప్రాణములుండు దాఁక తినరా! మఱి కట్టర? నిద్రవోవరా ?
మానిన దేది కాలములు మంచివి కావని. ౧౪౪

74. గడ్డి యడెంతకోసికొని గంపలు మోసుక పోయి రేనియుఁగా
గడ్డగదల్ప లేరోరులు. ౧౪౪
.75. బుధుల్ మణి దీపము లెల్ల భూమికిఁ ౧౪౪
176. నూరు గజాల కాల్వ నొక నూలును వెల్తిగ దాట నీళ్ళలో జారు ౧౪౪
177. ధర్మదీక్షలో ధీరుఁడు నెగ్గుఁ దగ్గుదురు దీనులు. ౧౪౪
178. ధా నలయ శోభను గాంచుము, తోలుబొమ కై యేల భయంబు ౧౪౫
179. గా కి బోవుమాట, కలకాలము నిల్చును బీ ము ౧౪౬
180. యుద్ధమన్న సంగరమొకొ! కామముఖ్య రిపుకాండము గెల్చుటె ౧౪౬

ఇట్లు,

శ్రీ తి లింగమహా విద్యాపీఠ పరిషత్తువారు,

—ప్రకాశకులు.

---



# విషయసూచిక

పుట.


కైసేత - తోమాలియ సమర్పణము ... ... ౧
1. అంబాస్తుతి ... ... ౨
2. మొల్లజయంతి (1935) ... ... ౪
3. తిక్కన జయంతి (1936) ... ... ౬
4. కనక కంకణతారావళి (మొల్లజయంతి 1936) ... ... ౮
5. అమృతానందనాథ గురుజయంతి (1935) యువసంవత్సర కార్తిక బహుళ దశమి ౧౩
6. ధాత - గురుజయంతి (1936) ... ... ౧౪
పద్య కుసుమాంజలి ... ... ౧౬
విజయవాడ శాఖ (శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము) ౨౧
7. ఈశ్వర గురుజయంతి స్వాగతము (1937) ... ... ౨౧
అమృతానందనాథ జయంతి ... ... ౨౨
8. బహుధాన్య గురుజయంతి (1938) ... ... ౨౫
9. ప్రమాది - గురు జయంతి (1939) ... ... ౨౯
10. విక్రమ - గురుజయంతి (1940) ... ... ౩౨
11. వృష - గురుజయంతి (1941) గురుపరంపర ... ... ౩౫
12. అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు ... ... ౪౨
13. కృష్ణస్తవరాజము ... ... ౪౩
14. కవితానుభవము (1937) ... ... ౫౨
15. ఆంధ్రప్రబోధము (పచ్చయప్ప కళాశాల) ... ... ౫౪
16. మంచిమాటలు (రాజధాని కళాశాల) ... ... ౫౬
17. వాదా విదా విధానము ... ... ౫౯
18. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారికి సమాశ్వాసపద్యములు ... ౬౦
19. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారికిఁ జెన్నపురాంధ్రుల సమ్మానము శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠసందేశము ౬౧
20. విజయతారావళి ... ... ౬౩
21. కొప్పరపు సోదర కవులు .... ... ౬౮
22. ఆమంచర్ల కృష్ణరావుగారు ... ... ౭౨
23. అబ్బరాజు హనుమంతరాయశర్మగారికి విజయవాడ పౌరుల సన్మానమున సద్వృత్తమాలి పద్యములు ... ... ౭౩
24. అ ము - పరమా ము ... ... ౭౫
25. శ్రీ వావిళ్ళవారి త్రిలింగ రజతోత్సవ సంచికకు ... ౭౭
26. వావిళ్ళవారి త్రిలింగ రజతోత్సవ సభలో ... ... ౭౮
27. దివ్యవాణి ప్రశంస ... ... ౭౯
28. విజయనగర వేదవిజ్ఞానవనీ పరిషత్తున ... ... ౮౦

| | | పుట |
|---|---|---|
| 29. | వావిలికొలను సుబ్బారావుగారి నిర్యాణము ... ... | ౮౨ |
| 30. | రవీంద్రుని సప్తమయము ... ... | ౮౩ |
| 31. | కావ్యపరమార్థము ... ... | ౮౪ |
| 32. | భ్రమరాంబా మల్లేశ్వర పుస్తక భాండాగారప్రశంస ... | ౮౪ |
| 33. | దోమా వేంకటస్వామి గుప్తగారు ... ... | ౮౫ |
| 34. | దంటు సుబ్బావధానిగారి పండితరాయ బిరుద ప్రశంస | ౮౬ |
| 35. | దేశోద్ధారక నాగేశ్వరరాయనికి శశికళామాల ... | ౮౭ |
| 36. | శ్రీరాధాకృష్ణయ్యగారికి హంసవిజయము పంపునపుడు ... | ౯౦ |
| 37. | ,, హంసవిజయాభిప్రాయముపై ... | ౯౧ |
| 38. | ,, తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమున సన్మానము ... ... | ౯౧ |
| 39. | తత్త్వాచార్యులు అక్స్‌ఫర్డుకుఁ బోవునపుడు ... ... | ౯౨ |
| 40, | శ్రీరాధాకృష్ణయ్యగారి పుత్రికా వివాహ సందర్భమున ... | ౯౪ |
| 41. | శ్రీజయపురాధీశ్వరునకు హంసవిజయము పంపునపుడు | ౯౫ |
| 42. | విక్రమేశతారావళి ... ... | ౯౭ |
| 43. | శ్రీజయపురాధీశ్వరుల సమక్షమున శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమున ... ... | ౧౦౧ |
| 44. | ఆంధ్రసాహిత్య పరిషచ్చంద్రికళామాల ... ... | ౧౦౩ |
| 45. | శృంగార ప్రబంధతత్త్వము ... ... | ౧౦౫ |
| 46. | విశ్వదాత నిర్యాణము ... ... | ౧౦౭ |
| 47. | డ్రెస్సు డేలు దొరసాని ... ... | ౧౦౮ |
| 48. | శ్రీపిఠాపురం మహారాణీగారి సమక్షమున ... ... | ౧౦౯ |
| 49. | పతిభక్తి ... ... | ౧౧౦ |
| 50. | గృహలక్ష్మి ... ... | ౧౧౧ |
| 51 | గృహలక్ష్ములకు ... ... | ౧౧౪ |
| 52. | రాధాకృష్ణానందాశ్రమము ... ... | ౧౧౬ |
| 53. | స్వాతంత్ర్యగీతము ... ... | ౧౧౯ |
| 54. | స్వాతంత్ర్యము ... ... | ౧౨౨ |
| 55. | రాజమహేంద్రవరమున ... ... | ౧౨౫ |
| 56. | హిందూసుందరి కాశీర్వాదము ... ... | ౧౨౮ |
| 57. | కాకినాడ విద్యార్థినీ సమాజమున ... ... | ౧౩౦ |
| 58. | శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారికి షష్టిపూర్తి... ... | ౧౩౧ |
| 59. | శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి కుపదేశము ... ... | ౧౩౨ |
| 60. | కాళ్లకూరి మహాలక్ష్మీ సుందరమ్మగారి నిర్యాణము ... | ౧౩౫ |
| 61. | శ్రీమతి పొణకా కనకమ్మగారికి - ఓదార్పులు ... ... | ౧౩౬ |
| 62. | మా పద్మిని ... ... | ౧౩౭ |

పుట
63. విజయనగర స్త్రీల సభ ... ... ౧౩౭
64. శ్రీచుండూరి వెంకటరెడ్డిగారి జన్మదిన ప్రశంస ... ౧౪౦
శ్రీరామస్తుతి ... ... ౧౪౧
స్వస్తి ... ... ౧౪౧
శ్రీతిరుమల శ్రీనివాస త్రి లింగ మహా విద్యాపీఠ
నూతన ప్రాసాద ప్రవేశ మహోత్సవము.
శ్రీకృష్ణస్తుతి.



శ్రీభాస్యాయ నమః

## శ్రీ మత్యా కాంచనపల్లి కనకాంబయా శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ

## క న క ప్రా సా ద స మ ర్ప ణ మ్

శ్లో॥ తీర్థం కృష్ణానదీ యత్ర క్షేత్రం పాశుపతం మహత్
దైవతే యత్ర వై స్వర్ణదుర్గాంబామల్లికార్జునౌ. ౧

టీక:—కృష్ణానది యెచట పుణ్యతీర్థమో, యెచట క్షేత్రము పశుపతి సంబంధమైనదో, దైవతము లెచటఁ గనకదుర్గాంబా మల్లికార్జునులో యది విజయవాటిక. బెజవాడలో నున్న యింద్రకీలపర్వతంబున నర్జునుఁడు మున్ను తపం బొనరించి పాశుపతాస్త్రము శివుని వలనఁ గ్రహించె నని యైతిహ్యము. కావునఁ బాశుపత క్షేత్ర మనియుఁ బక్షాంతరమునఁ బాశుపత క్షేత్ర మనగా శివక్షేత్రమనియుఁ జెప్పవచ్చును. విజయుఁడు పాశుపతాస్త్రము సంపాదించినచోట్టు విజయవాడ. దేశ్యము బెజవాడ యని యెఱుంగునది.

శ్లో॥ కేంద్రం త్రిలింగదేశస్య, సాంద్రం నానాకలాన్వితైః
స్ఫీతం సాధుజనైః పూతం, పత్తనం విజయాభిధమ్. ౨

టీక:—ఈ విజయవాడ, త్రిలింగ దేశమునకు కేంద్రము (మధ్యభాగము). నానా విద్యలు, కళలు శిల్పము లెఱింగిన వారిచే నిండియున్నది. సాధుజనులకు స్థానమైనది. కావుననే పావనమైనది.

శ్లో॥ తత్పురీసరసీజస్య కర్ణికాయాం యథేందిరా
కనకాంబాకృతో హేమ, ప్రాసాదో భాతి భాస్వరః. ౩

టీక:—ఆ విజయవాడ యను పద్మమునకు మధ్యభాగమునందుఁ (కర్ణికయందు) గనకాంబానిర్మితమయిన సౌధము, "హేమ ప్రాసాదము", కనకప్రాసాద మను పేరుతోఁ గాంతితో లక్ష్మివలె బ్రకాశించుచున్నది.

శ్లో॥ అమృతానందశిష్యా యా సుధామధురభాషిణీ
క__ యా జీవయాత్రా యా యోగినీ సుదృఢవ్రతా. ౪

టీక:—ఈ కనకాంబగారు "అమృతానంద నాథస్వామి" శిష్యురాలు, అమృతమువలె మధురమైన కవిత్వము చెప్పునది. జీవయాత్ర మొదలగు మహాప్రబంధములు, గురుబోధగ్రథితములు రచించినది. "అమృతసారము" "ఆనందసారము" "హంస విజయము" "తోమాలియ" మొదలగునవి పరమా ప్రీతిపాదకము లెన్నియో యీమె రచించినవి కలవు. ఈయమ దృఢ వ్రతము ల యోగిని.

శ్లో॥ భవనం, భాషణం, భావా, హైమా నామచ శేముషీ
యస్యా స్సా విదుషీ స్వర్ణసౌధం శ్రీపతయే దదౌ. ౫

టీక:—కనకాంబగారి యింటిపేరు కాంచనపల్లివారు. ఆమె పలుకులు బంగారువలె విలువగలవి. ఆమె భావములు నామము ప జ్ఞ బంగారువంటివి. అట్టి కనకాంబగారు "కనకసౌధము"ను దనపేరిట నిర్మించి శ్రీనివాసునకు సమర్పించినారు.

శ్లో॥ అమృతానందనాథేన గురునాథేన నిర్మితమ్
తిలింగాఖ్యం పురాపీఠమ్ శ్రీనివాసాధిదైవతమ్. ౬

టీక:—శ్రీనివాసమూర్తి, యధిదైవతము గాగల శ్రీతిలింగపీఠమును గురుశ్రేష్ఠులగు నమృతానందనాథులు మున్నే స్థాపించి యుండుట ప్రసిద్ధము.

శ్లో॥ మానసాబ్జే యథాస్వర్ణ సౌధే శ్రీపీఠ ముత్తమమ్
హేమాంబా సుప్రతిష్ఠాప్య హేమాంబర మతోషయత్. ౭

టీక:—తన మానసమునందు మున్ను ప్రతిష్ఠించుకొని యున్న గురుపీఠమును శ్రీ కనకాంబగారు తాము నిర్మించిన కనకప్రాసాద నామక సౌధమునందు బ్రతిష్ఠించి, కనకాంబరుని సంతోషపెట్టెను.

శ్లో॥ హేమసౌధాధినాథాయ హేమచేలాయ కల్పితా
హేమపద్యమహామాలా హేమహేమాంబయాఽనయా. ౮

టీక:—హేమసౌధమునం దధిష్ఠించియున్న హేమచేలునికొఱకు హేమ హేమాంబ (కాంచనపల్లి కనకాంబ) హేమపద్య మహామాల (బంగారమువంటి పద్యములతో నిర్మించి మహామాల- (తోమాలియ) యను గ్రంథము సమర్పించెను.

శ్లో॥ సర్వస్వ మర్పితం భక్త్యా గురవే హరయే యయా
హేమాంబా సా పరం జీయాత్ హేమదుర్గాప సాదతః. ౯

టీక:—భక్తితోఁ బరమగురుండగు శ్రీమన్నారాయణునకుఁ దన సమస్తధనమును సమర్పించిన శ్రీ కవితిలక కనకాంబగారు కనకదుర్గాప్రసాదము వలన సర్వోత్కర్షముగా నుండుగాక.

శ్లో॥ దుష్టానాం భీషణం శిష్టతోషణం సాధుపోషణమ్
భూషణం పండితేంద్రాణాం సచ్చిదానందభాషణమ్. ౧౦

టీక:—శ్రీ సచ్చిదానంద భాషణము, దుష్టులకు, భీషణము- భయంకరమైనది. శిష్టులకుఁ దోషణము- సంతోషమును గలుగఁ జేయునది; సాధువులకుఁ బోషణము- బలమొసంగునది; పండిత ప కాండులకు భూషణము- అలంకారమయినది,



శ్లో. హరిహరవిధిరూపమ్ హ్యార్తరక్షాప్రతాపమ్
కలిమలహరదక్షం కామజిత్సత్కటాక్షమ్
సరససుజనగేయం సాత్వతాం భాగధేయం
పరమపురుష మీశమ్ భావయే వేంకటేశమ్.

పద్యమాలా మహామాలా రసామోదానురంజితా
శ్రీపతే రచితేయం తే హేమసూత్రసమన్వితా.

శ్రీ భాస్యాయనమః
శ్రీ శారదాగురుభ్యోనమః
అస్మచ్ఛ్రీగురుచరణారవిందాభ్యాం నమః.

# తోమాలియ

## క్రైసేత

శ్రీమానాయక నీకుఁ
దోమాలియఁ బద్యవితతితో రచియింతుఁ
ధీమంతుల కంఠమున మ
హామహామున వెలయు నది బుధామోదదమై. ౧

పుట్టితి నాఁడుదాననయి, పుణ్యవశంబున విద్యనేర్చి, చే
పట్టితి దేశికాంఘి వరివస్య కవీంద్రులకెల్లఁ గానుకల్
వెట్టితి గ్రంథరాజములు, విజ్ఞులు దీవనఁజేయ నెట్టులో
నెట్టుచునుంటిఁ గాలమును నీ భజనంబున నీరజేక్షణా. ౨

ప్రస్తావోచితములు, వి
ధ్వస్తతమస్కములు వస్తుతత్త్వఘనంబుల్
నిస్తుల రసభావధ్వను
లాస్తికులకుఁ బద్యశతము లగుఁ దోమాలెన్. ౩

# 1. అంబాస్తుతి

సీ॥ బాల్యంబుననె యాంధ్ర భాషాకవిత్వంబు
నరపె మఱి మంగురామానుజుండు
ఆంగ్లవిద్యారహస్యంబు నా కెఱిఁగించె
లీలమై పిదప డై స్డేలు సాధ్వి
సాంస్కృతసాహిత్య సంప దాయము నృసిం
హాచార్యపండితుం డవలఁ దెల్పె
విజ్ఞానసంఘముల్ వివిధపరీక్షల
బంగారుపతకాలఁ బ తిభఁగూర్చె
గీ॥ క్వీనుమేరీ కళాశాల పిదప నంబ
యాంధ్ర బోధకురాలను నాఖ్యఁ దెచ్చెఁ
బాఠ్యపుస్తక నిర్ణయ పరిషదర్హ
నను యశము విశ్వవిద్యాలయంబె కూర్చె. ౧

సీ॥ పదియురెండవయేటఁ బలికించితివికదా
నెల్లూరి శ్రీరంగ నేత్రమహిమ
పదియునేనవయేటఁ బ తిభకూర్చితికదా
నారీసభాగా సనమున నిల్పి
పదియునారవయేట వారాణసీయాతఁ
జెప్పించితివికదా సీసమాల
నెలఁబా యమున లిఖియింపఁ జేసితికదా
వాసికెక్కిన మాసపతి కలకుఁ
గీ॥ దరుణభావంబురానట్టి తరుణమందె
పాండవజయంబు గౌతమప భునిచరిత
నమృతవల్లియు వా యించి తంబ! యర్ధ
కాయభూషితభర్గ యో కనకదు . ౨

మ॥ అమృతానంద గురూత్తమాంఘ్రి జలజం బ్రాపైనఁ జూపించి త
త్త్వమునెల్లన్ బ్రకటించి యా ఘనుని బోధం బాస్థతోఁ బద్యకా
వ్యముగా వ్రాయఁగఁజేసి సత్కవుల కాహ్లాదంబుఁ గల్పింతు న్యా
య్యమెకా నీ పదభక్తురాండ్రకు నసాధ్యం బేది కాత్యాయనీ! 3

సీ॥ ఏన్గుపైనెక్కి యూరేగి సత్కవులకు
బెట్టుగూర్చినవాఁడు వేంకటకవి
ముగురువ్రాసిన వేదమును భారతము నొంటిఁ
గృతిఁజేయు సుకృతి శ్రీకృష్ణసుకవి
కృతి విమర్శకుల కగ్రేసరుండను ఖ్యాతిఁ
గొన్నట్టి దిట్ట యా కుప్పుసామి
సర్వకళావిచక్షణుఁడు సత్కవి యన్న
కీర్తి గాంచిన కాశికృష్ణ బుధుఁడు

గీ॥ నన్ను నా జీవయాత్రి మన్ననలు సలిపి
కవితిలకమంచు నన్నెంతొ గారవమునఁ
బిలుచుటెల్లను నీ కృపకలిమికాదె
తనువిభూషిత భర్గ! యో కనకదుర్గ. ౪

ఉ॥ పండితగమ్య మాటను ప్రబంధము నొటను జీవయాత్ర భ
క్తుండగు వానికిన్ దెలియు ధోరణి నాటకమున్ రచించి భూ
మండలమందు సద్గురులమార్గము నిక్కలి నిల్పుటెల్ల నీ
వండఁగ నుండఁగాదె జగదంబిక సాధ్య మదేరి కన్యథా. ౫

చ॥ శ్రవణసుఖంబుగా నమృతసార మనన్ మనమున్ హరించుచున్
భవభయబాధఁ బాపుచును మాధవు పాదసరోజచింతనన్
దవులుచు నెల్లవారల ముదంబున నట్టి ప్రబంధరాజమున్
జవులొదవంగ నే నమృతసారముఁ జెప్పితి నంబ త్వత్కృపన్. ౬

మ॥ అమృతానందగురున్ బరున్ దలఁచి బ్రహ్మానందసారంబునాఁ
గమనీయంబగు కబ్బమంబ! యటుపైఁ గల్పించితిన్ దత్త్వబో
ధము జిజ్ఞాసువులైన వారలకు హత్తన్ జిత్తమం దార్ష మా
ర్గమునన్ దేశమునందు నిల్పు ఘనకాంక్షన్ నేటికాలంబునన్. ౭

మ॥ భగవద్భాగవతాంఘ్రి సేవనమె మద్భాగ్యంబుగా వా సిపె
ట్టగఁ బంకేజభవుండు, లౌకికపుబాటల్ వీడి మోక్షంబుఁ ది
న్నగఁ జేర్పంగల సద్గురూక్తులను డెందంబందున న్నిల్పి దీ
క్షగ సత్కావ్యములన్ రచించెదను సాక్షాచ్ఛారదాసత్కృపన్. ౮

## 2. మొల్లజయంతి

నెల్లూరు - 8—12—1935

అధ్యక్షోపన్యాసమునందుఁ జెప్పఁబడినవి.

ఉ॥ శ్రీలకు నాలవాలమయి సింహపురంబున వర్ధమానశో
భాలసదార్యగోష్ఠిఁ గవిపండిత భక్త సమక్షమందు భా
షాలలనాసపర్యలఁ బ్రశస్తముగా ఘటియించు సత్క్రియా
జాలము నిర్వహింప ననుఁ జాలఁగఁ జేసిన బాల నెన్నెదన్. ౧

ఉ॥ కేసరిపిల్చె సింహపురికిన్ నను మొల్లజయంతిలో సభా
గా సనమందు నుండ నటులౌఁగద పుట్టినయింట నెందునేన్
జేసెదరగ పూజ యది చిన్నదొ పెద్దదొ, యాఁడుబిడ్డకీ
దోసము సైపుఁడంచు వినతుల్ పొనరింతు సదస్యకోటికిన్. ౨

ఉ॥ ధీరుఁడు కొమ్మనార్యుని ప త్తిష్ఠను గీరితి పేరు కొన్న గుం
టూరునఁబుట్టియున్ జనకుఁడున్ బిననాడె చనంగవచ్చి నె
ల్లూరవసించి నేఁ జదువులున్ బతకంబులు సత్కవిత్వమున్
బేరును బెంపుఁగంటి నిటఁ బెద్దలు నన్ను ననుగ్రహింప మా
యూరిదియేయటంచు ముదమొందెద శాంత యయోధ్యనుంబలెన్.

శా॥ మా పెద్దల్ పలునాట వాటముగ మున్ మాచెర్లలో వెండి దా
చేపల్లిన్ గడు దానభోగముల వాసిన్ గాంచు వ్యాపారులై
భూపశ్రీవిలసిల్లినారు కళలన్ భూదేవులన్ దేవులన్
గాపాడంగఁ గడంగినారు భృతులన్ గల్పించి మేలెంచుచున్. ౪

శా॥ మా మాతామహులందినారు మును సన్మానంబు గోల్కొండలో
హేమంబుల్ మణులున్ సువస్తువులు భూమీశుల్ సమర్పింప ను
ద్దామపేమ హరిన్ భజించిరి మహత్త్వంబంది వేదాది లో
నామం బిప్పటికిన్ వినంబడెడు ధన్యత్వంబు మాకద్దియే ౫

ఉ॥ తా నొక ధర్మవాదిగఁ బథన్ బురమందునఁ గన్న మంగురా
మానుజుఁ డా పుత్త్రుఁడౌచుఁ బథమంబున నన్ గవయితిఁ జేసి వి
ద్యానిపుణుల్ కవుల్ యతులుఁ దన్నొగి ధన్యునిఁ జేయ వారి స
న్మానముచేసి చూపె నొకమార్గము నాకును సాధుసేవకున్. ౬

శా॥ రంగారాయనిఁ బంగనామకులపారావారరాకాసుధాం
శుం గీర్తిప్రియు భావుకున్ దలఁతు నే శుద్ధాంతరంగంబునం
దుం గావ్యమ్ములు పతి కల్ చదువఁగా నూల్కొల్పి నన్నింత దా
నింగా నేఁడు దివంబునుండి కనువానిన్ సాధుసన్మాన్యునిన్. ౭

చ॥ తెనుఁగున మల్లినాథుఁ డన ధీరత వ్యాఖ్యలు వ్రాసి సంస్కృతం
బునకుఁ దెనుంగుచేసి బుధముఖ్యుఁడునా జయమంది కొత్తతో
వను గృతులం బొనర్చి తిదివంబున కేగియు నొర యూపురం
బున వెలుఁగొందు సత్కవికి మొక్కెద వేంకటరాయశాస్త్రికిన్. ౮

ఉ॥ పెద్దలలోనఁ బెద్దయయి పిన్నలకున్ జనవిచ్చు పిన్నయై
గద్దెల మాటలాడెడు ప్రగల్భుఁడునై బుధకోటి కండయై
ప్రౌఢులు విద్దెలన్ గడపు పోడయునా శివరామయార్యునిన్
వద్దన మానఁగావశమె పండితగోష్ఠిఁ బ్రశంసచేయఁగన్. ౯

శా॥ ప్రస్తావోచితు నేటితిక్కనను సుబ్రహ్మణ్యు బ్రహ్మణ్యుఁ గృ
ష్ణస్తోత్రప్రియునిన్ దిలింగపరిషన్మాన్యున్ గళావేది స
ద్వస్తూపాసనలాలసున్ విమల దుర్భావంశ్యునిన్ సద్యశో
విస్తారున్ వినుతింతు సింహనగరీవిద్వత్కవీందున్ హితున్. ౧౦

ఉ॥ శైవునికూతురయ్యు నృపచంద్రుని శ్రీ రఘురామచంద్రు స
ద్భావమునన్ భజించియుఁ బ్రబంధము నాతనిపై రచించియున్

భూవలయంబునఁ గలుగు పుణ్యాచరిత ల నగ గణ్యయై
మావనితాళికెల్ల నుపమంబగు మొల్లఁ దలంతు నెంతయున్. ౧౧

ఉ॥ స్వాంతమునందు నమ్మఁడు జయంతులు సేయుటె కాదు ధర్మదృ
ష్టాంతములట్లు నిల్చిన మహాత్ములమార్గమునన్ జరించి వి
భ్రాంతులుమాని ఘోరభవబంధవిమోచనముం బొనర్చు శ్రీ
కాంతుని నంతరంగమునఁ గట్టి భజించుట మేలు చూడఁగన్. ౧౨

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారికి
గృహలక్ష్మి కంకణముఁ దొడుగు సందర్భమున నాశువుగా
కవయిత్రి చెప్పిన పద్యము.

గీ॥ పలుకుఁదొయ్యలిముంజేతి చిలుకపాటి
సీతమాంబకు లక్ష్మి యిచ్చె వలయంబు
కరము మాటాడు టరుదు కంకణము నిడునె
యత్త కోడలిదానిపై నాదరమున. ౧౩

## 3. తిక్కనజయంతి

21—3—1936

కవితిలక, కంచనపల్లి కనకాంబగారికి
తిక్కవరపు లక్ష్మీనారాయణరెడ్డి బహూకరణము రు 116.

చ॥ దినదినవర్ధమానమగు తేజమునన్ దెసలెల్ల నిండ వ
ర్తనమునఁ బూర్వసత్కవిప ర్తన్ బ తివత్సర మీ జయంతులన్
జనముల కెక్కఁజేయు ఘనసంఘము సింహపురిన్ గడున్ జిరం
తనమగు నార్యవిద్యలకు స్థానమగున్ విబుధాగ గణ్యమై. ౧

చ॥ కవియన బ హ్మమాటఁనికిఁ గావ్యము తత్ప్రతిపాదకంబు కా
కవుల విడంబనంబు లెటుగా లిన నీ కలికాలమందు స
త్కవులప బంధరాజములు తత్పరమాచుఁ దద్వైక్యభావనన్
దవులఁగఁజేయుటన్ గద సదా కవిపూజలు సల్పుచుంది లన్. ౨

గీ॥ వేదశాస్త్రపురాణముల్ వినఁగలేరు
భాష్యసిద్ధాంతముల మదిఁ బట్టలేరు
సద్గురూపాస్తి శ్రద్ధతో జరుపలేరు
కవివరేణ్యులె తారకుల్ కలిసరులకు. ౩

శా॥ నానాసత్కవినామధేయములతో నానాప్రబంధాలఁ గా
వ్యానందంబు పృథఙ్నదీగతుల బ్రహ్మానంద సంధాయకం
బై నవ్యంబుగఁ బాఱు నాంధ్ర పరమార్థైక్యప్రబోధాఖ్య వి
జ్ఞానాంభోనిధిఁ దిక్క సంగమున మున్గన్ రండు పుణ్యాత్మకుల్. ౪

శా॥ లేఖ్యామ్నాయము వ్రాసె వ్యాసునటు నక్లేశమ్మునన్ దిక్కయ
జ్వాఖ్యుండౌ కవి భారతీవిభుఁడు నన్నప్పార్య సంసూచిత
ప్రఖ్యాతాంధ్ర మహాపథంబున సపర్యాభావనన్ గీష్పతి
ప్రఖ్యుండై మనుమావనీపతికి సామ్రాజ్యంబు నీఁ గల్గియున్. ౫

ఉ॥ నన్నయయన్నఁ దిక్కనయనంగ ద్వితీయమహాకవీందుఁడై
ట్టున్నయన్ మఱెవ్వరన నాంధ్రు లజ్ఞానసుధాప్రవాహసం
పన్నసుతీర్థ భావనను బావననామము లౌనుజుమ్మదే
మన్నను బాత భేదములెయౌఁ బరమాన్న మదొక్కఁడౌటచేన్.

ఉ॥ దాయలు పర్వమందిడెడు తర్పణమందునఁ దండి పేరురా
దా యని తాను మానఁడు కదా యట రాజమహేంద్ర మందు భా
షాయుతు లేల నన్నయకు సల్పరు భక్తి జయంతి నేఁడు రా
దాయిట నాద్యుపేరనుచు ధర్మము పేక్ష యొనర్పఁ జెల్లునే. ౭

కం॥ ఆద్యక్షరములు రెండున్
జోద్యంబుగ సమములగుటఁ జూమి తిక్కవరా
ఖ్యోద్యానపారిజాతం
బాద్యులఁ బూజించుఁ దిక్కయజ్వజయంతిన్. ౮

కం॥ నా కీ నూటపదార్లు మ
హాకవి సత్కృతిగఁ దిక్కయజయంతికి న

స్తోకకరి వైరిపురమున
జేకొనుభాగ్యంబు కలిగె శ్రీగురుకరుణ౯.

సీ॥ కృష్ణభారతముచే గీర్తికెక్కిన పోడ
కవిసార్వభౌముఁడై ఘనతకెక్క
శతవధానఖ్యాతి జగమేలు కవిసింహ
గర్జనంబులకు దిగ్దంతు లడల
నాంధ్ర వాల్మీకియై హరిభక్తి ధన్యుఁడు
వాసుదాసనుకీర్తి వసుధ నిండ
నరుదైన బ్రహ్మాండ మాంధ్ర భాషను బట్టు
దిట్ట వాగ్దేవతాదీక్ష నూన

గీ॥ పూజ్యు లీక నెందఱో యాంధ్ర భూమి నుండ
నాద్యసత్కృతి నాకె చేయంగఁబూన
వారి యాశీస్సుఁ బొందుటవలన జూవె
ఆత్మపదమిత్తు రార్యులు హరియు గురుఁడు. ౧౦

శా॥ నా పుట్టింటను నాకుఁ దొల్దొలుత సన్మానంబు గావించినా
రే పెద్దందన మిందు లేదనుచు మీకే తెల్ల మెవ్వారు గా
నీ పాపం గని ముందు చేతనిడరే యింపైన దేదేని నా
లోపం బెంచక వత్సలత్వమున నాలోకింపుఁడీ సజ్జనుల్. ౧౧

శా॥ ఏ శేటల౯ దమ వంశకర్తలకు నెంతే యున్నతింగూర్ప నే
ర్పాటుం దిక్కన యుత్సవంబులకు జల్పంబూని మెప్పు౯ నిరా
ఘాటంబొగతిఁ జెల్లు మాన్యములనుం గల్పించి మేలెంచునా
పాటూర్యన్వయు లెల్లకాలమును శుభ్రఖ్యాతిఁ బెంపొందుత౯. ౧౨

## 4. కనక కంకణ తారావళి

మొల్ల - జయంతి
27_12—1936

ఉ॥ పాటిమెఱింగి సత్కవితభంగు లెఱింగి చెలంగి నేడు నా
బోఁటికి బోటికొక్కెడకుఁ బోఁవఁగ నేవము గల్గుదాని కీ

నూటపదారు లైదిటి ఘనుం డితఁ డిచ్చె నయాచితంబుగాఁ
గోటవదాన్య కేసరికి క్షోణితలంబున సాటికల్గునే. ౧

చ॥ వెదకినఁ గానరాఁడు పృథివీపతి యొక్కఁడు సత్కవీంద్రు లన్
వెదకి యొసంగ నూరయిన వెంటఁబడంగఁ బడంగ నెట్టులో
వదలుచుకోఁగడంగు నృపవర్యుఁ డొకం డెట నుండునో కదా!
ముదితలసత్కవిత్వగుణముం గని పూజ లొనర్ప సాధ్యమే? ౨

ఉ॥ ఎల్లరు మోదమందఁ గవయిత్రు ల నేరిచి కోరి తెచ్చి యీ
మొల్ల జయంతినాఁడు సభఁ బూజలు సల్పెను గంకణమ్ములన్
మొల్లము నిచ్చి నేఁడు బుధముఖ్యుఁడు కేసరి కన్నిసంపదల్
గొల్లగవచ్చు దేవుఁ డనుకూలత నుండెడి నెల్ల కాలమున్. ౩

ఉ॥ పండితులున్ గవుల్ నృపులు పా భవము న్గల పెద్దవార లు
ద్దండకళాప పూర్ణులు సదస్యులుగాఁ గనుమూయ ధీరవే
దండములైన జంకుఁ గలదా? యిటువంటి పురంబు! దానిలో
నుండెడు పుణ్యపూరుషు లోహో! యనఁబల్కుట నాకు సాధ్యమే. ౪

శా॥ సాకేత జన్మతనాన సత్సభలలో సన్మానముల్ సత్కృతుల్
నాకున్ సింహపురంబు కూర్చె యిది జన్మస్థానమే కాన లో
నే కొంకు న్గొనఁబోక నే నిచట నేమేఁ బల్కినన్ బెద్దలా
గాకంచున్ సయిరింతురిపో యని నమస్కారంబు లర్పించెదన్. ౫

శా॥ ఏ పుణ్యంబుననో మదీయకృతు లెంతేఁ బెద్దలా సత్కవుల్
గాపాడంగఁ గడంగుట న్విమలవిఖ్యాతాఖ్యనై దుష్కలి
వ్యాపారం బిపు డేపుమీఱఁటి, నిజధర్మాన క్తులున్ జాఱుటన్
స్థాపింపందగు నార్యధర్మమని యాస్థన్ జాటితిన్ మాటికిన్. ౬

ఉ॥ మొల్లజయంతినాడు బుధముఖ్యులునున్, గవయిత్రులు, న్గవుల్
పిల్లలు, పెద్ద లొక్కయెడఁ బ్రీతిగఁ గూడిన గోష్ఠియందు ను
త్ఫుల్లసరోజలోచను, విభున్, రఘురాముని, సంస్మరించి యీ
కల్లజగంబును న్మఱచి కాంతుము స్వాంతమునందు శాంతినిన్. ౭

ఉ॥ పండుగ పబ్బమంచు, మఱి పర్వమటంచు, జయంతియంచు, రా
ముండును గృష్ణుఁడంచు బరము న్దలపోసి తరింతురంచు నె
న్నండో విధించి రట్లుగుట నాదము నిల్పఁగ నేఁడు మొల్లకున్
బండుగ వచ్చెఁ జక్కని ప్రబంధము వ్రాసిన దామె చూడరే. ౮

ఉ॥ కుమ్మరివారియింటను జకోరవిలోచన యుద్భవించి, లో
కమ్ముఁ దృణమ్ముగాఁ దలఁచి కంజదళాక్షుని సేవఁ జేయ జ
న్మమ్ము పవిత్రమా ననుచు నమ్మి, మహాత్ముని రాముఁగూర్చి గ్రం
థమ్ము లిఖించి చల్లగను దాటెను మొల్ల భవాబ్ధి వెల్లువన్. ౯

ఉ॥ ఏమరుపాటు కల్గఁగద యెంతటివారికి నెట్టులైన శ్రీ
రాముని సంస్మరింపఁగఁ దరమ్మె మనమ్మును నిగ్రహింప నో
భామినులార! నేఁడయిన బంధవిమోచను బద్మలోచనున్
నేమము మీఱఁ గొల్చి, భవనీరధిపారముఁ జేరు టొప్పగున్. ౧౦

ఉ॥ పూరుషపుంగవుల్ గవులు పూర్వము నేఁడునుగూడ భారతా
చారము, శీలము, న్దయయు, సత్యము, ధర్మము, నిల్పఁబెట్టఁగా
భారతము, ల్పురాణములు వ్రాసిగఁ జెప్పిరి నేఁడు కొంద ఱా
దారికిఁ గంపఁగొట్టి పెడదారులు దీయుదు రౌర ధీరులై. ౧౧

ఉ॥ కల్లలు బొల్లులున్ బలికి కాదని యౌనని యెల్లకాలమున్
జిల్లరమాటలన్ గడప జీవుల కెల్లను జెల్లు నాయువుల్
డొల్ల సమస్త మిందు నొకఁడున్ మనవెంటఁ గొనంగఁబోల దో
పల్లవపాణులార! భవభంజనుఁ గంజదళాక్షుఁ గొల్వఁడీ. ౧౨

చ॥ చదివినవార లుండ రిల సాధ్వులలో, నొకవేళ నుండినన్
జదువుట వ్రాయుటే యగును శాస్త్రపురాణములంత వంతగాఁ
జదివిన సంప్రదాయముగ సద్విషయమ్ముల బుద్ధిఁబోవ దే
చదువుల నేర్వ వారలకు సత్కవితాకలనమ్ము కల్గునే. ౧౩

ఉ॥ రెండును రెండుతో వలు ధరిత్రి నిఁ బా క్కు ప తీచి వానిలో
నుండెడు సారము న్గురునిసూక్తి నెఱింగి వచింతుఁ జింత లే

కండజయానలార! వినుఁ డందఱుఁ బారముఁ జేర్చుఁ బాక్కె, వే
రండిక నొంపుమార్గముల రాదు ప్రశాంతి తరించి మించఁగన్. ౧౪

శా॥ మీరాబాయి తరించె మున్ గృహిణియై, మించెంగదా కన్యయై
ధీరుండైన విదేహునిన్ సులభయున్, దీక్షన్ భవంపుందరిం
జేరెన్ వెంగమ తా వితంతువయినన్, నిశ్శ్రేయసం బందఁగా
దారుల్పెక్కులు ధీరచిత్తులకు శ్రద్ధం బూనుచో ధారుణిన్. ౧౫

ఉ॥ జాతి ప్రధానమా? గుణము సర్వజనస్తవనీయమౌటచే
నాతియు రామచంద్రుని గుణమ్ములఁ బ్రస్తుతిఁజేసి లోకవి
ఖ్యాతినిఁ గాంచె మొల్ల, కనకమ్మను గమ్మదనమ్ము[illegible]
గైతయు భక్తియుం గలిసి గల్గఁగఁజేయు నఖండ మోదమున్. ౧౬

ఉ॥ ఏరులు శూరు లెయ్యెడల నెన్నఁడు పుట్టిననేమి వారిలో
సార మెఱుంగనేరని యసారుల చర్చలతోడనేమి సం
సారము దాటుదారులఁ బ్రచారముచేయు కవీశ్వరుల్ గదా
ధీరులు వారు చేయు నుపదేశ మెఱింగి చరించు టొప్పగున్. ౧౭

చ॥ ఇడుముల కోర్చి సంతతికి నెంతయుఁగూర్చి సుతుండు కూతురం
చెడ మొకయింతలేక భరియించి సమంబుగఁ బెంచు తల్లితో
యెడరునఁ గావకున్న యెడ నేరికిఁ గాతురు భారతీయులన్
కడు విషమంపుకాల మిది కాలునిలీల గ్రసించు ధర్మముల్. ౧౮

శా॥ ఆటల్ పాటలు నవ్వుమాటలు నసభ్యంబైన పొత్తంబులున్
బోటీల్ వోటులు వింతసొంపులును బెంపు ల్త్రంపులున్ విద్యలై
బోటు ల్నేటికి హద్దులం గడచి గుంపుల్గట్టి పోవంగ నా
ర్భాటంబుం బొనరించుటల్ చదువులే పాశ్చాత్యదుర్వాసనల్. ౧౯

మ॥ మగవా రెట్టెటు సంచరించినను ధర్మం బెప్డుఁ గాపాడఁగా
మగువల్ దీక్ష వహించి యింత దనుకన్ మర్యాదలన్ నిల్పినా
రుగదా! పెంచుట స్త్రీలకు న్గలుగు నేర్పున్ జూతుమే యెందు నీ
తెగువ ల్నేటికి నిక్కలిం గలిగి గోతిన్ జేసెఁబో నాతినిన్. ౨౦

మ॥ పరభాష ల్పరసంప్రదాయము పరపా రంభము ల్నేటికిన్
బరమంబైన పదంబు నొందుట నభవ్యంబైన మార్గంబులన్

దరుణు లోప్పవఁగ నైరి జీవిక కవస్థ ల్మారఁగా నారయన్
బరమార్థంబు స్వధర్మము న్హితము లాపద్ధర్మ మెట్లుండినన్. ౨౦

ఉ॥ రాజ్యము లేలినారు రణరంగములన్ రిపుఁ దోలినారు సం
పూజ్యత నొందినారలు ప బుద్ధులలో జయమందినా రహో
భోజ్య మమర్చినారు తపముం బొనరింపఁగ నేర్చినారు సా
మా జ్యపదంబె కాంతలకుఁ బా జ్య మగు న్గద భారతావనిన్. ౨౨

ఉ॥ సత్యము శౌచమున్ దయయు శాంతియు దాంతియు దానధర్మముల్
ప త్యుపచారముల్ గురుసపర్యలు మాధవపాదచింతనల్
ప త్యయ మాప్తులందు గృహభాండవిశుద్ధియు శ ద్ధ, భ క్తియున్
నిత్యముఁ గల్గి పైఁ జదువ నేర్చిన స్వాధికి సాటికల్గునే. ౨౩

శా॥ కాంతాసమ్మితమౌను గావ్యమని తత్కాలంబునం దెంతయో
సంతోషంబును గూర్ప నేర్పగ సదాచారంబు వేదంబులన్
గాంత ల్మీరుదు రంచు దెల్పుదు రలంకారజ్ఞు లట్లాట నో
కాంతారత్నములార ! మీరు గురువు ల్గావందగున్ ధర్మముల్. ౨౪

ఉ॥ వేడుకక త్తెయై మగని వింతగ సంతసపెట్టునట్టి య
య్యాడుది పల్కుపల్కు నిగమార్థముకన్నను మిన్నయౌ నిశా
వ్వాఁ డది దాఁటశక్తుడగు వాఁడు మనోహరియై మనోహరుం
గూడి స్వధర్మదీక్షఁ బురికొల్పెడు సాధ్వియుఁ గావ్యమొక్కఁడో.

గీ॥ గొప్పవంశంబునను బుట్టి గొప్పబుద్ధిఁ
గలుగు కవిహితుఁ గలవాని ఘనుని సాధు
వినయ సుందరు దీవింతు వెలయవిబుధ
సోము రేబాల పట్టాభిరామనాము. ౨౬

చ॥ సిరియును విద్యయున్ గలుగు సింహపురంబున వర్ధమానసం
ఘరచితగోష్ఠిలో బుధసకాశమునన్ నను బెద్దఁజేసి భూ
వరులు నొనర్పలేని విభవంబున సత్కరణం బొనర్చు కే
సరి కిడు రంగఁ డెప్పుడు ప శ స్తమహార్హ విశేషసంపదల్. ౨౭



## 5 అమృతానందనాథజయంతి

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస
శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగారి
కమృతానందనాథ పారితోషిక ప్రదానసమయమున

20–11–1935 యువ సం॥ కార్తిక బ ౧౦.

కం॥ పావనజలపూరిత గో
దావరితీరమున శ్రీ పద కులంబున నాం
ధ్రావనిఁ గృష్ణాఖ్యను నేఁ
డావిర్భావంబు నన్నుపార్యుం డొందెన్. ౧

కం॥ వైదికుఁడు, శ్రౌతి, పంచమ
వేదంబుఁ దెనుంగుఁజేసె విశ్రుతముగ, శ్రీ
పాద కవిసార్వభౌముఁడు
మోదంబున ముగురుకవుల మూర్తులు దానై. ౨

కం॥ తాఁదక్కఁ గొడుకు బలి నిడి
యీఁదెన్ భారతమహాబ్ధి నీ కృష్ణుండే
వాదంబు లేల యీతని
పాదంబులఁ గొల్తు రేన్గుపై నెక్కఁ కవుల్. ౩

కం॥ బహుభాష లేల నిన్నున్
బహూకరింపంగఁజాలు ప్రభుఁ డేఁడీ ని
స్పృహుఁడ వయి సుకవిధర్మము
వహించు ధీరుఁడవు నిన్ను వశమే పొగడన్. ౪

గీ॥ నూట పదియారు లివి కావు కోటికోట్లు
అర్చనం బిది కనఁ గనకార్చనంబు
శారదాపీఠ మిది పరిషత్తు కాదు
సకలనుతనామ సత్కవిసార్వభౌమ. ౫



# అమృతానందనాథజయంతి

## ఆమ్నాయార్థవాచస్పతి వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారికి

అమృతానందనాథ పారితోషిక ప్రదాన సమయమున:

అధ్యక్షులు - శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

1936.

క॥ వేదార్థ మితఁడు సెప్పును
వేదార్థం బితఁడు వ్రాసె వీరిరువురిలో
భేదం బించుక లే దా
వేదవ్యాసుండె రెండువిధములఁ దోఁచెన్. ౧

శా॥ ఈనాఁ డెవ్వఁడు వక్త శ్రోతయు నెవం డీ వేదశాస్త్రాలకున్
నానాభంగుల ధర్మమూలము లహో నానాటికిన్ బోవ ల
క్ష్మీనారాయణశాస్త్రి వీరపురివాసిం గాంచి త్రై లింగ్యపీ
ఠానన్ శ్రోతల దన్పి శిష్యులఁ బ్రతిష్ఠన్ నిల్పె సద్గోష్ఠిలోన్. ౨

ఉ॥ విప్రకులావతంసుఁడు పవిత్రుఁడు మిత్రుఁడు వేదభావమున్
స్వప్రతిభన్ గడున్ వడలివంశకలాపుఁడు నింపె సభ్యులం
దప్రతిమానుఁడై మొగములైదును నెమ్మిని దాఁచివచ్చు గౌ
రీప్రియపుత్రుఁ డీతనిచరిత్రము చిత్రము కీర్తిపాత్రమున్. 3

క॥ వేదములచిక్కు లెడలిచి
వేదార్థము భారతమున వివరించిన యా
వేదవ్యాసుఁడు కృష్ణుఁడు
గాఁ దెలుగున భారతంబుఁ గల్పించె నోహో. ౪

క॥ కృష్ణుఁడు కృష్ణుఁడు కృష్ణుఁడు
విష్ణుఁడుగా కొరులవశమె వివరింపంగన్
నిష్ణాతుఁ డౌచు గీతల
వైష్ణవతత్త్వంబు నుభయభారతములలోన్. ౫

ఉ॥ కొంతకుఁ గొంత యాట నటు కొంతయె వ్రాసె కవిత్రయం బహో
సొంతము భారతంబును మహాత్ముఁడు కృష్ణుఁడు మున్ను నేఁడు దా

నంతయునై రచించె సురలాడెడు భాషను దెల్గుభాషలో
నెంతటిపున్నె మీ సుకవి నెన్నుట నాకు సభాంతరమ్ముసన్.

కం॥ నన్నయభట్టారకుఁ డపు
డెన్నికఁ గన్నట్టి రాజమహేంద్ర పురిని నేఁ
డున్నతిని వెలుఁగు కృష్ణ క
వి న్నవయుగకర్త నెన్న విబుధుల విందౌ. ౭

కం॥ భారతపారావారము
ధీరుం డొకఁ డెవఁడు దాఁటె ధీరుల కెల్లన్
ధీరుఁడు శ్రీపాదాన్వయ
కైరవమిత్రుం డగుగాక ఖ్యాతులమందున్. ౮

ఆ॥ ఆదరార్ద్రిరుక్తి యన్నారు మున్నిపు
డాదరార్ద్రబహుక్తి యయ్యె నౌర
పెద్దలైనవారిఁ దద్దయుఁ బొగడుట
కనకమకు సుకవిత గలుగుఫలము. ౯

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి

మహామహోపాధ్యాయ బిరుదము వచ్చినపుడు చెప్పినది

చ॥ గురుఁ డగుటన్ మహాకవులకున్ గని నేటికిఁ జాటినారహో
గురుఁ డనుచున్ మహామహులకున్ నిను నో కవిసార్వభౌమ య
బ్బుర మె నిజంబె యాడి రిఁక భూపతు లెవ్వరికైన నీదు శ్రీ
చరణము కృష్ణమూర్తికవిచంద్ర మ! వంద్యము తెల్గు సీమలోన్ ౧౦.



# 6 పద్య కుసుమాంజలి

(1936) ధాతసం॥ కార్తీక బ ౧౦

మ॥ అమృతానంద గురుప్రతిష్ఠితము విద్యాపీఠ మీ తెల్గు దే
శమునన్ ధర్మముఁ దత్త్వమున్ నిలుప దీక్షంబూని విద్వాంసులన్
శమసంపన్నుల సత్కవీంద్రుల సమర్చల్ సల్పు నిత్యమ్మిటుల్
సుమతుల్ దీనినిఁ బ్రోదిసేయ నది కూర్చున్ లోకకళ్యాణమున్. ౧

చ॥ కృతయుగఖండ మిక్కలిని శ్రీపతిపీఠము దానియందు సం
తతము గనందగున్ గురుల తత్త్వము తత్త్వము సత్కవిత్వమున్
శ్రుతివిహిత ప్రవర్తనము సూరిజనాప్తవిశుద్ధకీర్తి యా
నతుల కుదాత్తమైన యమనస్కపదంబు ఘటించు బోధమున్. ౨

ఉ॥ పాయనిభక్తితోఁ బతితపావనమౌ నల వేంకటేశ పం
చాయతనార్చనం బహరహంబు ముముక్షులు మంత్రయుక్తితోఁ
జేయుదు రార్ద్రచిత్తముల శ్రీపతిపీఠమునందు దీక్షతో
న్యాయమె కాదె సద్గురులయాజ్ఞల శిష్యులు నిర్వహించుటల్. ౩

మ॥ గురుమూర్తిన్ ధరియించి యా హరియె మార్గున్ దోఁచి భక్తాళికిన్
స్థిరకళ్యాణముఁ గూర్పఁగాఁ దగినరీతిన్ నిల్పె నీపీఠమున్
ధరియింపన్ దగు దీనినాంధ్రులు శుభప్రారంభసంపూర్తి యీ
శర్వసంప్రాప్తియు నాత్మతృప్తియును విశ్వశ్రేయమున్ గాంచఁగన్.

ఉ॥ పూతచరిత్రునిన్ భువనపూజ్యుని సద్గురుమూర్తిఁ గొల్చి వి
ఖ్యాతి విభూతిఁ గాంచనగుఁగాని ప్రసిద్ధికి గుంపుదూరి యే
చేతలఁ జేసి రోతపడి చిత్తము తత్తరమొంది కుందనౌ
నే? తదధీన మీ జగములెల్ల యటంచుఁ దరించు టొప్పగున్. ౫

మ॥ సరదాలన్ బరమార్థముల్ దొరకునా! శ్రద్ధాన్వితుల్ భక్తితో
గురుదీక్షన్ గొని సాధుసన్నిధిని వాక్కుంగట్టి యానందసం
భరితంబైన పదంబుఁ గన్గొనుట ధర్మంబుత్తమం బేటికీ
పరిహాసంబగు నుద్యమంబు లుభయభ్రష్టత్వసంప్రాప్తికా? ౬

శా॥ వేత్తల్ విత్తులు వారి నిల్పుకొనఁగా విజ్ఞానమున్ బండు సం
పత్తీ భారతభూమి కయ్యదియె దౌర్భాగ్యంబగున్ భాగ్య మా
పత్తౌ నయ్యది కల్గియున్ జనులు లాభభ్రాంతి లోకంబులోఁ
గత్తుల్ కత్తులు కల్పిగొంచు బహుసంగా మాలలోఁ దూలరే. ౭

ఉ॥ ఇక్కడ నేమొ చిక్కనని యెక్కడ పుట్టిన మొక్కలీండ్రహో
దృక్కులు తూర్పుదిక్కునకుఁ ద్రిప్పి కనంగన, దిక్కులేని య
ట్లక్కట! పశ్చిమాననుఁడ వయ్యెద వేలొకో చూడు మాంధ్రుఁడా
దృక్కుగ నిల్పునట్టి యుపదేశము చేసిన దేశ మిద్దియే. ౮

ఉ॥ ఎంత నవీనశాస్త్ర ముదయించిన నించుకమాఱ దార్షసి
ద్ధాంతము సర్వకాలముల తత్త్వము శాస్త్రపురాణవేదవే
దాంతములందు నున్నది భవార్ణవతారకమైన చిత్తవి
శ్రాంతిని గూర్చు నర్థులకు సద్గురుపీఠము లెల్లకాలమున్. ౯

ఉ॥ ధారుణి దేవతల్ గ్రహణధారణముల్ సమదృష్టిఁ బెంచి మ
న్నారుగ నాల్గువేదములు నాలుకపై నటియింపఁజేసి క
న్నారుగ మౌనదీక్షలఁ గనంబడనట్టి సువస్తు వెట్టు లు
న్నారము నేటివార మసువారము నిల్పిరె పెద్దభారమై. ౧౦

శా॥ శాస్త్రాభ్యాసము, దేవతాగురునమస్కారంబు లేకే యస
చ్ఛాస్త్రల్ ఛత్రము దాల్చి సిద్ధి నిడు విశ్వాసంబు ఖండింతు వా
క్ఛస్త్రంబుల్ గొని పామరుల్ కడు బ్రహర్షంబంద వారింపఁగా
శాస్త్రన్ గానఁగరా మిఁకేమిగతి కృష్ణా, యోగిరాడ్భూషణా! ౧౧

ఉ॥ దేవునితోడఁ బుట్టె మన దేశమున న్నిగమంబు లప్పుడీ
పావనభూమికిన్ దుల ప్రభావమునం దిల లేదు పూర్ణమై
కేవలతత్త్వమున్ దెలిపెఁ గ్రీస్తుకువెన్క నదెన్నినాళ్ళకో
లేవదొడంగెఁ జెప్పునవలేపమునన్ మతిలేనిదేశముల్. ౧౨

ఉ॥ భావమునందు ముందుగఁ బ్రభావమునన్ బరిపూర్ణులై యహం
భావము మాని దేవుని సమానవిభూతిని గాంచి రార్యులీ

పావనభారతావనిఁ బ్రపంచము నిన్ననె నిద్రలేచి స
ద్భావము లేక యార్యుల నధఃకరణం బొనరించునేఁ డహో. ౧౩

ఉ॥ రెండును రెండు నాలుగు ధరిత్రిఁ ద్రికాలములందు సత్యమం
దుండదు భేద మెందు నెపుడో వచియించినవంచు నమ్మకం
బుండదుగాని శాస్త్రముల నున్నది నిత్యము నిన్ననుండి యె
ల్లుండికి మాఱుచుండు నిపు డుజ్జ్వలమైన నవీనశాస్త్రముల్. ౧౪

ఉ॥ సమ్మతి మ్లేచ్ఛభాషలకు ఛాందసుఁ డప్పకవీంద్రుఁ డిచ్చె ము
న్నమ్మక చెల్ల యెందు వ్యవహారపుహానికి జంకి కాదె ప్రా
ణమ్ములు పోవునట్టితరుణమ్మున యావనభాషల న్నిషే
ధమ్మొనరించె శాస్త్రములు ధర్మము తత్త్వముకాచు బుద్ధితో.

మ॥ వ్యవహారంబున కంచు నొప్పుకొన ముంపంజొచ్చెఁ బో కొంప లి
ట్లవుగాదంచన కన్యభాష పరధర్మావేశముంగూర్చి మా
ధవసంసేవల నార్చి లౌకికపుచింతల్ పేర్చి స్వేచ్ఛాసము
ద్భవదుస్తంత్రములందు మార్చి పరమార్థం బెట్లొ పోకార్చుచున్.

ఉ॥ కొల్లగ నిండియున్న దెటకుం జననేల జగాన నెల్లెడం
జిల్లరదారులన్ విడిచి శ్రీగురుసూచిత రాజమార్గమం
దల్లనఁ బోవు భక్తుల కహో మును లందఱుకన్న హాయి రం
డెల్లరమున్ భజింత మెపు డేగునొ ప్రాణము వట్టిమాటలన్. ౧౬

ఉ॥ అన్నియునున్న రాజులకునైనఁ బ్రశాంతి మనంబులోపలన్
సున్న సమర్థుఁ డేని వగచున్ బరిశోధన లెన్ని చేసియున్
మున్న యెఱుంగలే రెటులఁ బోవునొ భూతము లెన్ని భంగులం
దున్నది బ్రహ్మ మీవు నది యొక్కడె సూ గురుసూక్తిఁ గన్నచో.

చ॥ కలుగుట దుర్ఘటం బెటులొ కల్గినచోఁ బరమార్థబుద్ధి యి
క్కలి ఫలియించి శీఘ్రముగఁ గంజభవాదుల కెంత చేసినన్
గలుగని సత్ఫలంబు క్షణకాలమునం ఘటియించునంచుఁ బె
ద్దలు వచియించువాక్యములె తారకముల్ భయవారకంబులున్.

శా॥ బాలత్వంబునఁ జిత్త మచ్ఛమగుఁ గాపట్యంబు లేకుండ మా
యాలోలంబగు నావలన్ దను వదే పా రంభమం దల్పమై
స్థూలంబౌఁ గద యేండ్లు చన్న నటు ముందుం బూర్ణమై తగ్గుఁ బో
కాలంబుం జనఁ బాచి పశ్చిమము నిక్కం బిప్డు వర్ధిల్లెడున్. ౨౦

ఉ॥ పౌండ్రకవాసుదేవులు ప్రభావవిహీనులు లోకమందుఁ బె
క్కండ్రు కలిప్రభావమునఁ గ్రాలుట వాస్తవతత్త్వవేత్తలౌ
వాండ్రకు జీవనంబును శుభస్థితియున్ గఱవయ్యె నెట్టు లై
కొండ్రొకొ వారు సాధుబుధగోష్ఠులఁ బ్రోచు స్వధర్మనిష్ఠలన్.

ఉ॥ స్థూలము సూక్ష్మమంచు నిరుత్రోవలు ధర్మము, సందు నాద్యమున్
బాలనసేయఁగాఁ దగును పార్థివుఁ డన్యము సాధుసేవలన్
శీలమునన్ ఘటించుఁ గలఁచెన్ గలి రెంటి నికేమి దిక్కు వే
దాలకు ధర్మరక్షకవతారము శౌరి ధరింపకున్నచో. ౨౨

ఉ॥ పావకసన్నిభంబగు భవంబు మనం బతిచంచలం బెటేఁ
బోవు ధనంబు, సంతతియుఁ బోవును గీర్తియుఁ బోవు నెంటరా
వేవియు వేయు నేమిటికి విజ్ఞులు తజ్జ్ఞులు మున్న తెల్పిరెన్
ద్రోవకు సాటిరావు పెఱత్రోవలు పావను జేయ జీవునిన్. ౨౩

ఉ॥ ఏమొనరింప నేమి యగు నీ భరతావని మున్ను నేఁడు నే
మేమిట వన్నెకెక్కినవియే మెటులేనియు నిల్వఁబెట్ట నా
నేమరకుండ నాంధ్రజను ల్పరిపాటి మెఱింగి ధీరులై
సేమము గాంతు రింక పరసీమల కెల్లను దామె నేతలై. ౨౪

ఉ॥ తెల్పెడు పెద్దలం గొలుచు ధీరత లేమి నహంకరించి నేఁ
డల్పులు స్వేష్టవాసనల కడ్డని యెడ్డెలదొడ్డిఁ బెట్టి యే
కల్పములేని జల్పముల కంఠము బొంగురుపోవ నాడి సం
కల్పితనీచసిద్ధులను గాంచి హసించెద రెంత వింతయో. ౨౫

ఉ॥ పాడినపాటె పాడ వినువారికి భారమె యౌను గాకిటుల్
పాడియుఁ బంథయున్ దొలగువారిని దారికిఁ దీయఁదీయఁగాఁ

బాడిరి పాడుచుండి రికం బాడెద రెందటో నన్నుబోంట్లు కా
పాడంగ సాధులన్ భవము పారముఁ జేరుచు సారవాక్కులన్. ౨౬

శా॥ బెంగాలీయుల కాంగిలేయుల కహో విశ్వోపదేష్టృప్రతి
ష్ఠం గల్పించి తదీయమార్గముల నాస్థం బట్టి యాత్మీయ బు
ద్ధిం గోల్పోయిన ముగ్ధు లిద్ధమతులై దీపింపఁ ద్రైలింగ్య భా
షం గుర్వీశ్వరతత్త్వబోధకములన్ సద్గ్రంథముల్ చెప్పితిన్. ౨౭

క॥ అసలే కలికాలము పం,చసహస ములందు జరుగ సంకరమగు నన్
ముసలయ్యలన్నమాటకు,దొసఁగగుననినేటివారుతొడఁగుదురేమో!

శా॥ యోషాశూదు లకున్ బురాణము లవెన్నోయుండ గీర్వాణమం
దీషత్తద్గతభావముం దెలియలేరీ నేటివా రంచు మున్
భావన్ నన్నయభట్టు వా సెను బ బంధం బద్దియున్ గా మ్యాదు
ర్భాషాభూషులఘోషలో నణఁగె సంరక్షించువా ర్లేమిచే. ౨౮

ఉ॥ నన్నయ చిన్నయల్ మొదలనన్ దుదిగాఁగల గ్రంథరాజిలో
నున్నతమైన భావములె యున్నవి మొన్నను నిన్న నేఁడొ యి
న్నన్న! యసభ్యభావము లనంతము పొత్తములందు నచ్చులై
వన్నెకు నెక్కె సత్కవులవాక్కులు నొక్కుచు నున్న వక్కటా!

శా॥ ఆచారం బెటొ కట్లుబొట్లునటె తో యంబోల దార్ఢ్యంబులన్
బా చీనుల్ రసలుబ్ధులొట నెటు సైపంజూతురే కాక యి
ట్లే చెత్తేనియు మోపుగట్టి సభ నెంతేఁ బేరుతో నమ్ము నీ
వాచారంభులప ల్లదంబులను సైపంజాల రొక్కింతయున్. ౩౦

మ॥ అరయన్ బ హ్మామెయౌ రసంబనుచు బ హ్మాజ్ఞాను లన్నారు దు
ర్భరమౌ గా మ్యరుతంబులన్ వినఁగఁ గర్ణంబుల్ గడున్నొచ్చు నీ
శ్వర మెట్లోర్వఁగ వచ్చు బ హ్మామె ప పంచంబన్మహావాక్యవి
స్ఫురణన్ దాలిమి గొంత పూనఁగను వచ్చున్ గాక చీకాకులో.

ఉ॥ నావశమా పరాంబికమె నాకల మాడఁగఁ జేయఁ బాయకే
నీవిధి వా యుదానఁ దరమే ననుబోటికి నిట్టిచో నహం
భావము పూని పల్కె గురుభావములన్ నిజధర్మదీక్షపై
భావము నిల్పుటాంధు ల స్వభావముగా విధియింపుదైవమా. ౩౧

## పారితోషిక ప్రదానము

మ॥ అమృతానందుని పారితోషిక మనన్యాప్య మ్మీ తెల్గుదే
శమునం దుత్తములైనవారి కది యర్చల్ సల్పి త్రైలింగ పీ
ఠమునం దర్పణసేయుచుండుదురు నిష్ఠా శ్రేష్ఠమౌ జ్ఞాన బ
జములన్ నిల్పఁగ దిక్ప్రదర్శనముగా సంపన్నభూపాళికిన్.



## శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ విజయవాడ శాఖా స్థాపనావసరమున రచింపఁబడినవి.

ఉ॥ ఈశ్వరవత్సరాదిని ఫణీంద్ర కలాపు త్రిలింగపీఠమున్
విశ్వజనోపయోగపదవిన్ బెజవాడను నిల్పె దుర్గ స
ప్తాశ్వ సుధాకరుల్ గలుగు సంతతి కాలము జ్ఞానబీజముల్
శశ్వదనూనసత్ఫలములన్ వెలయింపఁగ సాధుగోష్ఠిలోన్. ౧

ఉ॥ ఏనుఁగు నెక్కివచ్చి ద్విజు లెల్లఁ దనుం గొనియాడ నుత్తమ
స్థానమునందు నిల్చి కవిచంద్రుఁడు శ్రీ పదుఁ డాంధ్ర కృష్ణుఁ డి
మ్మానితపీఠశాఖ బుధమండలిలోఁ గొనియాడె నార్యవి
జ్ఞానము దుష్కలిన్ గడుఁబ్రకాశము దీననఁ గాంచునంచొగిన్. ౨

ఉ॥ సాటికవీశులన్ సభల సన్నుతిఁజేసి బహూకరించె నా
నాటికి సోమయాజియు ఘనంబుగ రాజగు కృష్ణరాయఁడా
మాట త్రిలింగపీఠ మసమానముగాఁ గడు నిర్వహించు నీ
నాటికి సాటి దానికిఁ గనంబడ దర్హులఁ బూజసేయుచోన్. 3



## బ్రహ్మశ్రీ వెందుకూరి నరసింహశాస్త్రి, శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రి గార్లకు స్వాగతము

మ. రా. శ్రీ. మంత్రిప్రగడ నరసింహము పంతులుగా రధ్యక్షులు.

ఉ॥ నీ నరసింహ నామ మది నిక్కముఁ జేయఁగఁ గాదె, పీఠికా
స్థాన మలంకరింతు, బుధచంద్రుల ఖ్యాతులుగా గ్రహింతు, స

మ్నానముఁ గాంతు, వార్యజనమండలియందలి బ హ్మవిద్యకుఁ
స్థానమనై ధరించెదవు, శంకరత త్త్వవిశారదత్వమున్. ౧

శా॥ నీ కంఠెన్ ఘనుఁ డెవ్వఁ డార్తులకు సందేహానలం బార్ప న
స్తోకా ద్వైత సుధాసువృష్టి, విబుధస్తోమాంబుధిఁ సోముఁడై
వీఁకఁ బో తువు నిస్పృహుండ వయి యుర్విఁ దేవతాత త్త్వముఁ
సాకల్యం బొనరింతు నీ కిదె నమస్కారంబు ధీరో త్తమా ! ౨

కం॥ కొండవలెఁబండితుల కిల, నండగ నిల్చితివి పో!మహా ప్రళయమునన్
బండలు బ ద్దలుచేసి య,ఖండబ హ్మంబు నెదుటఁగనఁబఱతు బళీ! ౩

శ్లో॥ భా తాగురు ర్యస్యచ రామశాస్త్రీ, సద్దేశిక స్తార్కికచక వ
సోయంనృసింహోవిబుధేంద్రచంద్రః, త్రిలింగదేశేవితనోతికాంతిమ్.

మ॥ నరసింహుం డొకఁ డగ్రపీఠమున విన్నాణంబుగా నొప్పఁగా
నరసింహాఖ్యబుధేంద్రు లిద్ద ఱిట నన్మానంబునుం గాంచి యె
ల్లరకుం స్వాంతములందుఁ గూర్తురు మహాహ్లాదంబు తై లింగ్యదే
శరమానాథులు మంత తర్కవిధిశాస్త్రక్షోణిభృత్కోటులై. ౩

## 7 ఆ అమృతానందనాథజయంతి

1937.

అధ్యక్షులు : శ్రీ పాద కృష్ణమూ ర్తిశాస్త్రిగారు

రు 116 లచే బహూకరింపఁబడినవారు

(1) బ హ్మశ్రీ దెందుకూరు నరసింహశాస్త్రిగారు, (2) బ హ్మశ్రీ శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిగారు, (3) బ హ్మశ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారు.

మ॥ అమృతానందునిపారితోషిక మనన్యాపా ప్య మీా తెల్గు దే
శమునం దు త్తములై నవారి కది యర్చల్ సల్పి తై లిఙ్గ్య పీ
ఠమునం దర్పణ సేయుచుందుదురు నిష్ఠన్ శే ష్ఠమా జ్ఞాన బీ
జములన్ నిల్పఁగ దిక్ప్రదర్శనముగా సంపన్నభూపాళికిఁ. ౧

శా॥ భోజాస్థానమునందు నుండఁదగు ముమ్మూర్తుల్ సభామధ్యమం
దోజల్ రాజులు సర్వవిద్యలకు నీ యోజన్ సమావేశమై
పూజల్ మత్కృతముల్ గ్రహింతు రఁట నాపుణ్యంబె పుణ్యంబు ని
ర్వ్యాజప్రీతి ననుగ్రహింతు రిటకున్ రప్పింప నే నేర్తునే? ౨

శా॥ తీర్థత్వంబు నొసంగఁజాలుదు రహో! తీర్థాళికిన్ వీరు స
ర్వార్థప్రాపకు లిట్టి ధీరులను గుర్వాజ్ఞన్ దలం బూని సి
ద్ధార్థుల్ నేఁడు తిలింగపీఠమున నాహ్వానించి మన్నింతు రా
త్మార్థం బిట్టివి గల్గు టిక్కలి నసాధ్యం బెట్లు చేకూరెనో! ౩

ఉ॥ నూటపదారు లిత్తుమని నోట వచింపఁగ సిగ్గు మాకు మీ
బోఁటుల కేడఁ గల్గుదురు పోటికి సాటికి నొక్కకోటియున్
గోటికిఁ జాలదన్న నిటకున్ బ్రసరించిన మీపదంబులన్
మాటికిఁ బ్రస్తుతించుచు ఘనంబగు సిద్ధిని గాంతు మిద్ధరన్. ౪

శ్లో॥ శ్రీపదా శ్శ్రీపదాంభోజమకరందరసాత్మకాః
శ్రీపాదకులసంభూతా స్త్రిలింగేషు ప్రతిష్ఠితాః. ౫

శా॥ శ్రీపాదుం డితఁ డక్షపాదుఁడు సుమీ శ్రీ నారసింహాఖ్యతో
మా పుణ్యంబున నేఁడు రాజులు సభామధ్యంబునన్ సూర్యరాట్
భూపారాధ్యుఁడు రామశాస్త్రు లయశంబు న్నిల్పఁగాఁ బొల్చువాఁ
డీ పృథ్విన్ సకలాంధ్రలోకమున కెంతేఁ గూర్చుఁ బ్రఖ్యాతినిన్. ౬

క॥ రాయఁడు మహామహోపా
ధ్యాయుఁడు శిష్యులకు మూఁడుతరములకున్ హృ
ద్ధ్యేయుఁడు సత్కవిగేయుఁడు
మా యతిథిగ వచ్చె నేఁడు మా భాగ్యమునన్. ౭

శా॥ తాతారాయఁడుశాస్త్రికిన్ సముఁడె యేతన్మాత్రుఁ డాంధ్రావనిన్
ఖ్యాతుండై వెయిమోములం బలికి శిష్యవ్రాతమున్ బ్రోచు వి
ద్యాతత్త్వంబు నెఱింగి పూర్ణముగ దివ్యంబైన వాగ్ధోరణిన్
నీతిన్ ధర్మముఁ దెల్పఁజాలు నితనిన్ గీర్తింప నే నేర్తునే. ౮

శా॥ గంగన్ మున్ను భగీరథుం డటులు వేడ్కన్ దెచ్చి యద్వైత వి
ద్యం గల్పించెను జ్ఞాన మాంధ్రులకు నీతం డెంతపుణ్యుండో వి

నిం గొల్తు న్మది దెందుకూరికులమాణిక్యంబు శ్రీ నారసిం
హుం గుంటూరిపురీనివాసు నిగమాంతోద్ధారకుఁ దారకుఁ. ౯

క॥ వేదాంతసార్వభౌముఁ నిఁ గాఁ దెలియుదు రాత్మవిదులు కలకాలం బీ
శ్రీదెందుకూరి నృహరిఁ, వా దేలా! యెదుటఁ దోఁచు వాక్పతినిజమా.

క॥ ప్రకటశ్రీపదనరహరి, యొక తార్కికచక్రవర్తి యుండఁగ విబుధా
ళికి నండదండయై నా,స్తిక భయమిఁక నేల యాంధ్ర దేశమునందున్.

కం॥ అరుదగు సమాఢ్విరుదము
ధరఁ దాతారాయశాస్త్రి దాలిచి వైయా
కరణప పంచ మేలఁగ
సురనరభాషలకు భయము సుంతయుఁ గలదే. ౧౨

శా॥ విద్యాగంధము లేనివారు కలిలో విశ్వోపదేష్టృత్వమున్
సద్యస్సిద్ధిగఁ బూని యార్షకృతులన్ సంస్కారమున్ జేయుటే
యుద్యోగంబుగఁ బూని తీసెదరు పోనున్నట్టి పా ణం బహో
విద్యావంతులనోరు మూసి బుధవిద్వేషంబు పోషించుచున్. ౧౩

ఉ॥ ధీరులు సత్యదృక్కులు మదిన్ సకలంబు నెఱింగి తెల్ప న
వ్వారల యాశయం బెఱుఁగువారికి, వారిని మించి నేఁడు సం
స్కారము చేయువారలకుఁ గావలయున్ గద మూల మార్య సం
స్కారము సంప దాయముగ సాఁకఁగ నిల్పుఁడు జ్ఞానబీజముల్. ౧౪

చ॥ తనమది సంశయం బుడుగఁ దన్ను భజించిన శిష్యసంశయం
బును విడఁగొట్టి దిగ్విజయమున్ నృపసన్నిధి నొంద దీక్షతో
మునుపటివారు నేఁడు మన మోల వెలుంగు సుధీంద్రులెల్ల వి
ద్యను గడియించి రందుఁగల యందము చంద మికెందుఁ గందుమే.

మ॥ అమృతానందగురూత్తముఁన్ గొలుచు పుణ్యాంబేగదా నేఁడు పూ
ర్ణముగాఁ బండి యనన్యసాధ్యుల మహాపౌ ఘాత్ములన్ బహ్మతే
జము రూపొందిన మూఁడుమూర్తుల సమర్చల్ సేయఁగాఁ జాలు భా
గ్యము కంటిన్ నరసింహరాయల నిదే గంటిన్ సమక్షంబునన్. ౧౬



శ్రీ భాస్కరాయ నమః

# 8 అమృతానందనాథ గురుజయంతి
1938.

ఉ॥ వేమరు తెల్పవిందుము ప్రవీణులు మున్ను 'గురుం ప్రకాశయే
ద్ధీమహిమత్సో నమంత' మని, ధీరు భవార్ణవతారకుల్ మహో
ద్దామగుణుల్ రవిప్రభ సుధామధురోక్తి వశీకృతాశ్రిత
స్తోమముఁ, దమోభిదుల్, గురు, బుధుల్ వినవెంచి యుపక్రమించెదన్.

ఉ॥ పెద్దలు పెట్టిపోయినవి పీఠము లెన్నియొ యున్న నేటి యా
పద్దశ మాన్పలే కవి ప్రభావము గోల్పడఁ జూచి ధర్మముల్
దద్దయుఁ బెంప సద్గురుఁడు దా నెలకొల్పెఁ ది లింగపీఠముల్
దిద్దఁగఁ దెల్ప నాశ్రితుల, ధీరుల గౌరవ మిట్లు నిల్పఁగన్.

శా॥ఆచార్యత్రయపీఠముల్ ప్రతిభ నార్యావర్త ధర్మమ్ములన్
బ్రాచీన ప్రతిపాదితంబులను నిల్పం దెల్ప నిన్నాళ్ళు న
ర్వాచీనుల్ ప్రజలున్ బ్రభుల్ వినయసంపద్భక్తిఁ గోల్పోయి య
య్యాచార్యత్వము నిల్పరైరకట వాచారంభులై దంభులై.

మ॥ మనపెద్దల్ మును దెల్పినట్టివి జగన్మాన్యంబులౌ ధర్మముల్
వినరున్ సల్పరునుం బరోక్తుల సదా వించున్ బరప్రేరిత
మ్ము నిజద్వేషియునైన డెందమున నమ్మోహంబునుం బొంది స
జ్జనదూరంబగు దారిఁ బోయెదరు శిష్టస్వాంతముల్ నొవ్వఁగన్.

శా॥శ్రుత్యర్థంబు స్మృతుల్ ప్రచారము పొనర్పంగాదె? యట్లేమునున్
బ్రత్యుత్థానముఁ జేసి స్వాములకు ధైర్యంబూని యీనాఁడు పా
శ్చాత్యస్వాంతుల శిష్టసమ్మతసదాచారంబునన్ నిల్ప ని
ష్ప్రత్యూహంబు త్రిలింగ రమ్మునఁ బ్రారంభింతు మెన్నెన్నియో.

ఉ॥ వేదము శాస్త్రముల్ గళలు విజ్ఞులు మెచ్చఁగ నేర్పువారికిన్
వేదికలందుఁ బూజ లిడ వేడుక కల్గిన, దానికైన సం
పాదన యుండఁగా వలదె భాగ్యము గల్గినవారి కిందు న
మ్మోదము పెట్టఁ డీశ్వరుఁడు పోవు నెటో సకలప్రచారముల్. ఉ

ఉ॥ పెద్దలయందు గౌరవము వేదములందు బ్రమాణబుద్ధియున్
విద్దెలయందు శ్రద్ధయును వేత్తలయందుఁ బ్రపత్తియున్ మహా
పద్దశలందు ధైర్యము నుపాసనదీక్షయు నిన్నిలేమి యీ
కొద్దితనంబు వచ్చె బుధకోటికి మాటికి మాటలేఁటికిన్.

ఉ॥ ఒప్పులు లేక యుంకుటయె యొప్పఁట, యిప్పుడు తప్పు లేమియే
తప్పఁట, సద్గురుల్ చనినదారులు తప్పఁట, సత్యశౌచముల్
తప్పఁట, తాలుకూతలు యథార్థములంట, విధుల్ నిషేధముల్
తప్పఁట, వేదశాస్త్రములు తప్పఁట, గొప్పఁట కొట్టఁ జప్పటుల్.

చ॥ పడమరగాలిదుమ్ము పడి బాటలు గానవు కన్ను, లక్షులున్
దడఁబడు, వెన్కమాటలు వినంబడ, వారెను గుండె, ప్రొద్దెటో
గడపఁగఁ జూచు, నిద్ది యనఘుంబు నఘుంబన కాస్య మెండ నె
క్కడ నొకచుక్క చిక్క దెటుగాచుటసొక్కిన మంచిమొక్కలన్. ౧౦

శా॥ గుర్వాశీర్వచనప్ర భావమున జంకున్ మాని యాంధ్రా ఖ్యమా
నుర్విన్ మానవు లెల్లరున్ దనిసి సద్యోనిర్వృతిం బొందఁగా
నర్వాచీనులచిత్తమందలి యపోహల్ కుంకగ్రంథంబులన్
బౌర్వాపర్యము లెంచి చెప్పితిని విద్వాంసుల్ ప్రహర్షింపఁగన్. ౧౧

మ॥ అమృతానందగురూక్తులన్ దెలుగునం దాంధ్రుల్ ప్రహర్షింపగ్రం
థము లేఁ జెప్పితి, వాని యర్థములు భక్తశ్రేణికిం దెల్పు హృ
ద్యముగా నియ్యవధానిపీఠమున, గుర్వాజ్ఞన్ సదాశివ్యబృం
దము దేశానఁ బ్రచారమున్ జలుపఁ శ్రద్ధంబూనె నేఁ డెంతయున్. ౧౨

మ॥ మమతాహంతలు వాసనల్ వదలుచున్ మానావమానంబులన్
సముఁడై యెవ్వఁడు సత యాగమున భిక్షాదీక్షఁ బంచాబ్దముల్
విమలుండై వహియించె ధీరుఁడయి యీ విజ్ఞుండు సుబ్బావధా
నిమనీషిన్ గురుఁ డోము నెల్లపుడు సందేహంబులన్ బాపుచున్. ౧౩

ఉ॥ తమ్ములు తోడుగాఁగ నవధానియు వేంకటరెడ్డి సద్గురున్
నమ్మినధీరులై జగమునన్ వెలయింతు తి లింగపీఠమున్

సొమ్ము శ మంబు చూడక తి శుద్ధిగ భక్తులఁ గూర్చుకొంచు; లో
కమ్మున వీరికిఁ జయముగల్గఁగ దీవనసేయుఁ డెల్లరున్. ౧౪

ఉ॥ సార్థకనామధేయమున సాకినఁ దమ్మణి యమ్మవో లె రం
గార్థ శరీరధారిణి మదగ జ పుత వతీలలామ గు
ర్వర్థ సమర్పితాత్మ పరమార్థమునం జెయిదోడు నాకు శ్రే
యోర్థిని దాని నెంతుఁ బయి నుండెడు రెండవనన్నుఁగా మదిన్.౧౫

ఉ॥ అంగము లంతరంగములునై కడువేడ్కఁ ది లింగపీఠమం
దుం గురుదీక్ష భక్తు లిటు తోడ్పడి నిత్యము వేంకటేశు పూ
జం గలివేళలన్ జలుపఁజాలుట మేలగుఁగాదె వారి కే
భంగము గల్గకుండఁగ సభాసదులార! యనుగ్రహింపరే. ౧౬

సీ॥ లేరు సత్పురుషు; లున్నారన్నఁ గాలంబుఁ
గష్టంబుగా నెట్లొ గడపుచుండు
లేరు విద్వాంసు; లున్నారన్న నేడనో
మాత్సర్యయుక్తులై మసలుచుండు
లేరు పో రాజు; లున్నారన్నఁ బేరాసఁ
గరము కరగ హాకాంక్ష నుందు
లేరు వదాన్యు; లున్నారన్న సేవాను
కూలురై యిత్తురు కొంతకొంత
ఎట్లు ధర్మంబు నిల్చునో యింకమీద
రాజులకుఁ బట్ట దేదియుఁ, బ జలు జడులు,
దేశనాయకు లలసిరి దిక్కులేక
కవులు తారకు లింక నీ కలి నరులకు. ౧౭

పారితోషిక ప్రదానము

సీ॥ ఒకనోటిమీదుగా సకలభారతము నాం
ధ మునఁ బల్కఁగఁజాలు దక్షుఁ డొకట
వేదార్థభావంబు విప్పిచెప్పంగ వా
చస్పతి యనఁజాలు చతురుఁ డొకట

భాష్యకారుం డక్షపాదుండు పాణిని
యన నొప్పు మూర్తిత్రయంబు నొకట
జయపూర్ణమహారాజచంద్రవిక్రమ దేవ
ముకుళిత శ్రీకరాంబుజము లొకట
మున్నధిష్ఠించు గురుపీఠమునను బళిర!
నిన్నుఁ బూజించుభాగ్యంబు నేఁడు గలిగె
దేవతలఁబోలు సభ్యులభావ మలర
సరసవాక్సాంద్ర! వేంకటేశ్వరకవీంద్ర ! ౧౯

చ॥ హరిహరులట్లు శంకరుఁడు నంబయు నట్టుల నెల్లవెంటలన్
దిరుగుచు నేకమై జగదధీశుల కప్పము లందుకొంచు దు
స్తరభవవార్ధిఁబోల్ శతవధానశతంబుల దాఁటిమించు నీ
తిరుపతి వేంకటేశకవిధీరుల గౌరవ మేరికౌ నిలన్. ౨౦

సీ॥ పంచమామ్నాయంబు ప్రజలెల్ల మెచ్చఁ బా
డించి రంగాల నాడించినారు
శతవధానముల విస్మృతపూర్వములను జూ
పించి పండితుల మెప్పించినారు
దేవ్యంకితంబు ద్వితీయభాగవత మ
ర్పించి సద్గురునిఁ బూజించినారు
ఆబాలగోపాల మాంధ్ర లోకంబు నూ
రించి పద్యముల వర్షించినారు
దిట్టలై తాకువారల నెట్టి మొట్టి
బెట్టిదపువేళలను దమ బెట్టునిలుపు
కొనుచుఁ గవిలోకమున కెల్లఁ గొలత బుట్టి
లైరి తిర్పతి వేంకటేశాఖ్యకవులు.

శా॥ నూలుంబోగునఁ దన్పుటౌనుగద చంద్రున్ నేఁ గళాపూర్ణ భూ
పాలోత్తంసవతంసునిన్ రసికహృద్వారాశిపర్వేందు వా
గ్లీలాకేళి సుధాప పుష్టవిబుధున్ గీర్వ్యాంగనావల్లభున్
జాలన్ నూటపదార్ల వేంకటకవిన్ సంతృప్తునిన్ జేయుటన్.

ఉ॥ పద్యముఁజెప్ప వేలిడెదు పార్థివు లెందఱో యుండ భక్తినేఁ
బద్యము చెప్పి యిచ్చు నొకపాటిగ హించుట దా క్షుపండు నై
వేద్యము దాసురా లిడిన వేదికపైఁ దులసమ్మ కొన్న య
ట్లాద్యుఁడు వేంకటేశుఁడు మహాకవి నన్ను ననుగ హించుటల్ ౨౩

ఉ॥ ఓడుటయన్ననోర్వని మహోద్ధతుఁ డీతఁడు వేంకటేశుఁ డీ
నాఁ డనివార్యమైనకతనన్ గెలుపోటములందు నేరికిన్
నాడెను తగ్గకుండు కదనంబున దేశికుతోడ నాడు వా
డోడఁగ నొక్కరొక్కరికి నొండు వచింపఁగ నెంతవారలుౝ. ౨౪

ఉ॥ ఏరులు పొంగిపార నెవరేమియొనర్పఁగఁ జాలువా రహో
దూరమునుండి మొక్కెదరు దోసిట కుంకుమ పూలు చల్లుచుౝ
ధీరులు మీరు పోర నిఁకఁ దెల్పెడువారలు లేరులేరు మీ
వైరముమాన్పి మాకు భగవంతుఁడు మేలొనరించుఁగావుతౝ. ౨౫

శ్లో॥ భోజస్యేవ ముఖాంభోజమ్ యస్య దృష్ట్వా మహాకవేః
భవంతి కవయ స్సోఽద్య వేంకటేశః ప పూజ్యతే. ౨౬



శ్రీ భాష్యాయ నమః

## అమృతానందనాథ గురుజయంతి

విజయవాడ—1939

ఉ॥ మానసచక్షుౝ దగిలి మానులు మున్నది యెందువా లెన
ద్దానిని నైమిశం బని సదా యట సల్పిరి సత యాగ మీ
స్థానము కృష్ణనామమునఁ దా విజయం బిడుఁ దెల్గు భూమికిౝ
గానఁ ది లింగపీఠ మిట నాటితి మిందునె నిల్చె డెందముల్. ౧

చ॥ తిరుమల శ్రీనివాస వినుతిౝ జెలు వొందెడు కల్పశాఖికిౝ
గురువరుఁ డంటుకట్టి యెటొ కుండకు దింపిన దానిఁ దెచ్చి యీ
పురమున నాటినాము సురభూజము సద్ద్విజసేవ్య మిద్ది శ్రీ
కరము తి లింగపీఠ మని ఖ్యాతి వహించు జగద్ధితంబుగౝ. ౨

ఉ॥ ఏను త్రిలింగపీఠమున నెంతయుఁ బూనిక సత్కళాన్వితుల్
క్షేమముగా స్వవిద్యలను శిష్యుల కీఁ దగు దారు లన్నియున్
సామముతోడఁ దెల్పుదుము సర్వజనుల్ దరియింప బీజముల్
భూమిని నిల్పి పుణ్యమునఁ బొందెడిక నేఁటికి రెండు మాటలున్. ౩

ఉ॥ జంకి కదా ద్విజోత్తములు శాస్త్రము వీడుచు నన్యభాషకున్
గింకరులై స్వధర్మముల నెట్టుచుఁ బట్టిరి మ్లేచ్ఛధర్మ మీ
వంకరమాన్పి బుద్ధులకు భారత సంతతి నెప్పటట్ల ని
శ్శంకతఁజేయు ధీరులఁ బ్రశంస యొనర్చెద మాటిమాటికిన్. ౪

ఉ॥ బాపలు రాజు లూరుజులుఁ బాదజు లిక్కలి నెల్ల వారలున్
బాపురెమై స్వధర్మమును బాసి స్వరూపము మాసి వాసికై
యేపనియేని చేసి యెటులే సిరికై యొనరింతు దోసమో
శ్రీపతి నీవుగా కెవరిచే నగు నీ సడిఁబాపి ప్రోవఁగన్. ౫

ఉ॥ దేవుని "దోసిరాజ"ని సుధీవరులన్ దెగనాడి శాస్త్రపున్
దోవలఁ గంపఁగొట్టి వినుతుల్ పొనరింతురు లాతివారి, దు
ర్భావులు వారి మాటలను బట్టి చరింతురు లోకమాత్రులో
నేవము బుట్టు ధీరులకు నీశ్వర! దిక్కెవఁడీవు దక్కఁగన్? ౬

మ॥ అధికారంబును మించి కృత్యములఁ జేయంజూచు బాలుండు దా
నధికారోచితమైన కృత్యముల జేయంబోడు లోలుం డహో
యధికారంబును వీడి నీచకృతిఁ జేయం జూచు మూఢుండు మా
యధికారంబున మమ్ము నిల్పఁగదె దేవా! ధన్యులం జేయుచున్. ౭

ఉ॥ వింతలులేవు విజ్ఞులకు వీరుల కెత్తతిఁ గృత్యమెల్లఁ గా
వింతురు శాంతచిత్తముల, వేడుకకై భగవంతుఁ డెప్డు ని
శ్చింతగ నింతలంతలుగఁ జేయుచు జీవులఁబట్టియాడు, నే
వింతయు వాని, నింకెవరి వేసము లేమి యొనర్పు దాసులన్. ౮

ఉ॥ వేదము శాస్త్రమున్ గళలు వేత్తలు తీర్థము సంస్కృతంబు ని
మ్మేదినికిన్ సమంబగుట, మేలగు దావిడు లాంధ్రు లేకమై

వేదికఁగూడి సత్కళల వృద్ధికినై కృషి సల్పుఁ డేఁటికీ
భేదము వాదముల్ శ్వపచవృత్తికినై మది ఖేద మక్కటా! ౯

ఉ॥ వాదము భేదముల్ మఱచి పండితులెల్లరు కర్మభూమిలో
మోదముతో స్వధర్మమును ముఖ్యముగా నిడికొంచు మించి ని
ష్ఖేదపదంబుఁ గాంచుటయె కీర్తికరంబగు మున్ను పెద్ద లా
మాదిరి భారతావనికి మంగళముల్ సమకూర్చి రన్నిఁటన్. ౧౦

మ॥ పరవస్తు ప తిభుల్ మహామహులు శుంభత్కీర్తులాంధ్రో ర్వికిన్
వరభూషల్ పరవస్తుపండితులు నిల్వం బెట్టు టేకాక త
ద్గురుతన్ మించుటఁ బ్రిన్సుపాలువయి నీకున్ మా తి లింగాఖ్య స
ద్గురుపీఠంబున నగ పీఠమున దక్కన్ బూజ రామానుజా!

శ్లో॥ మానసే మందిరే యస్య శంకర శ్రీ గురుశ్శివా
శ్రీరంగే మంగళే నిత్యం ప పూజ్యం తే ప తిష్ఠితాః. ౧౨

శ్లో॥ నృసింహభారతిచ్ఛాత్రో గురుభక్తశిఖామణిః
పీఠే తి లింగపీఠేఽగే సుబ హ్మణ్యః ప పూజ్య తే. ౧౩

శా॥ ఖ్యాతుం డౌదువు వావిలాల కులమం దాంధ్రా వనిన్ సర్వ వి
ద్యాతంత మ్ములబ హ్మసూత ముల సారాంశమ్మునుం దెల్పి నా
వో తత్త్వజ్ఞ! శివావధాని బుధ! సద్యోగమ్మునన్ నిన్ను ని
ర్ణేతన్ జేసె ది లింగపీఠ మిది క ర్తృత్వమ్ము రూ ంపఁగన్.

చ॥ ఇటునటుఁ బారఁజూచి యిదియేసుమి పార మటంచుఁ బల్కు వా
క్పటిమఁ గలట్టి ధీరుఁ డవికారుఁడు నైన శివావధాని నేఁ
డెటులొ లభించినాఁడిట సభేశుఁడుగాఁ గఁ ది లింగ పీఠమం
దిటునటుఁ జూడనేల జగమెల్లెడ నాంధ్రు లకీర్తిఁ జల్లుడీ. ౧౫

శా॥ ధీరుల్ గావలె విద్యలంగళల వృద్ధింజేయ శ్రీరామ చం
ద్రా రెడ్డిప భృతుల్ కడంగ మన యాంధ్ర ంబందు వైజ్ఞానిక
పా రంభమ్ములునెగ్గు టబ్బురమె మీరల్ పీఠలున్ వారలున్
జేరన్ భారతవర్ష మర్హ్మమగు వాసిం గాంచు విశ్వంబునన్.



# గు రు జ య ం తి

(1940 సం॥ నవంబరు 23, 24, 25 తారీఖులలో)

అమృతానందనాథజయంతి సందర్భమున

బ్రహ్మశ్రీ పండితప్రవర మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులుగారికి రు 116 లును,

బ్రహ్మశ్రీ 'కళాప్రపూర్ణ' జనమంచి శేషాద్రిశర్మగారికి
'మహాకవి' బిరుదము రు 116 లును,

మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారికి
'సాహిత్య ధర్మస్థాపక' యను బిరుదమును రు 116 లును సమర్పింపఁబడినవి.

ఆంధ్ర కవయిత్రి శ్రీమతి గుడిపూడి యిందుమతీదేవిగారికి
'కవయిత్రీమణి' యను బిరుద మొసఁగఁబడినది.

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ పారితోషిక ప్రశంస

క॥ శ్రీ విజయవాడ దుర్గా, దేవీకరుణార్ద్ర దృష్టి ధీరవరులకా
నేవేళఁ గనకవృష్టి సుధావృష్టియుఁ దుష్టిపుష్టి ధర్మముఁ దపమున్.

చ॥ ఇదియె త్రిలింగపీఠము, కవీంద్రులు వీరె, సమస్తదేవతా
స్పదమిదె సత్కళల్ చెలఁగుపట్టిదె ధీసుల కూతకట్టయి
య్యదె సకలాంధ్రభూమి కిది యాఁగద గుండియ పండితాళి సం
పద యిదె కర్మభూమికి శుభంబిదె యియ్యదె ధర్మబీజముల్. ౨

శా॥ కర్మజ్యేష్ఠుఁడు రామకృష్ణబుధుఁ డీకాలంబునన్ ధీసుఁడై
ధర్మారంభ మొనర్చి శాంకరము దత్త్వంబుల్ విమర్శించు దు
ష్కర్మల్ దుష్టమతప్రచారమును బెల్చం జేయ శిష్టాళికిన్
శర్మంబుల్ ఘటియించు నింతటిప్రతిష్ఠం గాంచిరే యెవ్వరున్. 3

సీ॥ ఒక నోటిమీఁదుగా సకలభారతము నాం
ధ మునఁ బల్కఁగఁజాలు దక్షుఁ డొకట
వేదార్థభావంబు విప్పి చెప్పంగ వా
చస్పతి యనఁజాలు చతురుఁ డొకట

భాష్యకారుం డక్షపాదుండు, పాణిని
యనఁనొప్పు మూర్తిత యంబు నొకట
శతవధానఖ్యాతి జగ మేలు కవిసింహ
వేంకటశాస్త్రి కవివరుఁ డొకట

గీ॥ మున్నధిష్ఠించు గురుపీఠముననె బళిర !
నిన్నుఁ బూజించు భాగ్యంబు నేఁడు గలిగె
దేవతలఁబోలు సభ్యులభావ మలర
శ్రీ కృపావర్మ జనమంచి శేషశర్మ! ४

సీ॥ బ్రహ్మాండ మంతయుఁ బాణిపల్లవమున
నమరంగఁ దెనుఁగున నాడె నెవఁడు
రామాయణంబుఁ గరామలకంబుగాఁ
జేకొని యెవఁడు వాల్మీకి యయ్యె
భాగవతార్థంబుఁ బల్కంగఁజాలె నె
వ్వండు శ్రీ గోవిందపాదభక్తి
లలితాంధ్రభాషలో లలితామహత్త్వంబు
దీక్ష రచించిన ధీరుఁ డెవఁడు

గీ॥ బుధుల మెప్పించు శ్రీ కలాపూర్ణుఁ డెవఁడు
జగతి జనమంచి శేషాది శర్మ నేఁడు
నాదు గురునాథుపేర సన్మానమునకుఁ
బాత్రుఁడై వచ్చి కొంట మద్భాగ్యగరిమ. ౫

క॥ శ్రీకరము కీర్తికరము మహాకవి బిరుదంబుఁ దగిన యట్లిచ్చెను సు
శ్లోకతి లింగపీఠము, నీ కో శేషాది శర్మ నిరతముఁ దాల్పన్. ౬

శా॥ అధ్వం బించుక దోఁపకెల్లెడ నధర్మాంధ్యంబు వ్యాపింపఁ ద
ద్విధ్వంసం బొనరింప బోధములు గావింపంగ, నుద్యుక్తుఁడై
మాధ్వీస్వాదుకవిత్వతత్త్వగరిమన్ బాణంబులం గూర్చు నీ
మధ్వశ్రీ యుతకృష్ణసత్కవికి సమ్మానం బివే యంజలుల్. ౭

## ఇందుమతీదేవి

మ॥ కవయిత్రీ మణి వైతి వీందుమతి భాగ్యం బిద్ది యీ గోష్ఠిలో
నవురా! యెంతటి కీర్తి వచ్చె బళి! కావ్యంబుల్ సతీధర్మసం
స్తవనీయంబులు పల్కుచుఁ సతులకుఁ దత్వంబు రూపింపు మో
కవయిత్రీ మణి! సర్వసంపదలు గల్గంజేయు నీ శుండే. ౮

## బ్రహ్మశ్రీ పండితరాజ రాజేశ్వర శాస్త్రిగారికి

## 'సర్వతంత్ర స్వతంత్ర' బిరుద సన్మానసందర్భమున

శ్లో॥ శ్రీశైల శ్శేషశైలశ్చ కృష్ణా గోదావరీ శుభా
ఖ్యాతాః పూతా స్త్రిలింగేషు భూతలే చైవ శాశ్వతమ్. ౯

శ్లో॥ కృష్ణత్యాగజగన్నాధ రాజత యవిరాజితః
విద్యారణ్యాగ్రగణ్యోఽయం దేశ సై లింగ్యసంజ్ఞికః. ౧౦

శ్లో॥ వ్యాఖ్యాతా మల్లినాథశ్చ విద్యానాథమహాకవిః
అన్నంభట్టాదయో హ్యంధాః హరిశాస్త్రీచ శాబ్దికః ౧౧

శ్లో॥ రాజేశః పా జ్ఞరాజేశ స్సురేశగురుసన్నిభః
సర్వతంత్రస్వతంత్రశ్చ రాజరాజేశపూజితః ౧౨

శ్లో॥ సర్వతంత్రస్వతంతా య ధీరశాంతాయ తేజసే
లక్ష్మణార్యతనూజాయ సర్వజ్ఞాయ నమోనమః. ౧౩

శ్లో॥ సాంగం వేద మధీయంతే కాశ్యాం యస్య ముఖాంబుజాత్
సోఽయం పండితరాజోఽత్ర రాజేశః పూజ్యతేఽధునా. ౧

## శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి సన్మానప్రశంస

క॥ పండితుఁడుఁ, గవి, యుపాధ్యా
యుండై పెక్కండ్లు కీర్తియుతుఁడై, నెల్లూ
ర్మండలమున నభినవతి
క్కండని ఘను లనఁగ నెగడు ఘనత యలఁతియే. ౧౫

క॥ కవివరుఁడుఁ గవిహితుండును,
గవిపుత్రుఁడుఁ గవివరుండుఁ గవిగేయుండున్
భువి దుర్భాన్వయవార్ధికిఁ
గువలయమిత్రుండుఁ గృష్ణగురుమిత్రుండున్. ౧౬

---

శ్రీ భాష్యాయ నమః

## శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ గురుపరంపర

విజయవాడ

14—11—1941

గీ॥ ఆదికాలంబునందు మఱ్ఱాకుపైన
బాలుఁడై పవ్వళించి యంబాముఖమున
భాగవత మర్ధపద్యానఁ బడసె నెవ్వఁ
డాదిమగురుం డతండు నారాయణుండు. ౧

గీ॥ దిక్కుతోఁచక తమ్మిగద్దియను జేరి
లోతుపాతు లెఱుంగక చేతఁగాక
పద్మనాభునిచేత "తప తప" యనెడు
పలుకు విన్నట్టి యాదితపస్విఁ గొలుతు. ౨

గీ॥ కౌశికునిక్షాత్ర బల మెల్ల గంగఁ గలిపి
బ్రహ్మతేజంబు వెలయించు బలియుఁ డెవఁడు
సవితృవంశాన కెవ్వఁ డాచార్యపదవిఁ
దాల్చె నట్టి వశిష్ఠసత్తమునిఁ దలఁతు. ౩

గీ॥ దివికి నేగినఁ దన్నుఁ గన్నవాని గాంచు
శక్తి గల్గిన సుతుఁ గన్న శక్తి గల్గు
"శక్తి" నాల్గవయాచార్యు భక్తిఁ గొలుతు
నంబపేరిట గురుఁ డెవ్వఁ డనఘుఁ డారుఁడు. ౪

గీ॥ పాప మంటకయుండ నా పల్లె పిల్ల
కడుపునను వ్యాసమూర్తినిఁ గన్న మేటి
తత్త్వనిష్ఠుండు సత్తపోధనుఁడు పార్వ
తీశపదసేవకుండు పరాశరుండు. ౫

గీ॥ పంచె వేదంబు, రచియించె భారతము; పు
రాణములు చెప్పె; బ్రహ్మసూత్రములు చెప్పె
స్త్రీనిఁ జేపట్టకయె మహర్షిని శుకుఁ గనె
వ్యాసుఁ డన వేఱె? యతఁడె నారాయణుండు. ౬

గీ॥ సప్తదినములలోన మోక్షమున కనిపె
శరణుఁ బొందిన యొక రాజచంద్రు నెవఁడు
లింగభేదంబు నెఱుఁగఁడు సంగి గాఁడు
శుకమహర్షికి సాటి వేఱొకఁడు గలఁడె. ౭

గీ॥ కారిక లవెవ్వనివి మోక్షకారిక లగు
పలుకు లెవ్వని వుపనిషద్వాక్యసమము
లతఁడు శ్రీ "గౌడపదుఁడు" దివ్యత్ప ప్రభావుఁ
డాత్మసౌభాగ్యభోగనిత్యానుభవుఁడు. ౮

గీ॥ గుహ వసించియు బ్రహ్మాండకోటి నెవ్వఁ
డాకళించి జగద్గురునంతవాఁడు
శిష్యుఁడై తన్ను భజియింపఁ జెప్పెఁ దత్త్వ
మున్న దున్నట్లు గోవిందయోగివిభుఁడు. ౯

శా॥ సర్వజ్ఞుం డన శంకరుం డనఁగ విశ్వశ్రేయమ్ముగా నూర్వఁగా
నుర్విన్ దుర్మతసంతతిన్ దునిమి శుద్ధ్యద్విష్టతత్త్వంబు హ్ర
త్పర్వంబౌనటు భాష్యపంక్తులను జెప్పంజాలె నాచార్యుఁ డం
తర్వాణుల్ వెఱఁగంది మొక్కు లిడి యద్వైతంబుఁ జేపట్టఁగన్.

వ॥ ఇయ్యాచార్యపరంపరలోఁ బ్రాచీనులందుంబోలె నర్వాచీనుల
యందును గొందఱు సన్న్యాసులును, గొందఱు గృహస్థులు నుందురు.

గృహస్థులుగ నుండువారలు, శ్రీవిద్యాధురంధరులనం బ్రథితు
లైన ధీరు లెందఱో గలరు. అందు, ౧౧

క॥ శ్రీవిద్య బ్రహ్మవిద్య మ, హావిద్యయనంగఁ బాదుకాంతంబగు దీ
క్షావిధిఁ బెద్దలు దాల్తురు, కైవల్యపదము సిద్ధికరము జగమునన్.

క॥ నతియున్ నుతియున్ లేకయ, యతులటు నీ పూర్ణదీక్ష నలరిన గురులా
నతభక్తకోటి కిచ్చెద, రతిలోకంబైన పద మనాయాసముగన్.

ఉ॥ భూపతిసేవ్యుఁ “డచ్యుతుఁడు” భూసురముఖ్యుఁడు, పాదుకాంతదీ
క్షాపరతంత్రుఁ డాప్తజనకల్పక మాంతరదృష్టిదీపసం
దీపితసర్వతంత్రుఁడు, సునిశ్చితతత్త్వుఁడు శిష్యకోటిహృ
త్తాపనివారకుండు ప్రథితప్రతిభాయుతుఁ డాఢ్యుఁ డన్నిటన్. ౧౪

మ॥ అతిలోకప్రభుఁ డాప్తరక్షకుఁడు “కృష్ణానందనాథుండు స
మ్మతుఁడై శిష్టుల, కాతతాయిగిరిజంభారాతియై, సంతత
స్తుతసంపూజితతర్పితార్చితమహాదుర్గాపదుండై జగ
న్నుతుఁడై మించెను సత్ప్రయోగములఁ దన్నుం భూతముల్ గొల్వఁగన్.

గీ॥ తనదు “మల్లాది” బిరుదు సార్థకము గాఁగ
బాహుబలజితవైరియై ప్రబలదీక్ష
నచ్యుతుం డన రాముండు ననఁగ నెగడె
నెల్లకడలందు మా పరమేష్ఠి గురుఁడు. ౧౬

మ॥ పరకోరాడ సుధాపయోధి విధుఁడై వాణీపుమాకారమై
పరమేశప్రతిమానుఁడై జపతపస్స్వాధ్యాయలోలాత్ముఁడై
సురభాషాకవిచంద్రుఁడై సకలుఁడై సుశ్లోకుఁడై మించె సు
స్థిరుఁడై యచ్యుతరామపూజ్యుఁ డగుచున్ శ్రీరామచంద్రుం డహో.

ఉ॥ తా మదిఁ గూర్చినట్టివి శతంబులు ధారణపట్టి పద్యముల్
ధీమహితుండు వ్రాయుఁ దనతీరికవేళల సంస్కృతాంధ్రముల్
ఈమెయి సత్ప్రబంధము లవే యొకనూటికి మించియున్న వు
ద్దామయశుల్ కవీంద్రులు నెదన్ ముద మొందఁగ నెందు నేటికిన్.

మ॥ తనసాహిత్యము గానభంగులు కవిత్వప్రౌఢిమల్ ధీరు లెం
దు నపూర్వంబు లటంచు మెచ్చఁగ వరేణ్యుండైన శ్రీ శిష్టుకృ
ష్ణుని గృష్ణున్ మును గృష్ణుఁ డట్లు కొలిచెన్ గోరాడరాముండు శి
ష్యునకున్ సద్గురుమూర్తికిన్ గలిగె సద్యోగంబనన్ బండితుల్.

శా॥ రామస్వామిబుధుండు "హింగు" కులపారావారనీహారరుక్
స్తోముం డాఢ్యుఁడు మంత దీక్షల నగస్త్యుం డంబికాపాదపూ
జామాహాత్మ్య ధురంధరత్వమున నిచ్చల్ దన్ గటాక్షింపఁగా
శ్రీ మాతా కృతి "రామచంద్రకవి" కాంచెన్ నిత్యయోగంబునన్.

మ॥ అతిశాంతుండు మహామహుండు ముని "యోగానందనాథుండు" సా
ధితసర్వార్థుఁడు దేశికాంఘ్రి యుగభక్తికీ తముక్త్యంగనా
యుతుఁ డేకాంతుఁడు రామచంద పరిచర్యోత్సాహి "నాగేశుఁ"డ
ప తిముం డుత్తముఁ డాద్యయోగిజనసంభావ్యాంతరంగుం డహో.

శా॥ బాలోన్మత్త పిశాచవర్తనముల న్బహ్మాత్వముం డాచి దృ
గ్జాలంబున్ మదిలక్ష్యమం దునిచి జాగ్రన్నిద్రఁ గైకొంచు నా
భీలంబౌ భవవారిధిం గడిచి, యీ విశ్వంబ తానై మహా
లీలన్ మా గురుదేశికుం డలరె నిర్లిప్తాగ్రగణ్యుం డనన్. ౨౨

శా॥ కారుల్ కత్తులు, కత్తెరల్ గొని తనున్ గారించుచున్ గండలన్
జీరన్, వైద్యు లదేరినో యనుచుని శ్చింతంబుగాఁ బండె నే
ధీరుం డశ్రులు మూయకుండ నదియున్ దీరంగ జాగేలొకో
ప్రారంభింపుడటన్న యా ఘనుఁడె యోగానందనాథుం డహో? ౨౩

ఉ॥ పాయక "మంత్రవాది" దివిభాస్కరు సద్గురునాథు "సూర్యనా
రాయణశాస్త్రి" నర్థి వినినంతనె వ్యాకరణంబు సర్వమున్
దోయిటఁ బట్టి తా వెఁగద తోయధిఁ గుంభజునట్టు లట్టులే
ధీయుతుఁ డెల్ల శాస్త్రములఁ దేలె నహీశుఁడు పూర్వసంస్కృతిన్.

చ॥ జనకుని రామచంద కవిచందు నిగ్రంథము లచ్చు గూర్చె వ్యా
ఖ్యను రచియింపఁజేఁ గొన్నిటికిఁ గావ్యములట్టులఁ జెప్పె భాష్యముల్

మనవియు నాన లే కొరులమార్గము పోక యహీశదేశికుం
డనితరసాధ్యమైన పదమందు నెదర్ ముదమొందె నెందునన్. ౨౫

గీ॥ అల్లగోవిందునకు శంకరార్యునట్లు,
భువిని నాగేశునకు నాగభూషణుండు
శిష్యుఁడై వెలుఁగొందె విశేషకాంతి
నెల్లదెసలందు రాజయోగీశుఁ డనఁగ. ౨౬

గీ॥ తాను నాగేశ్వరుం డఁట తనకు నాగ
భూషణుఁడు శిష్యుఁ డెందు నీ పొందుగలదె
తనకు గురుమూర్తి గురునకుఁ దాను భూష
ణంబుగా నొకఁడైరి జగంబునందు. ౨౭

సీ॥ అల్ల పాలావర్జులాన్వయాంభోరాశి
కమృతాంశుఁడై యెవ్వఁ డవతరించె
వెలనాటికులమణి వేంకటరత్నధ
రామరుం డెవ్వని కయ్యెఁ దండి
స్త్రీలలామంబు మహాలక్ష్మి యెవ్వానిఁ
గనుపారఁ గాంచి భక్తతతి కిచ్చె
సత్యనారాయణ సహజన్ముఁడై యేని
కాభాష్య మెఱిఁగె బాల్యమ్మునందె
గీ॥ సోదరీమణి వేంకటసుబ్బమాంబ
బావ గంగాధరుం డేని బాంధవమున
నంతవారైరొ జగమున నతఁడె "నాగ
భూషణ" గురుం డనంబడు భువనమందు.

చ॥ దిన మొక విద్యగాగ మును దేశికునొద్ద నెఱుంగనేర్చు వె
న్నని యవతారమే యని తనుం గొనియాడఁ గుశాగ బుద్ధులం
దని వినువీథిఁ బట్టి గురుతత్త్వముఁ గాంచెను "కృష్ణభూషణుం"
డనితరసాధ్యమైన లవణాబ్ధిఁ దరింపఁడె వాయుపుతుఁడున్. ౨౯

చ॥ చదువు మనంగఁ దా జదువు సద్గురుమూర్తికి నిద పట్టినన్
జదువుట మానఁ డా ఘనుఁడు; నమ్మక మెట్టిదొ దేశికేందుఁడున్

జదివితే మేలుమే ల్పయిన సొగఁగ నిమ్మను నభ్యనుజ్ఞ నే
చదువులఁ బొదుకొల్పెదరు ఛాతు లమానసమందు సద్గురుల్. ౩౦

శా॥ ఏదో దగ్గఱతో వ యుండవలెఁ గానీ కానిచో శాస్త్రముల్
భేదింపంగలఁ డెట్లు బాలకుఁడు నిర్భీకుండు శ్రీకంఠు నే
వాదంబందున గెల్చు నీతనిప భావం బద్దిరా యంచు స
ద్వాదుల్ మెత్తురు కృష్ణభూషణుఁడు తత్త్వంబున్ బ్రసంగింపుచోన్.

ఉ॥ అడ్డమహంబె శాస్త్రముల నడ్డులు గడ్డలు లే వఢెందు నా
యడ్డముతీరె నా, తెలివె యాత్మఁ డనన్ గురుమూర్తి తోడనే
గుడ్డను జోలెఁ గట్టుకొని కొంకక భైక్ష్యముఁ బూని భాష్యమే
యడ్డములేక జుట్టుకొనె నద్దిర కృష్ణవిభూషణుం డహో. ౩౨

చ॥ పలుకు లవన్ని మంత ములు వాక్యము లన్నియు భాష్యపాఠముల్
సలిపెడు వన్ని లీల లగు సద్గురుమూర్తి శివుండె యం చహో
కొలిచెను కృష్ణభూషణుఁడు కోటికి నొక్కని కిట్టి భక్తి లే
దిలఁ గలివేళలం దనుచు వృద్ధులు తన్గొనియాడ గోష్ఠులన్. ౩౩

ఉ॥ తాను శివోహ మన్కొనుచుఁ దత్పరతన్ గురు డింట నుండ నెం
తేని ప మాణబుద్ధి గుడి కేగుచుఁ దా శివరాత్రి వేళ మా
ర్గాన గురున్ భజించి తన కాయయు గప్పురమందె పెట్టి యై
క్యానుభవంబు నొందిన మహాత్ముఁడు పన్నగభూషణుం డహో. ౩౪

ఉ॥ లౌకికమైన లాభమె ఫలంబగు విద్యల కంచు నెంచుచున్
బా కటమైనభక్తి, ప ణిపాతము, ప శ్నయు, సేవ, లేకయే
చేకొని భాష్యముల్ చదువు శిష్యులు చెప్పఁగ సిద్ధమా బుధా
నీకము సద్గురుం డెద గణింపఁడు తత్త్వము దానఁ గానమిన్. ౩౫

శా॥ ఏ రామల్ సరివత్తురే! విభుఁడు తానే తా విభుండే యనన్
ధారాళంబుగ సర్వధర్మములలోఁ దాదాత్మ్యమున్ దాల్చి "సీ
తారామాంబిక" యున్న నాల్గుదినముల్ ధన్యాత్మ యైపోయె న
య్యారే! మొ క్కెదఁ గీర్తికాయ గురుజాయన్ ధీరగేయన్ సదా.

ఉ॥ ద్వాదశవర్షముల్ ఘనతపం బొనరించుచు సద్గురుండు స
మ్మోదముతోడ సోదరునిఁ బూన్చి గృహంబునఁ దాఁ ద్రిదండియై
పోదు సటంచు నుండగనె, పోయెను దమ్ముఁడు నీశ్వరేచ్ఛ యే
మాదిరివారి నెట్టెటుల మార్చదు తాను స్వతంత్ర యాటచేన్.

ఉ॥ కొంప మునింగె నంచుఁ దలకొట్టుక యేడ్చెడు తల్లి దన్ను శా
సింపఁగ, సద్గురూక్తి నది సిద్ధముగా గణియించి, యొండుచ
ర్చింపక "సుప సన్నమ"ను జేకొని గాంచె సుతద్వయంబుఁ దీ
ర్పింపఁ బితౄణమున్ గురుఁడు పెద్దలమాటలు పాటిచేయుచున్. ౩౭

ఉ॥ "రాముఁడు" "సోముఁడున్" హరిహరంబగు పేరులటంచు నుంచెఁ ద
న్నామము లాత్మజాతులకు నాగవిభూషణుఁ డన్వహంబు శ్రీ
రామపదామృతంబును నిరంతరమున్ జవిగొంచు నన్యమున్
మామకమంచు నెంచఁ డనుమానము నొందఁడు నుండు దండిగన్.

మ॥ అమృతానందుఁడు యోగి, నిస్పృహుఁడు, ధీరాగ్ర్యుండు, శిష్టుండు, దృ
శ్యము నశ్యం బగునంచు దానిపయి విశ్వాసంబు చేయండు, బ
హ్మముగాఁ జూచును సర్వమున్, శిశువునే నర్చించు శ్రీకృష్ణుఁగా
శమసంపన్నుఁడు లక్షణంబులకు లక్ష్యంబౌర సద్యోగిలోన్. ౮౦



శ్రీమదమృతానందనాథ జయంత్యుత్సవమునకు రు 116 లు విరాళ మొసంగిన
జటప్రోలురాణి ఇనుగంటి సరస్వతీదేవిగారికిఁ గృతజ్ఞతతో సమర్పించిన

పద్యత్రయము



గీ॥ శ్రవణమాత్రాన సద్గుణరాజి నెఱిఁగి
ధర్మసంస్థానములకు సత్కార మిట్లు
సలుపఁజాలిన రాణు లీ జగతిఁ గలరె
సాధ్వి నిను గంటి శ్రీ సరస్వతిని గంటి.

మ॥ అసిధారావ్రతచర్య నూనిన యసూర్యంపశ్య [illegible]
ట్లసమానంబగు విద్యనేర్చితివొ కవ్యాగ్రేసరుల్ మెచ్చ సల్
దెసలన్ నీదగు కావ్యకన్య కడుఁ గీర్తిందెచ్చె నో యమ్మ! నీ
దుసుతుల్ సింగపుఁబిల్లలార్యజన సంస్తుత్యంబు నీ శీలమున్.

ఉ॥ భారతవిద్యకుం గళకుఁ బాదులనిల్పు త్రిలింగపీఠికిన్
దూరమునుండి వివ్కలినె నూటపదారులు నీయఁజాల్ జమీం
దారిణి వో సరస్వతి గుణగ్రహణంబన దే యదేకదా
పేరును బెంపుఁదెచ్చుఁ బృథివిన్ బృథివీపతిజాతికంతకున్.



శ్రీమదమృతానందనాథ పారితోషిక ప్రదానము రు 116 లు

(1941 వ సం॥ జయంతి)

సహజపాండిత్య సంగీత చక్రవర్తి

శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి

ప్రశంస

ఉ॥ ఆదిమభట్లవంశమణివై, హరికీర్తనసేయువారిలో
నాదిమమూర్తివై సుకవి వౌదు ప్రవీణుఁడ వౌదు తెల్గునం
దాదిమభాష, నాంగ్లమున యావనభాష స్వతంత్రుఁడౌదు నీ
మాదిరి నీదె నీ కిల సమానునిఁ గాన జగాన ధీమణీ !

ఉ॥ చాక్షుషమైన యజ్ఞమని సత్కవి చెప్పెను మున్ను పుండరీ
కాక్షుని సచ్చరిత్రము సభాంగణమందున నృత్యయుక్తిఁ బ్ర
త్యక్షముగాఁగఁ జూపుట, మహాత్ముఁడ వీవాకరుండగాక త
ద్దీక్షితుఁ డెవ్వఁ డీక్షితి, నుతింతును సార్థకదాసనామునిన్.

మ॥ లివతో డెబ్బదియెన్మిదేండ్లకు మహాలీలన్ సభావేదిఁ దాం
డవకేళిన్ హరిఁ బ్రస్తుతింతువఁట స్వాంతం బుల్లసిల్లంగ నిన్
స్తవముల్ సల్పుటచేతనే 'విదుష ఆత్మా త్వా' త్తనన్ శ్రీహరి
స్తవముల్ సల్పిన పుణ్య మబ్బుఁగద విద్వద్వంద్య! నారాయణా!



శ్రీ భాస్యాయ నమః

# శ్రీ కృష్ణ స్తవరాజము

౧

చ॥ అడవులు తోటలున్ బయళ్ళు లావులు దూడలు, కృష్ణ! చల్దులున్
బుసుతలు వంకకోలలును, బూరలు, దారులు, డొంక లేఱులున్
గడు బి యమంచు నెల్లెడఁ బగల్ దిరుగాడెదు సంజవేళ ని
న్నడుగనరా దిఁకెన్నటికి నార్తుల సాధుల బాధ దీర్తువో. ౧

ఉ॥ ష్టులఁగాచి దుష్టులను శిక్షయొనర్చెదవంట కృష్ణ! మా
కష్టముగానవే? పరమ కారుణికుండవు పెచ్చుమీరు నా
భ్రష్టులఁ గానవే సుజన పద్ధతి నుద్ధతిఁ దో యువారికిన్.
బుష్టి ఘటిల్లు, పాపములు పూర్తిగఁ బండవ? నూరు నిండవా?.

మ॥ నినుఁ బూజించిన ధర్మపుత్రు సభలో నిందించు నా చైద్యునిన్
గునుమన్ జక ముఁ బంపునా డెఱిఁగె నా దుష్టాళి నీసత్త్వమో
వనజాక్షా! నిను నమ్మ పాండుసుతు లాపన్నుల్ జయమ్మొందినా
రనఁగా నచ్చెరువంది మొక్కెదరు కృష్ణా! నీ పదంబుల్ జనుల్. ౩

మ॥ జననంబాదిగ ధర్మమూర్తివయి కృష్ణా! రాముఁడై, నాఁడు దు
ష్టనికాయంబును గూల్చి, యన్నిఁట వసిష్ఠప్రోక్త మాలించి, రా
ణ్మునిపై లోకులకై సతీమణి వనిన్ బోఁదోల వేసారి య
జ్జనమున్ నమ్మక నేఁడు గోగణములన్ సాకంగ మేకొంటివే. ౪

మ॥ మునులన్, సాధుజనమ్ములన్, గల నిజమ్మున్ గండె మూర్ఖుల్ నదీ
తనయుండే గొనియాడఁ జైద్యునకు దుర్దైవంబు గాకేమి వ
చ్చెను బోగాలము మూర్ధముంపువరకున్ శ్రీకృష్ణుఁ డిట్టంగ? బం
ధుని గుర్తింతురె దేవు నేనియు దురుక్తుల్ వల్కు దుష్టాత్మకుల్.

ఉ॥ భూర్భువరాదిలోకములఁ బుట్టగఁజేసి భరించు నిన్నసం
దర్భుఁడు, తోడబుట్టువనితామణిఁ బోలె, యెఱుంగఁడయ్యె వై
దర్భుఁడు తల్లి తోడయి యథార్థ మెఱుంగఁడు కంసుఁ డెన్నఁడే
నర్భకు లెట్లెఱుంగఁ గల రంబుజనాభ! భవత్ప్రభావమున్. ౬

పట్టిన పట్టునన్ నిలిచి, వంచిన యట్టుల వంగి యెవ్వనిన్
గొట్టు మనంగఁ గొట్టి రిపుకోటిని గూల్చిన వంశమంచుఁ జే
పట్టితి కృష్ణ! యమ్మురళిఁ బాడెద వూదుచు ముద్దుఁగొంచు; నె
వ్వట్టున లాలనంబునకుఁ బాతు లు శిక్షకు లొంగువారలే. ౭

ఉ॥ భావము భారమయ్యె మదిఁ బట్టఁగఁ జాలను కృష్ణ! నన్ను నీ
గోవుల మందలోన నొక గోవుగ నేలుము; నీ కరంబులన్
మోవిని వేణురూపమున మోపుము, కాంచనచేల! నన్ను నీ
పా వరణ మ్మొనర్చి భవబాధల బాపు మెటేని మాధవా! ౮

ఉ॥ గోపకులంబు గోవులును గొల్లతనంబును జూచువారు సాం
దీపనియొద్ద నీ చదువు తీరు నెఱుంగరు, రాసలీలలో
గోపిక కొక్క మూర్తివయి కూడుచు నాడుట లెంతురు గాని, నీ
రూపము విశ్వరూప మని రూఢి నెఱుంగరు నందనందనా! ౯

చ॥ కడుపునఁ గన్న దేవకిని గాదని నీవు యశోద బిడ్డవై
గడపితి బాల్యమున్, వలచు కాంతలఁ గా దని, శాంతమూర్తులై
యడవులనుండు సాధువులయం దనురాగము నీకుఁ గృష్ణ! నీ
యడుగుల జాడ గోపికలకా, సనకాదులకా, యెఱుంగనా. ౧౦

ఉ॥ కీరితి నిచ్చి చేసితివి కృష్ణ! కిరీటికి సాయ, మందు నీ
నేరుపొ వాని చేవడియొ నిక్కము నెవ్వఁ డెఱుంగు నిద్దఱిన్
జేరినచో జయం బనిరి సిద్ధులు, గిట్టనివార లెంతగా
దూరిన దానికిం దగు గతుల్ గుడువం దొరకొందు రంతయే. ౧౧

మ॥ అభిధానంబు సమాన మెవ్వరికి గృష్ణా! నీకు నవ్వారిపై
నభిమానంబు సమంబ, యట్ల యగుఁగాదా వంటయింటన్ మహా
సభలోఁ గావవె, పో వవే సకలవిశ్వంబున్ బ దర్శించి నా
డభయం బీయవె సైంధవుం దునుము నాఁ డైక్యంబు రూపింపవే.

౨

శా॥ విష్ణుం డీవఁట యే మెఱుంగఁగలమే వ్రేపల్లెలో గొల్లలున్
గృష్ణా! కృష్ణ! యటంచు లోకమన నీవే యంచు ధ్యానించుచున్

దృష్టుల్ దీరఁగ నాడి పాడుచును బీ తిల్ నీవ యైనారనన్
గృష్ణా! యుల్లము పల్లవించుఁగద మమ్మేలాగు రక్షించెదో. ౧౩

ఉ॥ వెన్నల, వెన్నలన్, బసుల, వే తల, వేణుల, గొల్ల పల్లెలన్
గన్ననినున్ గనన్ గలుగు నాకని, వారల వెంటనంటి, నిన్
గన్నటు పొంగెదన్, మఱిగికాక, నినున్ మునులేని గానలే
రెన్నఁడు నిన్నుఁగాంతు ననియే మది, వెన్నుఁడ! దాసురాలికిన్.

ఉ॥ గీతలఁ జెప్పి కీ డి ననికిన్ దగువానిఁగఁ జేసినావు; సం
గీతముఁబాడి గోపికలఁ గే ప్పుల తేపును మాపుఁ గృష్ణ! సం
పీ తులఁ జేసినావు; బహు తుల నీతులఁ గొరవేందు సం
పాతముఁ బన్నినా, వవనిభారము డింపఁగఁ, బో వ ధీరులన్. ౧౫

ఉ॥ నమ్మినవారిఁ బో చుట యనన్ వ తమో యదునాథ! నీకు; చ
క మ్మునుబట్టి నీప తినఁగాదని భీష్మునిమాట నిల్పినా
వమ్మక చెల్ల! యాశ్రితులకై యొనరింపనిదేది, నిన్ యశో
దమ్మ యదెంత పున్నెమున నక్కునఁ జేరిచి ముద్దు లాడెనో. ౧౬

చ॥ యమునిలు సొచ్చినట్టి తనయాళినిఁ దెచ్చి యొసంగి బ్రా హ్మణో
త్తముఁ బరితృప్తుఁ జేసితి, పృథాసుతు పౌత్త్రు ని గర్భమంద శ
స్త్రముఁగొని రక్ష సేసితి శరన్నిశలందున గోపికాళి డెం
దములను జల్ల జేసితివి తామరసేక్షణ! జాణ వన్నిఁటన్. ౧౭

మ॥ యమునాతీర మరుత్కిశోరముల రమ్యంబౌ నికుంజంబులన్
బ మదారత్నములన్ మహర్షులను బ హ్మానంద సందోహ సాం
ద మహాబ్ధిన్ దరియింపఁజేసిన పరంధాముల్ సుధానాము వేం
గమ హృత్కైరవసోము నా మదిని సంకల్పించి మేలెంచెదన్. ౧౮

ఉ॥ ఎక్కడఁదెత్తు నే యమున నెక్కడ దెత్తును గోపికాళి నీ
మక్కువగల్గు కే ళులను మాధవ మాధవ యన్న వెన్నఁబోల్
చొక్కపు మానసం బొకఁడె చూడఁగ నాకడనున్న దిత్తునో
చక్కని నల్లనయ్య! యిదె సర్వ మటంచుఁ బరిగ్రహింపుమా!

ఉ॥ అంబర మైతి నీకుఁ గనకాంబర నేఁ గనకమ్మనొట లో
నం బురుషోత్తమాకృతి గనంబడు దీవ కనంగనన్ సువ
ర్ణంబె కనంబడున్ పయికి నాకును నీకును గాక దీని త
త్త్వంబు నెఱుంగఁబోలదు సదా నను నీ మెయిఁదాల్చిపో వ్రుమా.

శా॥ నీకుం బుట్టువు గల్గు పుణ్యదినమే నీరేజపత్రే క్షణా
నాకుం బుట్టువు నిచ్చి సద్గురుని ద్వన్నామాంకసద్భావము న
స్తోకపీ తి ఘటించి బోధము ప బుద్ధుల్ మెచ్చ వా యించితో
శ్రీకృష్ణా నతతోషణా నిను మదిన్ జింతింతు నశాంతమున్. ౨౧

ఉ॥ నీ కమనీయ విగ హము, నీ కరుణార్ద్ర విలోకనంబు న
స్తోక విభూతి గోపికలతోడుత నాదిమ దంపతీ రసో
దే కము జీవు లాత్మ గను రీతులు నీతులు బోధచేయు లో
కైక సుపోషణా! పరమనాస్తికభీషణ! నందతోషణా! ౨౨

## శ్రీ కృష్ణావతారతత్త్వము

చ॥ చెలువుఁడవై వ జాంగనల చిత్తము విత్తము చూరఁగొన్న నీ
బలు కత లెల్ల లోకములఁ బాటలు పద్దెము లై చెలంగినన్
వల దన కెంతవారును భవద్గుణజాలము సన్నుతింతు భీ
ష్ములు సనకాదియోగులు వశుల్ వశమా? నిను నెన్న వెన్నఁడా.

కం॥ పిల్లలతోఁ దల్లులతో । గొల్లలతో నాలతోడ గొంతికొడుకుతో
నల్లనిసామి నటించిన । దెల్లన్ భాగవతమయ్యె నెల్లరుఁ దనియన్.

ఉ॥ దా పది నిగ్గుఁదేల్చితి, పృథాసుతు నిల్పితి; వాని పుతు నిన్
బాపితి, ధర్మపుతు నకుఁ బట్టము గట్టితి, గు డ్డివానికిన్
జూపితి విశ్వరూప మనుచున్ మఱి భీష్ముని బో చి తంచు నో
గోపకుమార! భారతమగుం గద నీ చరితంబుఁ ద వ్వినన్. ౨౪

శా॥ రాసకీ డయు రాజసూయమును సంగా మోర్వియున్ సైకతం
బో సామీ! సమ మాట తెల్లముగ నీ యుల్లం బెఱుంగంగ జాల్
దాసుం డెవ్వఁడో వెన్నలిచ్చుకొని గొల్లల్ మున్నుఁగొండ్రే మొ కృ
ష్ణా! సొమ్మేల కడుంగడుం బి యము నా స్వాంతంబు నీకిచ్చితిన్.

శా॥నందానందకరుండవయ్యు సకలానందానుసంధాతవై
బృందారణ్యములన్ జరించియును సద్బృందంబు డెందంబులం
దుం దీపింతువు నిత్యమున్ వ జనధూదోర్వల్లులన్ జిక్కియున్
బందంబుల్ విడిపించు వేల్పువట కృష్ణా! దేవకీనందనా! ౨౭

శా॥కంసధ్వంసకరంబులౌ కరములన్ గాళిందితీరంబునన్
హంసీయానల మానసంబులకు సన్న్యాసంబుఁ గల్పింపఁగా
వంశీనాదముఁ బర్వఁజేయుదఁట పర్వంబందు మాడెందముల్
సంసారంబున మున్గకుండునటు కృష్ణా! మమ్ము రక్షింపవే. ౨౮

ఉ॥ రమ్మని వాసినట్టి జవరాలి విరాళి నెఱింగి కృష్ణ! కే
ల్దమ్మి నొసంగినావు; సభ ద్రౌపది భంగమునంది పిల్వ వ
స్త్రమ్ము లొసంగినావు; రణరంగమున న్నరుఁ డార్తిఁగుందఁ ద
త్త్వమ్ము నొసంగినావు, సరి, ధ్యానమె చాలును దాసురాలికిన్.

చ॥ నరునకు నాకు నాకులకు 'నా' యని నిన్ దఱిఁజేరువారికిన్
గురుఁడగుచుందు వందు నిను గొల్లలు గోలలు మానితల్లజుల్
కరమనురక్తి గొల్తురఁటగా? నిను నించుక గొంచ కేమి నీ
పరమరహస్య మందఱ కుపాస్యుఁడవై తివి నందనందనా! 30

మ॥ ఎలయన్ నిన్ మునుగోరు సంయములకున్ శృంగార సన్న్యాసదీ
క్షల నిప్పించి యహర్నిశంబును భవత్సాన్నిధ్యమున్ ధ్యానమున్
గలుగం జేసితి సర్వభూతములఁ గృష్ణబ్రహ్మసాయుజ్యమున్
వెలయంజేసితి నందగోకులములన్ నీ రేజపత్రేక్షణా. 3౧

మ॥ చదువో, సంధ్యయొ, సామొ, యోగమొ, తుదిన్ సంగీత మోమౌనమో
యెదియే నొక్కటి పూర్ణదీక్షగాని మాసీందుర్గిల్ నినుంజేరినా
రెదియున్నేరని వెఱ్ఱిగొల్లలకు నో కృష్ణా! భవత్తత్త్వమున్
విదితంబుం బొనరించు నీ దయకు నువ్విళ్ళూరు భక్తౌఘముల్. 3౨

మ॥ అహమున్ డించినగాని చేకొనవు కృష్ణా, శత్రులన్ మిత్రులన్
సహజమ్ముండని సంగడీఁ డనుచుఁ బక్షంబూన విల్లాలినేన్

స్పృహ జాలిం గన వింక శాత వులపై నేముండు? నైరైనని
న్నహహా! చచ్చియె చేరఁగానలయు దేహభ్రాంతులఁ వీడుచున్.

శా॥ నిన్నుఁ నమ్ముచు నన్యముల్ విడుచువానిం గావఁగాఁ బోవఁగా
మున్నీవిచ్చిన మాట నమ్మకయె లోభుల్ పౌరుషంబూని యె
న్నెన్నేఁ జేయఁగఁ జింతసేయుదు రహో కృష్ణా! నరుం బోలువాఁ
డు న్నేరం డొరు సుద్దు లేమిటికి నాఁడుల్ నేఁడు నీ స్వోడిన్. ౩౪

ఉ॥ సాదనలేని సిద్ధియును, సద్గురుసేవలులేని విద్దె, సం
పాదనలేని భోగము, తపంబు వినా భగవత్ప సాదముల్,
వాదములేని గెల్పు, కదనంబువినా బహురాజ్యలాభముల్
వేదనలేని మోదము భువిం గనరాదుగ నందనందనా. ౩౫

ఉ॥ వెన్నల కంగలార్చి రను వెన్నునివేడుక లూరకబ్బునే
వెన్నెలనార్తిఁగుంది రను వెన్నునిరాసము లూర కబ్బునే
యన్నియు వీడినారను పరాత్ముని చేరిక యూరకబ్బునే
యిన్నియటంచు నెన్నఁదగునే యిల భక్తపదం బలంతియే. ౩౬

తే॥ గీ॥ వెతల నెన్నేని పడె మున్ను వెంగమాంబ
చిక్కు లెన్నేనిపడె మున్ను సక్కుబాయి
గోరములఁ బడదే మున్ను ధీర మీర
కృష్ణసాయుజ్య మొందినా రెన్నియైన. ౩౭

తే॥ గీ॥ ఒక్కరాతి యె జననంబు నందినాము
బాదరాయణ సంబంధ బాంధవంబు
గలదు పైపెచ్చు మనకు నో జలజనయన!
కనకమును నన్నుఁ బోవు మో కనకచేల! ౩౮

తే॥ గీ॥ అన్ని రూపంబులనుదాల్చి యెన్నికొన్న
నెందు నే లంకె లేక యానందమున్న
నందనందను వేఱ యెన్నంగలేమిఁ
గాదె యవతారములయందు గణనలేదు. ౩౯

ఉండి లేనట్లు బ్రహ్మంబ యుండు నొకఁడె
లేకయున్నట్లు తోఁచు నీ లీల జగము
కనఁగ రెండుగనుండి యొక్కండెయౌటఁ
దనదు తత్త్వంబుఁగాఁ దెల్పి ధన్యతముల
భక్తవరులను జేయంగఁ బ్రబలినాఁడు
కృష్ణవేషంబుఁదాల్చి శ్రీ కృష్ణమూర్తి. ౪౦

క॥ మధురాపురీవిహారీ
మధుకైటభహారి శౌరి మాధవ నృహరీ
మధు మధురవచ శ్రీహరి
సుధాకర కలాప భూరి శోభాలహరీ. ౪౧

క॥ వెన్నుఁడ వని మునులందఱుఁ
బన్నుగ సద్భక్తి నిన్ను భజియింపంగా
వెన్నల దొంగిలు టేలొకొ !
మున్నా క్షీరాబ్ధి నున్న మురహరి నీకున్. ౪౨

క॥ ఏవిధి నున్నను శ్రీహరి
నీవని పరమార్థదృష్టి నెంచు బుధులకున్
గైవల్యమొసఁ వారల
చే విజ్ఞానంబు గలుగఁజేయఁగఁ బ జకే. ౪౩

క॥ మాధవా! సురేశ! మధుసూదనా! హరీ!
వేదవేద్య! వరద! వేంకటేశ
పంచవిషయములఁ బ్రపంచంబున న్గాంచి
యాత్మ నిన్నుఁగాంతు నభవ కృష్ణ! ౪౪

క॥ నందానందవివర్ధను
నిందీవరవర్ణు నిందిరేశు ననీశున్
గందర్పజనకునిన్ గొ
విందుని భక్తిఁ గొలుతు శ్రితబృందారకునిన్. ౪౫

గీ॥ కృష్ణ నిన్నుఁబోలఁ గృష్ణచేలం బన్న
యతనిఁబోలఁగఁ గనకాంబరంబు
నీవుఁ దాల్చుచుండ జీవుల కెవ్వండు
పొందఁదగిన వాఁడొ బోధపఱుపె? ౪౬

గీ॥ ఒకరాతి ౯ జన్మించితి
మికదా నాయందుఁ గరుణ మేలొనఁగూర్పఁ౯
వికచాబ్జనయన! తగు నెపు
డకలంకస్థితిని నిల్పుమా నను గురుల౯. ౪౭

కం॥ శివదం శాంతిద ముత్తమ
మవధీరితశతు లోక మానందద మా
త్మవిదాం శరణం యదుపుం
గవ! తవచరణం భజామి కనకాభరణం. ౪౮

కం॥ అంధః సంసారాంధౌ
బాంధవహీనో మోహబద్ధ పాపీ తు కృపా
సింధుమ్ విస్మృత్య సకల
బంధుమ్ త్వామ్ కృష్ణ పతతి పాహి తతో మామ్. ౪౯

కం॥ మమతాహంకృతిరహితా
విమలానందకలితాశ్చ విజ్ఞానయుతాః
కమలేశ మివ కృపాబ్ధిమ్
సమరసభరితా విశంతి సరిత స్సరళాః. ౫౦

కం॥ శరణాగతరక్షణత
త్పరపురుషోత్తమ రమాధవ కృపాంభోధే
గురురూప విశ్వదీపక
శరణం భవహరణ మేవ చరణం తవ మే. ౫౧

శ్లో॥ కృష్ణాయ కృష్ణ రూపాయ
కృష్ణచేలానుజాయచ

కృష్ణా కృష్ణాప్తముఖ్యాయ
కృష్ణాస్తుత్యాయ తే నమః. ౫౨

విదితసకలసారం వేదవేదాంతవేద్యం
మదనజనక మాద్యం మామకం దేశికేంద్రం
సదయ హృదయమితం సాధుసంతాన చైత్రం
ముదితవదన మీశం పుష్పవన్నేత మీడే. ౫౩

మంగళం కృష్ణవేషాయ మధుకైటభహారిణే
వేదవేదాంతవేద్యాయ భక్తచిత్తాపహారిణే. ౫౪

శా॥ శ్రీరాధారమణీమణీ నయనవాసీ! శ్రీధరా! యోగిహృ
న్నీరేజాప్త! వ్రజాంగనాంగణలసన్నిత్యోత్సవా! నిన్నుఁ గ
న్నారం గాంచుచునుంట యన్నదె కడున్ ధన్యత్వమంచెంచుచు
న్నారల్ ధీరులు నాకునేల పెఱచింతల్? దీనచింతామణీ! ౫౫

ఉ॥ అన్నియు సున్నఁజేసెద వనన్యముగా నినుఁగొల్చుపొంటె నీ
కన్న జగంబునందు గలదా మఱియొండు? జగన్నివాస! మా
కన్నలు దమ్ము లమ్మలు పి యల్ పి యులంచుఁ దలంచి వారిపైఁ
గన్నులు పెట్టుకొంట నినుఁ గాంచకయుంటకె కాంచనాంబరా. ౫౬

ఉ॥ ఎవ్వరిభక్తి వారి దెవరేమిరయొనర్చిరి క్రీడికంటె నా
మవ్వపుమూర్తియైన యభిమన్యుని మంటలఁగల్పి తండ్రికిన్
గవ్వముక్రింద మజ్జిగను కంఠము నింపితె తాపమార నీ
వెవ్వరికే మొనర్చితివి కృష్ణ నినున్ నెఱనమ్మువారికిన్. ౫౭

ఉ॥ ఇంతగ నేను దెల్పితి నదెంతగ నెక్కెనో వీనికిన్ బరీ
క్షింతు నటంచు దు ంతువాకొ కృష్ణ కిరీటికి నేకపుత్రు , మా
యింతువు సూర్యకాంతి; వధియింతువు సైంధవుఁ బోరిలోన గ
ల్పింతు వపాండవంబ యనిపింతువు మంతువు పౌత్రు వింతగన్.

ఉ॥ సాయము చేయువాఁడెవఁడు శార్ఙ్గధరా! భువి మాకు, నీకు నా
త్మీయులమాట నిల్తుమెటో ధీరత నేరెటు చేసిరేని నీ

మాయగనెంచి దాని నొకమాత గ నెట్టి భవత్స్వరూపమే
యేయెడఁ జూచుచుండెదము కృష్ణ! భవాంబుధిఁ దేలియాడుచున్.

మ॥ చెలివై, చుట్టమవై, గురుండవగుచుఞ్ జేపట్టి దేవేళ ని
చ్చలు నిన్గొల్చు సుభక్తకోటి సని విశ్వాసంబుతో నెట్టి వా
రలమోమాటము జూడకుండుదుము మాప త్యర్థు లుంకింప న
న్యులు మా కౌదురె పార్థసారథి! యనన్యుల్ గారె నీవారహో!

ఉ॥ ఎవ్వరి కెవ్వరౌదు రెటకేగునొ కంబముతోడఁ జెప్పనే
దివ్వె సమస్తముఞ్ గలుగు దీరును నీ జఠరంబునందనఞ్
దవ్వని దాపటం చెద వ్యర్థఞ్ ముదముఞ్ గననేల ? నీ మడిఞ్
బువ్వగ నన్ను నిల్పుచుఁ బ బోధ మొసంగుము నందనందనా?

ఉ॥ పోవదు రాదు విశ్వమున మున్నును నేఁడొకఁడే విధం బదే
జీవుఁడు చూచి వేడ్కపడుఁ జింతిలు సద్గురుమూర్తి బోధ స
ద్భావము గల్గ జిత్రము ప పంచము నీవయి తోఁచు నా యహం
భావముఁ బాపి సర్వము భవన్మయముం బొనరింపు మాధవా. ౬౨

ఉ॥ పుట్టితి సద్గురుండును బ బోధమొసంగెను దాని నాత్మలోఁ
గట్టిగ నిల్పుమేగడియఁ గాయ మపాయము నొందునో సదా
యిట్టుల నిల్చె నెవ్వనికిఁ గృష్ణ ప మాదము మృత్యువందు రె
ప్పట్టున దానివాత మము బాఱగనీక యనుగ హింపుమా. ౬౩

---

## 14. కవితానుభవము

(9—1—37)

క॥ కవితానుభవముగలదే
కవులకు సరసులకుఁదక్కఁ గలవారల కీ
భువిఁ గవియె బ్రహ్మమగు నను
భవించువా రగుదు రౌర! బ్రహ్మజ్ఞానుల్. ౧

క॥ కవియన ఋషి, ఋషిబ్రహ్మము,
కవియన ఘూకవియుఁ గవియె, కాకవి కవియాఁ;
గవులనఁగ నందు రెందఱొ;
కవియనఁ దత్త్వంబుఁ దెలియఁగలవాఁ డొకఁడే. ౨

మ॥ అవియే వస్తువు లొక్కపాకమున రుచ్యంబౌ; నవే వండ వా
చవిగా నొక్కరిచేత; వాక్కులవె విశ్వశ్రేయమా కావ్యమాఁ
గవికూర్పన్; గుకవుల్ పొనర్చెదరు దుష్కావ్యమ్ము లవ్వాననే
కవిచేతంబడి మెట్టిలోహములు చొక్కంబైన బంగారమా. 3

ఉ॥ భూవిభుఁడయ్యె నొక్కకవి, భూమినిదున్నె నొకండు, భూపసం
భావితుఁడయ్యె నొక్కకవి పార్థివుఁ దిట్టె నొకండొకండు వా
గ్దేవిని రాణిఁజేసె నొకధీరుఁడు శత్రులఁ బాఱఁదోలె నే
త్రోవలఁ దత్పరుల్ గవివరుల్ జనఁజాలుదు రీశులౌటచేఁ. ౪

సీ॥ పోతుటీఁగకు నేనిఁ బోరాని యంతఃపు
రమునేని నేర్చు వర్తనముసేయ
నరవిప్రభాభేద్యమా గుహోవృత్తు లూ
హింపఁగా నేర్చు వర్ణింపనేర్చు
నీశుతోనైన భూమీశుతోనైన జం
కక యున్నమాట పల్కంగనేర్చు
రంగులతో వ్రాయరాని సోయగముల
నింపైన నుడులఁ జిత్రింపనేర్చు

గీ॥ నవ్వునవ్వించు నరుల నానందజలధి
ముంచి తేల్చును నవరసమ్ములను సతత
మాప్తవాక్యము బోధించు నాదరమునఁ
గవికిఁజాలిన మిత్రుండు కలఁడె? జగతి. ౫

## 15. ఆంధ్ర ప్రబోధము

పచ్చయ్యప్ప కళాశాలలో వాఙ్మయ సమితి కధ్యక్షత వహించినప్పుడు

21—2—1937

శా॥ భాసిల్లున్ బురి నెన్నియేనియును వాక్ప్రాభత్వముంగూర్ప భా
షా సంఘంబులు తెల్గువారికిఁ గళాశాలానుబంధంబులై;
వాసిం బచ్చయయప్పశాలగనె విద్వత్పూజ కవ్వారిగా
ధీసంపన్నుల సత్ప్ర సంగముల సంధింపన్ బ్రయత్నించుటన్. ౧

ఉ॥ సందియ మెందు దీరునదె శాస్త్రము; ధ్యానము సేయదేని నా
నందముగల్గు మంత మది; "నాయది నే ననుమాట పోల దీ
యందఱనున్న యాత్మయొకఁడన్నదె తత్త్వము; ధైర్యమిచ్చు వా
నిం దగు దేశికుండనఁగ; నిక్కమదే యెది యొక్కఁడో సదా. ౨

శా॥ హృద్యంబైనది యాంధ్ర భాష విన వాగీశుల్ కవుల్ సత్కవుల్
విద్యారణ్యుఁడు, రాయ లిర్వురు జగద్విఖ్యాత విద్వత్ప్ర భుల్
సద్యోగీంద్ర కృతుల్ తరంగములగుఁ సంగీత; మీ విశ్వమం
దాద్యం బాంధ్రు లభూమి శ్రీ నగము శేషాద్రీ ంద్ర మం దుండుటన్.

ఉ॥ విత్తన మెంతయైన వటవృక్షము పెద్దదిగాదె? బాలకుల్
విత్తులవంటి వారు; పెనువృక్షములై ఫలియింతు రెంతగా
సత్తువ సేయ నంతగ;ఁ బ్రశస్త కవీశుల దోహదంబుచే
నుత్తమధర్మవేత్త లగుచుందురు కొందఱుమాత్ర ముర్విలో. ౪

చ॥ చదివిన దేదియైనఁ దమ సత్త్వమె వ్యక్తులు వెల్వరింతు; రూ
రిఁదినియు జంతువుల్ వెలువరించును గాదె పృథగ్గుణంబు లా
పదలయినన్ స్వధర్మమును బాయరు ధీరులు! బాలభక్తుల
భ్యుదయముఁ బొందరే? మనుధు వుండును దానవడింభకుండునుఁ.

ఉ॥ కాలము దేశమున్ దెలియఁగా వివదించుటకంటె సత్కవీం
ద్రా ళి వచించువాక్యముల యందలి భావములన్ గ్రహించి స

చ్ఛీలముదాల్చి డెందమునఁ జింతలమాని సుఖించుటొప్పునో
బాలకులార! వట్టివి చవాకు లవాకు లికేల? గోలకా? ౬

క॥ కాలంబుమారె నిపుడను
కూలంబులు లేవటంచు గొణిగెద రధముల్
శీలముగల భక్తుల కే
వేళన్ సిద్ధంబు సిద్ధి విజ్ఞులసేవన్. ౭

మ॥ చదువుల్ నేర్చుట భుక్తికా? తినుటచే సార్థక్యముం జెందునే
బ్రదుకుల్? తిండికిలేక యెవ్వఁడయినన్ బ్రాణంబుఁ గోల్పోయెనే
బ్రదుకంగాఁ దిని సర్వసంశయములం బ్రజ్ఞాసి ఖండించి యా
పదలన్ ధైర్యముఁదాల్చి యార్యులనఁగా వర్ధిల్లుఁ డాంధ్రుల్ ప్రభన్.

మ॥ చదువుల్ నేర్వరె! సంపదం బొదలరే! సౌఖ్యంబు లాసింపరే!
కదనప్రౌఢిమఁ జూపరే! కనిరె చొక్కంబైన యానందమున్?
మదిఁబూఁబోఁడులుపూరుషుల్ కొఱఁతలన్మార్మ్రోములై యుండుటే
కద శేషించెఁ బ్రతీచి! ప్రాగృషుల విజ్ఞానంబె శాంతంబిడున్. ౯

క॥ ఆచదువులు నానుడులు ప్ర
తీచీ పద్ధతుల నేర్చి తీరిన వేళన్
బ్రాచీ ప్రాచీనము ల
ర్వాచీనుల కెక్కఁజేయు భాషాసమితుల్. ౧౦

ఉ॥ పండితుఁడన్న మున్నుభయభాషలలోనన యన్నమాటె; ధీ
రుం డిరుభాషలందుఁ జతురుండయి, మూలమునందు నర్థమున్
మెండుగఁ దెల్పు నెల్లరకు; నేటికి మూలముఁ జాలులేని యు
ద్దండుల దండకంబులె ప్రధానములై విలసిల్లు నెల్లెడన్. ౧౧

ఉ॥ సూరులు మున్ బ్రధానపరిశోధనఁజేసి తరించినారహో!
శూరుల కప్రధాన పరిశోధన సాధనయాట, నేటికే
దారియులేని వింతలు, కతల్, బ్రకటించుచు, ధీరులౌచు ను
న్నారెటువంటివారలు ననారత మేరనువారు లేమిచేన్. ౧౨

ఉ॥ భావము భక్తి లేకయె ప్రబంధములెవ్వఁడు వ్రాసె? వ్రాస, ముం
దేవొ, పిఱుందనేవొ, గ్రహియింపఁగ సాక్ష్యములున్న మేలెగా!
యేవియులేనియప్డు, మదికెట్టులఁ దోఁచి ననట్లువ్రాసి, త
ద్భావమెఱుంగ; కేటికి వృథాబుధులొందుదు రీ మనోవ్యథల్? ౧౩

ఉ॥ వీఁడనుమాట మాత్రమున వెన్కకు నన్నయభట్టు నెట్టె, చో
డుం డొకరుండు ముందున కెటుల్ చను నట్టులు రానినాఁడు భ
క్తుండు, బుధుండు, చోడుఁడు, నుతుల్ గొన నర్హుఁడు గాఁడె? యేటి కీ
దండుగవ్రాఁత? గ్రంథపరతత్త్వవిచారణఁ జేయఁ జెల్లదే? ౧౪

ఉ॥ ఆగ్రహమూను దానిని సమర్థనముం బొనరింప నేవియో
ప్రగ్రహశూన్యవాక్యములఁ బల్కుచు; నొల్లని శిష్టపాళిపై
విగ్రహముం బొనర్చెడు ప్రవీణులమాటలె చెల్లుఁగాని య
వ్యగ్రతఁ దత్త్వనిష్ఠఁ గొనునట్టి మహాత్ములపల్కు చెల్లునే? ౧౫

## మంచిమాటలు

రాజధానీకళాశాలలో విద్యార్థులకు జెప్పినవి.

20—7—39

గీ॥ మాటఁబోలు మాట మాటకు మాటకు
నెంచిచూడ భేద మెంతో కలదు,
మాటలందు మంచి మాటలు వేరగు
మంచిమాట లెఱిఁగి మహిమఁ గనుఁడు. ౧

గీ॥ మనసులోనఁ గలదు మంచియుఁ జెడ్డయు
మంచివాని కెల్ల మంచి యగును
చెడ్డవానికెల్లఁ జెడ్డగనే తోఁచు
నెంచకుంటకంటె మంచి లేదు. ౨

గీ॥ మంచి చెట్టకన్న మంచిగఁ దోఁచును
మంచి చెడ్డ, చెడ్డ మంచి, యగును
హితము మంచి, ప్రియమ దెంచంగఁ జెడ్డయౌ
మంచివాఁడు హితము మఱుఁగువాఁడు.

గీ॥ మాట వెన్నఁబోలు, మనసు పాషాణంబు
మాట కత్తియైన, మనసు వెన్న
మంచివారలట్లు వంచకు లుందురు
మంచి నెఱుఁగు బుద్ధిమంతుఁ డెవఁడొ. ౪

గీ॥ ఎంత యెఱుపు, పొంక మెంతయా ముసిడికి
నాల్కమీఁదఁ బెట్ట నరకముగద
పైన మంచిఁ జూపి భ్రమపెట్టు నెన్నియో
మంచి నెఱుఁగ వట్టిమాట కాదు. ౫

గీ॥ సాధుబాధ సేయు శస్త్రంబు చెడ్డయౌఁ
గంతి గోయునట్టికత్తి మంచి
చేఁతలందు లేదు చెడ్డయు మంచియు
చిత్తమందుఁ గలదు చెడ్డ, మంచి. ౬

గీ॥ మెత్తనైన వెన్న మేలందు , మేకులు
మెత్తనైన వాని మే లటండె !
బట్ట మెత్తనైన బండయు మెత్తన
యైన మంచి యగునె యరసిచూడ. ౭

గీ॥ మంచిది భారతవర్షము
మంచివి గంగాదినదులు మలయాదిగిరుల్
మంచిది వేదము శాస్త్రము
మంచివి చౌషష్టికళలు మనతత్త్వంబున్. ౮

గీ॥ మంచివారలు మనకవుల్ మనవికావ్య
నాటకాదులు మంచివి నాణెమైన
యాంధ్ర గీర్వాణములు మంచి వవనిలోన
మనము మనజాతి, తెలివియు మంచి వందు . ౯

గీ॥ మంచి మంచి యన్నమాటలు మేలౌనె
మంచిగుణము లలవరించుకొనక

ఎన్న నేటి కురక యేనాటిమంచి ? యా
మంచి యెంత కలదు మనకు నేఁడు! ౧౦

గీ॥ కళయొ శిల్పమొ కవితయో కార్యదీక్ష
ఘ్నాని తీఱిక వేళల మానసమున
కంద మానంద మానటు లభ్యసింప
రాదె విద్యార్థు లూరక రచ్చలేల? ౧౧

గీ॥ వట్టి దేశాభిమానముల్ గిట్ట వెందు
దేశవిద్యలు కళలు సందేహ మెడలి
బుద్ధిమంతులు నేరిచి సిద్ధిఁగాంచి
విత్తనము భూమిలో నిల్పఁబెట్టవలయు. ౧౨

గీ॥ నేర్వలేక యున్న నేర్చినవారల
నెంచి గౌరవించు టెంతొ మంచి
మంచి మాటకన్న మంచినీ రన్నంబు
గలుగఁజేసి వారి నిలుప మంచి. ౧౩

గీ॥ బ దుకనిచ్చి వారి పాండిత్యమును శిష్య
కోటి కొసఁగు వీలుఁగూర్చి యేర్చి
పెద్దసభలలోన విద్దెలు నేర్చిన
వారిఁ బూజసేయవలయు నేఁడు. ౧౪

గీ॥ కన్నులున్న నేమి గ ంథమున్ననునేమి
కర్త కర్మ కి యయుఁ గల్గనేమి?
వెలుఁగులే కొకింత తెలియఁజాలని యట్లు
గురుఁడు లేక తెలిసికొనఁ దరంబె. ౧౫

గీ॥ ఆంగ్లవిద్యనేర్చి యాంగ్లరాజన్యులఁ
గొలిచి యెట్టి ఘనతఁ గొనిన యేనిఁ
దెలుఁగు సంస్కృతంబుఁ గలనైన మఱువక
మహిమ గాంచు టెంతొ మంచిమాట. ౧౬

# 17. వార్థా విద్యా విధానము

1939

క॥ కుక్షింభరిత్వ మొల్లక
యక్షరతత్త్వంబు నాశ్రితౌఘంబునకున్
శిక్షించి చెప్పు గురుఁడే
సాక్షాచ్ఛివుఁ డనఁగఁ జెల్లు సందియ మేలా? ౧

మ॥ కలుగంజేయును మంచిభావములు; పేఁకం బెంచు; శాస్త్రంబుచే
విలయంబుం బొనరించువాసనల; సద్విజ్ఞానులంజేయు శి
ష్యుల; మూర్తిత్రయరూపుఁడై గురుఁడు సర్వోత్కృష్టుఁడై యుండును
జ్వలమా తన్మతి భక్తితో నెఱిఁగి; విశ్వశ్రేయముం గాంచనౌ. ౨

మ॥ కలయం దున్ని పొలంబు సిద్ధముగఁ, జక్కన్ విత్తనాల్ చల్లి వె
గ్గలమౌ కల్పును దీసి, చీడలను దొల్గంజేసి, పండించి, పం
డులపాల్సేయక జ్ఞానసస్యమును ముందుంగొల్చు శిష్యాళి యా
కలిదీరన్ గురుకర్షకుం డిడెడు పేఁకన్ సర్వకాలంబులన్. 3

శా॥ ఆనందాప్తికి హేతుభూతములు విద్యల్, సత్కళల్, శిల్పముల్
దానం గాదొకో? ప్రాళ్ళరంగులను సత్కావ్యమ్ములం బాటలన్
నానాభంగులఁ గర్మభూమిని జగన్నాథుం బ్రశంసించినా
'రేనాఁడెవ్వఁడు దేనఁ దేలునో'? యటం చెంతో కృపన్ నేర్పరుల్. ౪

శా॥ పిండప్రాప్తికి పర ధర్మములు లోపింపంగఁ గాకంబులై
యుండంగా ఫలమేమి? సింగములకో హా! పర్ణముల్ దింట మే
లంద్రే! లేడికి మాంసభక్షణము సేయన్ వచ్చునే శౌర్య? మె
వ్వం డే ధర్మముచేయఁబుట్టె నది తీర్పన్ బ్రాణ మర్పింపనౌ. ౫

శా॥ స్పర్థల్ మానినఁ గాననౌ సకల తత్త్వం బెన్ని దేశాలకున్
వార్థుల్ దాఁటిచనన్ గనంగలరె సర్వజ్ఞత్వమున్? వేద్యస
ర్వార్థపాపకులైన పెద్దల యభిప్రాయంబు లర్థింపకే
వార్ధాపద్ధతులేల ? యిప్పటివె లేవా ? దుష్టదైవాప్తముల్. ౬

శా॥ దుంగం దా విడనాడి యెత్తుకొన మొద్దుం దాన నెద్దేని మే
లుం గండే మది? దేనికై యెవఁడు చాలున్ వేదమో! శాస్త్రమో!
సంగాతం బలదాని కాతనికి శస్త్రంబోఁ గళాకౌశలం
బుం గుర్వంతికమందుఁ బూర్వులిటు సంపూర్ణంబుగాఁ గాంచరే. ౭

చ॥ కుశలతఁ బాసి యెల్లరును గూలిజనంబుగ మార సత్కళల్
యశముఁ దొఱంగెయంత ముల యార్భటిదిక్కులుమ్రోసె నేర్పు కాం
డ శనము లేక కుందెద రహో! గృహబంధము సళ్ళ నొంటిఁగా
వశులయి దుఃఖసంతతి కపారభవాంబుధి మున్గుచుండరే? ౮

---

శ్రీ

కింకవీంద్ర ఘటాపంచాననాది బిరుదాంచితులయిన
బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిలవారికై రచించిన

## స మా శ్వా స ప ద్య ము లు

చ॥ చదివి సమస్తముం దెలిసి సత్కవిసింహుఁడవంచు నెల్లెడన్
విదితుఁడవైతి; వేంకటకవీ! నృపులెల్లరు నిన్నుఁ గొల్చి సం
పదల నొసంగినార; లసమానము నీదుచరిత్ర మేమిటన్;
గొదువ యొకింత లేదని నినున్ విధిచూడఁగ లేకపోయెఁగా. ౧

చ॥ పరమసఖున్ మహాకవినిఁ బ్రాణసమానునిఁ బాపె మున్నహో!
తిరుపతిశాస్త్రి; నీవు కవిధీరుఁడ వన్నది నిక్కమాటచే;
వరమతివై భరించితివి వంత రవంత కొఱంతలేక సు
స్థిరకవితాధురంధరతచే జగమేలెద విట్టి నీపయిన్
గరుణ యొకింత లేక కులకాంతను బాపెఁగదా విధాత్రుఁడున్. ౨

శా॥ నీ యర్ధాంగి మహానుభావ సుఖివై నీవుండ నీముందటన్
బోయెన్ బుత్రులఁ బుత్రికల్ గని మహామోదంబుతో, నిత్యమా
కాయంబుల్? మనమందు నిల్పుమిఁక నక్కంజాక్షు; నాతండెపో
ధ్యేయుండై నను గేయుఁడైన గతియేదీ యొందు వానిన్ వినా. ౩

---

శ్రీ

# తిరుమల శ్రీ నివాస త్రిలింగ మహావిద్యాపీఠ సందేశము

## కింకవీంద్ర ఘటాపంచానన

## బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిని

## పచ్చయప్ప కాలేజిలో జెన్నపుర్యాంధ్రులు 1116 లచే బహూకరించినప్పుడు

చ॥ తిరుమల శ్రీనివాసవినుతిం బొగడొందినపీఠ మిద్ది శ్రీ
తిరుపతి వేంకటేశ వినుతిం బొగడొందినవారు మీరు నేఁ
డిరువురు నొక్కరూపముననే యిట దక్కిన వేంకటేశుతోఁ
దిరుపతినిన్ భజించుట యదృష్టము కాదె బుధాళి కీసభన్. ౧

చ॥ తిరుపతివేంకటేశ్వరులధీరత దేశమునందు నెందునేన్
స్థిరముగ నిల్చియుండుట ప్రసిద్ధము నేటికి వేంకటేశుఁడే
వరదుఁడు, లోకసమ్మతుఁడు, పండితపామరసేవ్యుఁ డీతనిన్
గురుఁ డనుకొంచు సత్కృతులకున్ దగి రెందఱొ సత్కవీశ్వరుల్.

ఉ॥ మానఘనుండు, మాన్యుఁ, డవమానితకింకవిలోకుఁ డుత్తమ
స్థానసమర్చనీయుఁ డవతంసుఁడుపో సకలాళి, కచ్యుత
స్థాన మలంకరించు కవిచంద్రుఁడు వేంకటశాస్త్రి, కైతకున్
మానము, వీనికిన్ ధర సమానము గాన మహీనుఁ డన్నిటన్. 3

ఉ॥ దేశికునాజ్ఞ నిద్దఱిలఁ దిర్పతివేంకటులై కవీంద్రులై
దేశికులై కవీంద్రులకు దిగ్విజయం బొనరించినారు నేఁ
డీశుఁడవై యొకండవె వహింతువు పెంతు కవిత్వరాజ్య మా
శ్రీశకటాక్ష మాఁతగొని శ్రీపతి వేంకటశాస్త్రిధీమణీ. ౪

గీ॥ తిరుపతికి వేంకటేశున కరయ వస్తు
భేద మావంతయేనియు లేదుగాని
అంద అనుకొనుమాట నే నాఁడుదాన
వేంకటేశునిమూర్తిపై వేడ్క ప్రజకు. ౫

గీ॥ కవితఁ జెప్పంగవలెనె వేంకటకవీశుఁ
డలరఁజేయును వట్టిమాటలకె సభల
భావములు తేటమాటలఁ బలుకవలెనె
సరసులఁ గఱంచు పద్యంబు చదివినంత. ౬

చ॥ కవులయి కైతగట్టి నృపకాండమునున్ దనియించి యెట్టులో
నవనిఁ జరించు వ్యక్తులకు నంతకు నంతియ కాక తక్కునే
ప విమలదీక్షఁ దత్త్వముఁ బ్రబంధములందునఁ దేటమాటలన్
జవు లొదవంగ వ్రాయు కవిచంద్రుల కబ్బు మహత్త్వసంపదల్. ౭

ఉ॥ నాడెము తగ్గుచున్నయది నాటికినాఁడు సభాంతరమ్ములన్
గూడెడివారికిన్ గవులకున్ రసికాళికి గ్రంథపాళికిన్
వేసటఁ బుట్టఁజేయరె! కవిప్రవరుల్ భవబాధఁ బాపుచున్
గీడఁగ నీ జగాన విహరించుట నేర్పు ప్రబంధరాజిపైన్. ౮

ఉ॥ వ్యాసునియంత వాని హృదయంబున శాంతి ఘటింపదాయె దు
ర్వ్యాసుని యంతవాని మనమందునఁ దాలిమి లేకపోయె నే
బాసలు వ్రాఁతనేర్పులు, ప్రభావము లేటికి? నెట్టిశీల మ
భ్యాసము చేయఁ బూర్ణఫలమబ్బునో దానిని దెల్పుఁడీ కవుల్. ౯

ఉ॥ రాఁదగినంత వచ్చెను దిరంబగు వన్నె కవీంద్ర ! నీవు ని
ష్ఖేదపదంబున న్నిలిచి కీర్తికి నెక్కుడు పూర్తియాట స
ద్వాదివి గమ్ము పద్యములఁ దత్త్వము దెల్పుము సాధుగోష్ఠిపై
మోదము గూర్పుమీ ప్రజకు మోదము నొందుచునుండుమీవునున్.

ఉ॥ వేంకటశాస్త్రిఫక్కి యని విశ్రుతమౌ సకలాంధ్రభూమి నే
శాంకదివాకరంబుగఁ బ్రహర్షమెలర్పఁగఁ బద్యధోరణుల్
జంకును గొంకులేని కవిచంద్రుల కెల్లను మేలుబంతివౌ
కింకవిరాజమత్తగజకేసరి నీ సరిలేరు ధారుణిన్. ౧౧

## శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ సందేశము

బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ కవిసార్వభౌమ
శ్రీ పా ద కృ ష్ణ మూ ర్తి శా స్త్రి గా రి ని
విజయవాడలో రూ 1116 లచే సమ్మానించి శ్రీవారికి గజారోహణోత్సవము
చేసిన సందర్భమునఁ జెప్పిన

### వి జ య తా రా వ ళి

ఉ॥ భాగ్య మనంగ నీ విజయవాడది, శ్రీ పద కృష్ణమూర్తినిన్
యోగ్యుని, శ్రౌ తి, వైదికు, మహోన్నతు, సాత్యవతేయతుల్యునిన్
వాగ్యజనప వీణు, బుధవందితు, సత్కవిసార్వభౌము, ధీ
రాగు ్యఁ ది లింగవీరుని మహాసభ నర్చనసేయఁగల్గుటన్. ౧

ఉ॥ చేయనిరాజధానిగఁ బ సిద్ధిగనెన్ బెజవాడ యయ్యుపా
ధ్యాయవరేణ్యుఁడైన కవితల్లజుఁ డెల్ల తి లింగభూమి క
గీ యుఁడు, సార్వభౌముఁడు ప కృష్టము మీ బహుమాన మిత్తటిన్
రాయలె యుండెనేని తనరాజ్యమునన్ సగ మిచ్చి మెచ్చఁడే. ౨

ఉ॥ పెద్దన కెంతఁజేసె పృథివీపతి కృష్ణుఁడు, కృష్ణమూర్తికీ
పెద్దచరిత కేమిడినఁ బెద్దగు! భోజుఁడు రాణ్మహేంద్రు ఁడున్
దద్దయుఁ జేయఁజాలరనఁ దక్కిన బక్కల మెట్లు నేర్తు, మీ
కొద్దియె ము న్గచేలునటుకుల్ బలెఁ దా గ్రహియించుఁగావుతన్. ౩

ఉ॥ ముష్కరకాలమందుఁ గవిపూజలు నీ బెజవాడ సల్పుటల్
దుష్కరమైననున్ గనకదుర్గకృపన్ నెఱవేర్చి నేఁటి కా
విష్కరణం బొనర్చె నిటు వేయును నూటపదార్లు వస్త్రముల్
పుష్కలమైన గౌరవము పొంపిరివో నిడి కృష్ణమూర్తికిన్. ౪

శా॥ దేవబ్రాహ్మణపూజనంబులకె పృథ్వీపాలురైనారు ము
న్నాంవంశంబులఁ జిక్కియున్న దొర లియ్యాంధ్రావనిం జిక్కుభూ
దేవశ్రేష్ఠుల వేల్పులన్ మనుచు కీర్తిన్ గోరి యౌచిత్యమున్
గావంగాఁదగు సంతతం బదియె ధన్యత్వంబగున్ వారికిన్. ౫

ఉ॥ పండితపూజ యన్న నెది పైఁబడునో యని తప్పుకొన్న నా
ఖండలుఁడైన నేమికొఱగాఁ డతఁ, డూఁగెడు విద్యలందుఁ జూ
పం డెవఁ డాదరం బతనిభాగ్య మభాగ్యము, వానికన్న వ్య
ర్థుం డిల లేఁడు, వాఁడు ధనదుం డగునేనియు దాత గానిచోన్. ౬

ఉ॥ వీసము కల్లగా దది కవిప వరేద్యుఁడు కృష్ణమూర్తి తా
వ్యాసుఁడుగా జనించి యిసుమంతయు వీడక తెల్గుబాసలో
వా సెను భారతంబును సెబాసన వేల్పులు వీనికెవ్వరున్
జేసెడిదేమి సత్త్వమున సిద్ధి సమగ ము గొన్నవానికిన్. ౭

ఉ॥ పూజ్యుల కెల్లఁ బూజ్యుఁడు, ప బుద్ధుఁడు, సిద్ధుఁడు, సత్కవిత్వసా
మా జ్య ధురంధరుండు బహుమాన్యుఁడు కాఁడని పల్కువాఁడపో
త్యాజ్యుఁడు ధర్మపుత్రుఁ డిడ కాగనె యర్ఘ్యము కృష్ణమూర్తికిన్?
వ్యాజ్యములేల వా త్యులకుఁ బండితగౌరవమెల్లెఱుంగనొ. ౮

శా॥ స్వాధ్యాయంబది శ్లోకరూపమున వ్యాసపో క్తమైయుండ న
య్యధ్యాయంబుల రెండుతొమ్మిదుల హృద్యంబైన పద్యంబులన్
విధ్యుల్లంఘనలేక వా సి తనప్రావీణ్యంబుఁ జూపన్ మహో
పాధ్యాయాఖ్యను గృష్ణమూర్తికవి సంపాదించె సామాన్యమే ! ౯

ఉ॥ వేదమునందు నున్నదె కవిప వరుల్ ఋషికల్పు లౌచు స
మ్మోదము పుట్టవా యుదురు పొత్తములన్ బహుకల్పశాస్త్రమ
ర్యాద లెఱింగి భారతము వా సిన శ్రీపదకృష్ణశాస్త్రికిన్
రాదనునంట శాస్త్ర మొకవా యసకాఁ డనువార మీరసన్. ౧౦

చ॥ కవులకు శాస్త్రముల్ కళలు గల్గును పుట్టుకఁ బుట్టపుట్టు వె
య్యవి చదువంగనయ్యెను గవీశుఁడు మంత బలంబె యూతఁగా
భువి దివి నంతయుం దెలిసి పూర్ణత గాంచుచు నాదికావ్యమున్
జవులొదవన్ లిఖింపఁడె ప శస్తులు దానికి వ్యాఖ్య వా యరే. ౧౧

శా॥ పాండిత్యంబు ప మాణబుద్ధియె యగున్ బ జ్ఞానసంపత్తి భ
క్త్యుండై పొందునుగాక శాస్త్రములఁ గైకోవచ్చునే కీడికిన్

బెండైపోవదె గాండివం బొకట మున్ విపార్థమై యేకల
వ్యూండున్ బాండవమధ్యమున్ గెలువఁడే యోహో గురూపాస్తిచే.

ఉ॥ చిక్కిన పెద్దలిద్దఱె ప సిద్ధులు సిద్ధులు తెల్గుభూమి కం
దొక్కరి నొక్కరేమన నహో మన వేంకటకృష్ణశాస్త్రులన్
మొక్కవలెన్ మహాత్ములఁ బ్రబుద్ధు లదెంతటివారు వారికిన్
దక్కువె యెవ్వరేమన యథార్థముఁ జూచెద నాత్మతృప్తికై. ౧౩

చ॥ అలసిరి దేశనాయకు లహర్నిశమున్ వ్యవహారబాధలన్
గల బలముం జలం బుడుగఁ గావ్యమొ కల్పమొ వారెఱుంగ టీ
తెలుఁగులఁ బ్రోవఁగా సుకవిధీరులు మీరలుగాక తక్కొరుల్
గలరొకొ యాపదుద్ధరణకై బలగంబులఁగూర్పఁ డెల్లరున్. ౧౪

శా॥ మీరల్ వ్రాయు మహాప్రబంధములపేర్మిన్ నిల్పు శిష్యాళియున్
మీరల్ చూపినదారిఁబట్టి మదిలో నిత్యంబు సన్మార్గ సం
చారంబుం గొను భక్తబృందము భవిష్యన్నాస్తికగా మ్య దు
ష్పా రంభంబులలో నణంగ కెటో నిల్వంజూడుఁడీ స్వస్థితిన్. ౧౫

ఉ॥ తారకులాదు రిక్కలిని దత్త్వమెఱింగిన సత్కవీశ్వరుల్
ధీరులు మీరు ధర్మము ప తిష్ఠ యొనర్పుఁడు దీక్షఁబూని సం
చారముచేసి సల్పుఁడు ప చారము వాక్కుల వర్తనంబులన్
మీర లుపేక్షసేయ నవనిన్ దెనుఁగుల్ గనఁబోదు రెవ్వరిన్? ౧౬

ఉ॥ వందలువేలు సత్కవు లవారితసత్త్వులు మిమ్ము మీ ప భన్
ముందర నుంచుకొంచు బలమున్ యశముంగొని యాంధ్రభూమి కా
నందము పంచిపెట్టుదురు నాఁడెము వీడక శిష్టసమ్మతం
బందమునైన గ ంథముల నాశ భయంబును వీడి వేడుకన్. ౧౭

ఉ॥ కొంకును జంకులే కెవిరియొ గోఁకెదు కాకవిమూకలెల్ల మా
వేంకటశాస్త్రి కొంతబిగివీడిన బాసలవాఁడు నంచు ని
శ్శంకతఁ బల్కవా యవిన సాహస మూనకుఁడయ్య మీకు న
క్కింకవిరాజమత్తగజకేసరి కెంతటి యంతరంబొకో. ౧౮

ఉ॥ కుట్టలతోడ నాడుపలుకుల్ వలె వేంకటశాస్త్రి గా వ్యపుల్
వెట్టిగలట్టిబొట్టియల వేడుకకై యటులాడునేడపూ
మిట్టును బల్లముల్ దెలిసి మింటఁ జరించెడుదంటమైన నా
కట్టికి నీడులేఁడు విలుకాఁ డెదురాడెడువాఁ డ దేడనో. ౧౯

ఉ॥ ఎవ్వరిసత్త్వ మేరెఱుఁగ రిద్దఱ సత్త్వమెఱుంగు లోక మా
ముప్వురఁ గన్నయవ్వ యిటు బొమ్మలయాటలనాడుచుండఁగా
నెవ్వగ నవ్వులేల జననిన్ మనమిత్తఱి వేడుకొంద మీ
చివ్వలమాన్పి యెప్పటటు సేయఁగ వేంకటకృష్ణశాస్త్రులన్. ౨౦

ఉ॥ ఇద్దఱి నింతఁ జేసెఁ బరమేశ్వరి దానికి మీర లేలొకో
తద్దయు వాదులాడుట వృథా యిఁకఁ జాలును జాలుఁ జాల్మహో
పద్దళనొందియున్నది ప భావముఁ గోల్పడి యార్యవిద్య మీ
రిద్దఱు నిష్ఠఁ బూని పరమేశుఁ బ తిష్ఠయొనర్పఁ డెల్లెడన్. ౨౧

ఉ॥ శిష్టులలోన వాదయినఁ జేసెడి దేమిఁక ధర్మరాజుతో
నిష్టతముండు పార్థున కొకింత య దెంతకుఁ దెచ్చె మైత్రితో
షష్టులు సప్తతుల్ గడచి స్వాంతము శాంతికిఁ దార్చువేళలో
భ ష్టులు తుష్టినొందఁ దగవా ? యిటు ధీరులు పోరు సల్పఁగన్.

చ॥ ఒకని కొకప్డు కల్గును మహోన్నతి యొక్కని కింకొకప్పుడో
నొకనికి నొక్కకారణ మికొక్కని కింకొక కారణం బగున్
కకవికలేల యీశ్వరుఁడె కారణ మో కవులార ! దేశ మూ
రక యుడికింప కీ ర్గురుపరంపర నిల్పుఁడు తత్త్వదృష్టితోన్. ౨౩

ఉ॥ ఏదుగు రేము వారు శతమోదు రొరుల్ మము మారుకొన్న మే
మోదుము నూటమైమగుర మన్నయుధిష్ఠిరువాక్యమూదుచున్
వేదము శాస్త్రముం గళ కవిప వరుల్ గడు డయ్య వేళ నీ
వాదము మాని వాని నిలుపంజనుఁ డయ్య కవీశ్వరేశ్వరుల్. ౨౪

ఉ॥ శ్రీనగకాననంబునను జెంచెత చెప్పినదారిఁ బట్టి నేఁ
బోనను బ్రొజ్జుఁడుండునె? ప్రభుండును బోయఁడు చెప్పెనంచుఁడా

మానునె మంచిదారి? బహుమాన్యులు మీరలు నేను నీశ్వర
ధ్యానము సేయువేళ మదిఁ దట్టిన దిట్టుల విన్నవించితిన్. ౨౫

శా॥ స్వస్థానంబున వేషభాషలన నుత్సాహంబు తగ్గించునే
ప్రస్థానంబు లవేల యాంధ్రులయశఃపా గల్భ్య మెక్కంగ హిం
దూస్థానంబున సర్వభాషలను నుద్యోగింపుఁడీ పాడఁగన్
స్వస్థాయిన్ విడనాడ నేరయిన స్వాస్థ్యంబున్ గనన్ జాలిరే. ౨౬

సీ॥ ఆంధ్రనాయకులు సర్వారంభములయందు
భరతవర్షంబునఁ బ బలునాఁడు
ఆంధ్రే తిహాసంబు లానందమున విన
భూజనుల్ గుంపులై మూఁగునాఁడు
ఆంధ్ర మహాకవీంద్రా ళి నూరేగింప
ఛప్పన్న దేశముల్ సాఁగునాఁడు
ఆంధ్ర విజ్ఞానబీజాంకురంబుల నిల్పి
పీఠంబు జగమున వెలుఁగునాఁడు

ఆంధ్ర కేతన మెల్లెడ నాడునాఁడు
నాఁడనఁగనేల యన్నియు నేఁడె కూడు
నాత్మపౌరుష మాలంబ మనుచు నమ్మి
నాంధ్ర నామంబు నిల్పుఁడీ యాంధ్రు లార! ౨౭

శ్రీ రామ.

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహావిద్యాపీఠమున
## శ్రీ కొప్పరపు సోదర కవులకు
### ఆశుకవి 'సామ్రాట్' బిరుదముతో సన్మానించు సందర్భమున

## 21. పద్యమాల

ఉ॥ ఎందుగుణంబుగల్గు; నది యీశ్వర తత్త్వ మటంం చెఱింగి, యా
నందము నొందుచుండెడు మనంబులు గల్గిన మాకుఁ గొప్పరా
ఖ్యం దనరారి యాశుగ మహాశుగవేగముతోడఁ బద్యముల్
వందలు వేలుఁ జెప్పు కవివర్యులధాటి ముదం బొసంగదే? ౧

ఉ॥ ఆంధ్ర కవిత్వమందు సకలావనిభాషల నెందులేని ని
ర్బంధము లుంట నిక్కము ప్రబంధములందున నెందు నేని వా
గ్బంధములే కొకించుకయుఁ; బాఱును సత్కవితాప్రవాహముల్
బంధురమై ఫలంబొసఁగఁ బాఠకమానసభూము లెల్లెడన్. ౨

ఉ॥ పూరుషపుంగవుల్ గవులు బుణ్యయశోవిభవాభిరాము ల
వ్వారల యాశుధారకుఁ బ్రపంచమునందున సాటిలేదు సం
చారముఁజేసి రెల్లెడఁ బ్రచారముఁజేసిరి భూమిపాల స
త్కారముఁబొందినార లధికారము బీరము మీఱఁ బేరిమిన్. 3

ఉ॥ ఊహకు మించినట్టిది రయోద్ధతి మీకవనంబునందు సం
దేహము లేదు దాని కదె దీటనవచ్చుఁ గవీందు లార! మీ
సాహస మేరికిం గలదె? సర్వవిదగ్రణులందు నెందు వా
ర్వాహులభంగిఁ బద్దెము లవారణ నెల్లెడఁ జల్లుచుందహో? ౪

చ॥ యతియటఁట! పాసమంట! శ్రమమా నివి యేలని? మాని వీలుగా
గతి యొకఁ డున్నఁ జాలునని కైతలు గట్టఁగఁ బూను కాకవి
ప్రతతిని; గొప్పరంపుకవి వారిదవాగ్ఝరిముంచి తేల్చి స
ద్గతి మతి ప్రాసముల్ యతియుఁ గల్గఁగఁ జేయు నటంచు నెంచెదన్.

చ॥ 'అభినయమట్టు లాశుకవితార్భటి యప్పటి కప్డు మోదముల్
సభికుల కిచ్చు' నం ఛిలఁ బ్రశస్తికి నెక్కఁగఁ జాటినార లీ

యుభయులు గొప్పరంపుకవు లుద్ధతు లొంచు నపూర్వవైఖరిన్
బ భువుల మోల మిక్కిలి ప భం గని రాంధ జగంబునెల్లెడన్. ౬

చ॥ 'అడిదమువారి ధార' యను ఖ్యాతి జగంబున విస్తరిల్లె మున్
'గడియకు నూరుపద్దెములు గంటము లేక రచింతు' రన్న య
న్నుడి నిజ మంచుఁ గొప్పరఘనుల్ వినిపించిరి నూర్లపద్యముల్
కడుఁబొగడంగరాదె గుణగౌరవముం గల యద్వితీయులన్ ? ౭

తే॥ ఉఱుము సెలయేఱుఁ గలసిన యొప్పుఁ జూపు;
శు తియు సన్నాయి మేళమౌగతి సెలంగు
శుకపికంబులు జతఁగూయు చొప్పు దోఁచుఁ
గొప్పరపువారి కవనంబు గొప్పధార. ౮

చ॥ కవనమె జీవనంబుగ నఖండసుధామధురోక్తిధారలన్
భువనము నింపి సద్హృదయముల్ వికసింపఁగఁ జేయు దీక్షకున్
సవనము లెన్నియైన నిలఁ జాలునె ? శ్రీలగునట్టివారి సం
స్తవనము సేయునట్టి విబుధప కరంబున కెల్లకాలమున్. ౯

ఉ॥ కాలము చిత వైఖరినిఁ గా లుచునున్నది నేఁడు ? వేదశా
స్త్రిలకు భూసురాళికి ధరాస్థలి మేలు లభించు వీలు సం
ఘాల సభాంతరాళములఁ గానఁగ రాదొకయింతయేని వా
చాలురు క్షుద సిద్ధులకు సర్వబలంబును నిర్వహించుటన్. ౧౦

ఉ॥ లేరనరాదు కార్యమవలీలగఁ జేయఁగఁజాలు వారలున్
లేరనరాదు దాన మవలీలగఁ జేయఁగఁజాలువారలున్
లేరనరాదు విద్యలఁ జలింపని నిష్ఠల నేర్చువార లీ
ధారుణిఁ బారమార్థికులఁ దన్పెడు ధీరులు గానరారుగా. ౧౧

ఉ॥ చిల్లులుఁ గల్గుఁబో! కవుల చేతుల భూతలనాథు లిచ్చు నా
చిల్లరరూక లప్పుడ నశించును వారికి! నిత్యమంగళం
బెల్లపు డిచ్చువాఁడు పరమేశ్వరుఁ డొక్కఁడె! వానిమాని యీ
కల్ల జగంబు నెప్డు కవికాండము నమ్మగలేదు నెమ్మదిన్. ౧౨

చ॥ కవనముఁ జిత్రలేఖనము, గానము, శిల్పము, వాగ్విలాసముల్
భువనవిమోహనంబు లయి పొల్చుట నిక్కమె కాని వాని వా
స్తవమగుసిద్ధి తత్త్వపరతం గనుఁడీ! మును సన్మునీశ్వరుల్
ప విమలతత్త్వ మేకడలఁ బాడిరి! వ్రాసిరి! తాళ్ళ రంగులన్. ౧౩

ఉ॥ ఆయువుగల్గునంతవఱ కందఱుఁ దిందురు; కట్టుకొందు; రా
యాయువు దీఱినంత క్షణమైన మనంగలవారమే? యశః
కాయము నిత్య మీయసునికాయముఁ, గాయ మపాయవహా నుపా
దేయము ధ్యేయముల్, సుకవిధీరులు దెల్పుఁడు! సారవాక్కులన్.

ఉ॥ జీవన మెట్టులో సలుపు చింతల వంతలఁ జిక్కి, యెంతయున్
భావము భ్రష్టమై చనఁ, బ్రభావముఁ గోల్పడు; నేటివారికిన్
దేవుఁడునున్, గురుండును, మదిం గనరారిఁక నట్టివారికిన్
జీవముఁ బోసి, నిల్పఁ గవిసింహులధర్మము గుర్తెఱుంగుఁడీ. ౧౫

ఉ॥ కర్మము చాలమిన్, భరతఖండమునందుఁ గ్రమక్రమంబుగా
ధర్మము తగ్గుచుండె, వివిధంబులు మోహములందుఁ జిక్కుటన్
శర్మముఁ గోలుపోయిరి ప్రజల్; సుకవీశ్వరవాక్కుదొక్కఁడే
వర్మము రక్షసేయ బుధవర్గము మానము పాణమిత్తురేన్. ౧౬

ఉ॥ మామిడి నీడఁ గోరి, మతిమంతుఁడు పెంచునె? పండ్లకై గదా!
ధీమహితుండు పెంచు; గురుదేవులు, దేవులు, గల్గు సత్తపో
భూమిని బుట్టినందులకుఁ బొందఁగఁ దగ్గ ఫలంబునొంద; కే
మేమియుఁ గాని చాయలకు నిట్టటుధావన సేయఁ జెల్లునే? ౧౭

శా॥ లోకానుగ్రహకాంక్షచేతఁ గవులున్ లోకంబులో సంచరిం
త్రే కానీ! తమకై చరింతు రని బుద్ధిం దల్పగానౌనె? యు
ద్రేకం బాత్మ జనించినప్పుడు మహాధీరత్వముం బూని; సు
శ్రీకంబా నుపదేశ సంతతిని బూరింతుర్గదా దిక్కులన్. ౧౮

శా॥ నాకుం జూడఁగ సత్కవీశ్వరులె యీనాఁడెన్నియో సత్కృతుల్
చేకోఁదగ్గ మనీషులంచు మదిఁదోఁచెన్ వారలే ధీరులై
శ్రీకైవల్యము వాఙ్మయంబునన నిరూపంగ శక్తుల్ గదా!
చీకాకౌను జగంబు సత్కవు లుపేక్షింపంగ నానాఁటికిన్. ౧౯

క॥ శాస్త్రములు నేర్చుఘనులకు
వస్త్రము, నన్నంబు వెతకవలసెఁగదా! యీ
భస్త్రిక్ వాయువు నిల్వఁగ
నిస్త్రై గుణ్యాల భరించు నిపుణుండేఁడీ? ౨౦

క॥ దేశముఁ, గాలముఁ, బాత్రము
పేసముఁ గనిపెట్టు సద్వివేకం బకటా!
లేశముఁ గానఁగరాదు వృ
థా! శ్రమ మగు సత్కవులకు ధరణిం దిరుఁగన్. ౨౧

ఉ॥ కావ్యము వాణికిన్ ముఖము, కన్నులు తత్త్వమటంచుఁబల్కి మం
తవ్యముఁ దత్త్వవేత్తలు మనంబున కెక్కఁగ బోధఁజేయఁ జి
త్తవ్యథఁజేయు పొత్తములు తత్త్వవిహీనము లెన్నియేని శ్రో
తవ్యములంచుఁ బంతురు వృథాగద! యచ్చున? మూఁక మెచ్చఁగాన్.

చ॥ చదివిననబ్బఁబోదు; పలుశాస్త్రములం గడు నభ్యసించినన్
గుదురదు పూర్వపుణ్యమునకున్ దగు లక్ష్యము వీరలిర్వురున్
మదిఁగలియన్ శరీరములుమాత్రము వేరుగఁ గానుపింతు ! సం
పదసుమి! యిట్టి మైత్రితలఁపన్ భువిఁదమ్ముల కన్న కేనియున్. ౨౩

ఉ॥ సూరులు కొప్పరంపు కవిసోదరు లాదరమొప్పఁగా సభా
స్తారుల మానసంబుల ముదంబు జనింపఁగఁ జేసి; గొప్ప స
త్కారముఁగాంచి యాంధ్ర జనతావినుతుల్ గడియించి; మించియు
న్నారలు చెన్నపట్టణమునన్ సమమానటు నాడునేఁడునున్. ౨౪

ఉ॥ పెద్దల పీఠమీయది కవిప్రవరుల్ ధరఁ గొప్పరాఖ్య మీ
రిద్దఱు సోదరుల్ ప్రణుతికెక్కితి రిక్కడ మాకుఁదగ్గ పీ
పద్దెములిచ్చి మెచ్చి మిముఁ బ్రస్తుతిసేయుట సుప సన్నులై
కొద్దిగ నెంచ కిద్ది గయికొండు మనంబున నిండుప్రీతితో. ౨౫

శా॥ మాకుందోఁచెను మీకు నాశుకవిసామాఖ్యఁ గల్పింప; సు
శ్లోకుల్! కొప్పరపుంగవుల్! వినుఁడు! మీచొప్పారయున్ దీనికిన్
మీకంటెన్ దగువారులేరు ప్రభువుల్ నెమ్మిన్ బ్రజల్ మెచ్చఁగా
లోకంబందునఁ దొంటికంటె విలసిల్లుంగాత! మీ కైతముల్. ౨౬

## ఆమంచర్ల కృష్ణారావుగారు

తి. శ్రీ. తి . మ. పీఠము సందర్శింప వచ్చినపుడు కవయిత్రి చెప్పిన

## 22. ప ద్య ర త్న ము లు

(7—5—1939)

శా॥ ఆమంచర్ల కులాబ్ధి చంద మ తి లింగాఖ్యుఁ డా మహావిద్యకుఁడా
భూమిన్ స్థైర్యము కూర్చు పీఠమిది మీ రాబోంట్లిందు మేలెంచ నెం
దేమేమున్నవి విద్యలున్ గళలు నెందెవ్వార లత్యుత్తముల్
బే మఁడా వారికి వారి సంతతికిఁ గీర్తిం బెంపుఁ గల్పింపుచున్. ౧

చ॥ స్థిరతరకీర్తి సింహపురి సింహమ శ్రీయుత కృష్ణరాయ! మున్
వరసభలన్ బ జల్ శుభమునన్ వెలయంగ నొనర్చి తెన్నొ నేఁ
డరయఁ గలిప భావమున నంతకు నంతకు నంత మొందు నీ
వరకళ లిద్ధరన్ నిలుచు పద్ధతి చూపుమ నేఁడు శ ద్ధతోన్. ౨

ఉ॥ మంచియుఁ జెడ్డయున్ గనక మందికొలంది చరించి కొంపలన్
ముంచుచు సంప దాయముల నూతన శాస్త్రము దేశమెల్లెడన్
నించుచుఁ గీర్తిఁగాంచెదరు నిక్కము గాంచఁగలట్టి ధీరులే
కొంచెమొ కృష్ణరాయ! మెటుకూడును మేలు స్వదేశ విద్యకున్. ౩

ఉ॥ పట్టఁగఁ జాలరెవ్వరుఁ బ్రవాహమునం బడిపోవు వానినిన్
బట్టదు పెద్దవారికిఁ బ్రభావము చాలదు కోరువారి కిం
కెట్టులొ విత్తనాలయిన నీ భరతావని నిల్చు టెరిఁగన్
దిట్టలొ కృష్ణరాయ మదినిన్ దలఁపోయుము కార్యసిద్ధికిన్. ౪

శా॥ నెల్లూర్మండల మెల్లఁ బీఠమున మన్నింపంబడెన్ నేఁడు మా
యుల్లంబందున నెల్ల పూజ్యులను నెల్లూర్వారి ధ్యానించియే
యుల్లాసంబున నీకు స్వాగతము నోహో! కూర్తు మాంధ్రావనిన్
జల్లుండెల్లెడ విత్తనంబులను శాస్త్రంబుల్ కళల్ పండఁగన్. ౫

## 23. శ్రీ అబ్బరాజు హనుమంతరాయ శర్మగారి సన్మానసందర్భమున నధ్యక్షత వహించినప్పుడు

(11—4—40)

క॥ వరవిజయవాడ హానుమం
త రాయ కవిశేఖరునకు నల్వురిలోఁ బె
ద్దఱికమ్ము నిచ్చి మెచ్చుట
సరసులకున్ సజ్జనులకు సంతోషమగున్. ౧

క॥ దీక్షితశిష్యుఁడు దీక్షితుఁ
డక్షరకుశలుండు పాకయాజి కవినుతుం
డక్షీణపద్యరచనా
దక్షుండీ సుజను బుధులదరిఁ బొగడఁదగున్. ౨

క॥ కవిలక్షణంబు లివి కా
కవిలక్షణము లని తెలియఁగల విబుధులకే
సువిదితము కవులభేదము
భువి నితరులు పక్షపాతమునఁ దెలియుదురే. ౩

క॥ నవరసములు కవినోటన్
బ విమలమోదం బొసంగు రసికుల కెల్లన్
భువి ఖేదమోదదము లవి
అవురా! కవిసృష్టి బ్రహ్మకైనఁ దెలియునే! ౪

గీ॥ చదివి చదివి యగును సర్వజ్ఞుఁ డొకండు
చదువక యె యెఱుంగు సకల మొకఁడు
చదువు జపములేక వదనంబుఁ దెఱచెడు
కవులు కవులె దాన గవులు గవులె. ౫

గీ॥ కవులు శపియింప దీవింపఁ గలిగినారు
కవులు శాసింప శిక్షింపఁగలిగినారు
కవులు వర్ణింప రంజింపఁ గలిగినారు
ధీరకవివరుల్ తారకుల్ గారె ప్రజకు. ౬

గీ॥ పుణ్యమును పురుషార్థంబుఁ బొందకుండ
పణ్యమా పరభావప పంచ మెల్ల
బంధమున నల్లనయ్యది ప తిభ యానె?
ప తిభకలవారి నియతికిఁ బ తిమెగాన. ౭

గీ॥ పాలము పాటలు రుచియించుఁ బాలములోనఁ
బడవపాటలు రుచియించుఁ బడవలోన
దంపుపాటలు రుచియించు దంపుసాగ
సభ్యములుగాక పోయిన సరసములవి. ౮

గీ॥ బీళ పచ్చిక కంటికిఁ బ్రియముఁగూర్చు
గడ్డిమోపులు సభలలో గారవింతె
కుసుమముల తావు లింపగు కొమ్మలందు
సభల సభ్యులమెడలలో శౌరితలను. ౯

గీ॥ 'గౌతమవ్యాసశేషులగణన యేమి?
సరససాహిత్యసిద్ధుల సరస' ననియె
మున్ను బండితరాయఁ డన్నన్న నేటి
"కేమి చదువక వచ్చు సాహిత్య''మండు. ౧౦

గీ॥ యశము నర్థంబు నిడు వ్యవహార మెఱుక
పఱచు నశుభము లన్నింటి భంగపరచు
అప్పుడే కూర్చు నానంద మన్ని తెలుపు
మనసుఁ గరగించి కావ్యంబు మగువఁబోలి. ౧౧

గీ॥ తీపి చేపుటయేగాని తెలుపరాదు
కావ్యమందురు కొందఱు నవ్యకవులు
గుబులు పుట్టించి యురికించు గురియలేక
పాడు గీతాలు తాలేరి వేడుక కగు. ౧౨

గీ॥ తీపిమాటన బుద్ధులు దెలుపఁదగును
తీపితో భక్తి నేర్పనా దేవునందు

తీపితోఁ బతిభక్తినిఁ దెలుపనౌను
తెంపులకు నేల గీతాల సొంపు లకట! ౧౩



గీ॥ కట్టలో నది పొంగును గాక యొకటఁ
దటినియై పాఱు సతతంబుఁ దరులనడుమ
వానవెల్లువ లెల్లెడ వఱదఁ బాఱి
ముంచు నన్నింటి నేరికి మోద మొసఁగు ? ౧౪

---

## 24. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమున రాజగోపాలాచారిగారి యధ్యక్షతక్రింద జరిగిన సభలో

(20—6—40)

చ॥ ఎవరిది వారి కింపగుచు నీ యిల వేయివిధాలు వెట్టి వా
స్తవమగు వేదశాస్త్రములు సత్కళలున్ రసవత్ప్రబంధముల్
సవనము లాశ్రమంబులును సద్గురుబోధము సాధుసేవలున్
నవవిధభక్తులున్ గడుఘనంబులు మా కొరుసుద్దు లేటికిన్. ౧

చ॥ తిరుపతి వేంకటేశ్వరుఁడె దేశికసూక్తి త్రిలింగపీఠమున్
బరమపవిత్ర ధర్మములఁ బాలనచేయఁ బ్రతిష్ఠచేసెనో
వరమతులార! యివ్విజయువాటిక నేటికి రాజధానియై
స్థిరముగ నొప్పు దానికిఁ బ్రసిద్ధియు సిద్ధియు సిద్ధమేగదా. ౨

మ॥ కులధర్మంబులు నిర్వహించుటయు జంకున్ మాని శ్రీసద్గురూ
క్తులఁ బాలించుట వేదవాక్యులన యుక్తుల్ మాని కేల్మోడ్చు టు
జ్వలమా బ్రహ్మముపాస్య మంటయు సదాచారంబులో మాకు ని
క్కలిలో వేంకటనాయకుం డొకఁడె నిక్కంబైన దిక్కౌరయన్. 3

మ॥ బ్రదుకంజాలక చావఁజాల కెటు లీ ప్రాణంబు లెప్డేగునో
యదియుంగానక మానఁజాల కెది చేయంజాల కెందేని మం
చిదియే గానక దేవులాడుఁగద యీ జీవుం డహంకారమున్
మదిఁ బూనున్ మమకారమూను బుధులన్ మన్నింపఁ డెన్నండునున్.

ఉ॥ వేదముఁ గాదనున్ బుధుల వెఱ్ఱులనున్ గురుదేవనిందకున్
మోదము గాంచుఁ బెద్దల ఘనుండయి దిద్దును దోస మెంచు వ్యా
సాదుల నార్యధర్మ మపహాస్య మొనర్చెడు నేఁ డొకండు దు
ర్వాదము నాస్తికత్వ మపవాదము తోడుగ నెంతొ వేడుకన్. ౫

శా॥ మింటం బారిన నీట దూరినను భూమిన్ గెల్చి తా నేలినన్
గెంటంజాలునె కాలునిన్ హరి నెదన్ గీర్తించి సంసారపున్
దంటాలన్ గడవంగ నేర్చునతఁడే ధన్యుం డదేనాటికిన్
ఘంటానాదము వోలె వేద మది మోగన్ జంక నిం కేటికిన్. ౬

ఉ॥ పీనుఁగుపెంటలోఁచుఁ బృథివీతల మెంతయుఁ గంపుకొట్టినన్
గానరు మానవుల్ శుభముగా మనుమార్గ మహంకరించుటన్
మానరు దుష్టమార్గములు మాధవపాదసరోజపూజపై
మానస మూన రీ దురభిమానులు మూఢు లెఱుంగ నేర్తురే ? ౭

మ॥ మనకున్ లేదని వారి కున్నదనుచున్ మావార లగ్గింతు రా
ఘనతన్ జూడమె నేఁడు మాడుఁగద లోకం బంత సంగ్రామభూ
మిని గ్రామంబుల నాఁడ బిడ్డలను బల్మిం జంపుటే యోగ్యమా
పనిగాఁ దోఁచెడు ధర్మమోక్షములఁ దల్పన్ వచ్చునే యచ్చటన్.

ఉ॥ ఆసురసంపదల్ ప్రబల నా సురసంపద లెల్లఁ గల్లఁగాఁ
జేసిరి చేయుచుండి రిఁకఁ జిల్లరయోజన లెన్నొ చేయుచున్
భూసురులే; కలిప్రభవముల్ వికృతుల్ చెలరేఁగ విత్తనాల్
చేసినఁజాలు సత్కళలఁ, జిక్కినఁ దక్కిన వేదశాస్త్రముల్. ౯

మ॥ పెరుమాళ్ళన్నను బెద్దలన్నఁ బరమప్రీతిన్ దదీయార్చనల్
జరుపంగావలె వేదశాస్త్రముల విశ్వాసంబుతో భక్తితో
సరహస్యంబుగ నేర్వఁగావలెను సంసారంబులో సార మా
హరినామం బని నమ్మఁగావలెను దేహప్రీతిఁ బోనాడుచున్. ౧౦

## 25. వావిళ్ల త్రిలింగరజతోత్సవసంచికకు

(6—2—41)

శా॥ భాషోద్ధారక ధర్మదీక్ష యది శ్రీవాగ్దేవి మీ కిచ్చి సం
తోషంబొందుఁ ద్రిలింగదేశమున కాప్తుల్ మీరె! గ్రంథాకృతిన్
భూపల్ ధీరులచేతులం దమరు మీ పుణ్యంబునంగాదె? యో
భాషోద్ధారక వేంకటేశ్వర సుధీవంశాబ్ధి చందా కృతీ! ౧

శా॥ రామస్వామి భవద్గురుండు తొలి గీర్వాణంబునం దాంధ్రమం
దామూలాగ్రము గ్రంథసంతతిని దా నచ్చొత్తి మేల్చేసె నీ
వా మార్గంబునఁ దండ్రి మించితి! బుధపా రంభముల్ నిల్వఁగాఁ
బ్రేమం జేసెద వెంతొ సాయ మది కీర్తింపందగున్ సర్వధా. ౨

ఉ॥ ఆస్తికులైన వారల సమాదరణంబునఁ బ్రోత్సహించుచున్
నాస్తికదుష్ప్రచారము నణంతువు భారతధర్మబోధనన్
స్వస్తి యొనర్తు వాంధ్రులకు వారము వారము నీ "త్రిలింగలో"
వాస్తవతత్త్వబోధకుల వార్తను వర్తన ముగ్గడింపుమా. ౩

ఉ॥ చిల్లర పొత్తముల్ సరకుసేయక పండితసత్కవీంద్రసం
ఫుల్లముఖారవిందములఁ బుట్టిన పుస్తకరాజి లోకమం
దెల్లెడ నింతు నీకు సరియే పృథివీశులు వేంకటేశ! వా
విళ్ల గృహప్రదీపమ! కవిప్రవరుల్ నిను నెంతు రెంతయున్. ౪

ఉ॥ సామ్యుఁడ వౌదు వాంధ్రకవిచంద్రుల కీవు సఖుండ వెందునున్
సామ్యములేని శీలము సనాతనధర్మహితైకభావ మ
గ్రామ్యము నీ ప్రచార ముపకారము నైజము నీకు ధాత్రిలో
రమ్యము నీ చరిత్ర బుధరాజి నుతింపఁగఁ బెంపుఁ గాంచుమా! ౫

---

## 28. వి జ య న గ ర ము

### వేదవిజ్ఞానవర్ధనీ పరిషత్తున స్వాగత సందర్భమున

### ( 15—6—41 )

శా॥ తాతావంశకళాప పూర్ణుఁ డురుశబ్దబ్రహ్మ తత్త్వార్థవి
ద్యాతంత్రజ్ఞత నాగభూషణు త్రిలింగాభిఖ్యతారాయఁడై
ఖ్యాతుండయ్యె గురుప్రసాదమున లోకంబందు నాతండు సం
ప్రీతిన్ బిల్వఁగఁ జూడఁగంటి మిముఁ గీర్తిం గంటి మీ సత్కృపన్.

శా॥ భీమాచార్యుఁడు సంగమేశ్వరుఁడు తృప్తిన్ గాశి కృష్ణుండు నెం
తో మైత్రిన్ నడపింతురేని యెడఁ దన్నున్ "మూలరామప్రియా"
ఖ్యామర్యాదను జేరె సద్గురుఁడు నా కాన్యార్తి కృష్ణుండె ముం
దా మా యింటికి వచ్చి పిల్చె నను వాత్సల్యంబు దీపింపఁగన్. ౨

శా॥ ఎంతేఁ బండిన గుఱ్ఱమెత్తయినఁగాదే యేనుఁ గీపట్టణం
బెంతేఁ దగ్గియు రాజచిహ్నములతో నీ నాటికిన్ మించు శ్రీ
మంతుల్ స్థాపకు లెల్ల విద్యలకు మీ మధ్యంబునందున్న వా
రంతర్వాణు లహో! విజేనగరమాహాత్మ్యంబు సామాన్యమే. 3

ఉ॥ మున్నది లింగపీఠమునఁ బూజల నందిన పండితేందు లన్
గన్నులఁ గాంచి సంతసముఁ గాంచితి నేఁ డిట జ్ఞానబీజముల్
గొన్నిఁటినైన నిల్ప ననుకూలత గూర్పుఁడటంచు సద్గురుం
డన్నది ముఖ్యధర్మము దయన్ బుధు లయ్యది నిర్వహింపుఁడీ. ౪

చ॥ బ తుకఁగలేక యెవ్విధినో పా ణము దీసికొనంగఁ బూనుట
న్నది యిపు డాంగ్లవిద్యలఁ గనంబడుఁ దొల్లిటి సంస్కృతంబునున్
జదివినవారు శాంతముగ సత్త్వముతో బ దుకంగ నేర్చి సం
పద యని యుబ్బ రాపదల మా న్పడ రాంతరదృష్టిఁ బొల్చుచున్.

చ॥ సరసము సంస్కృతం బది ప శస్తము భారతవర్షమందు ని
ర్భరముగ నుండు పండితులపాలిటి కల్పక మద్ది తోసి సం
బరమున హిందీ నేర్చు మనవారలు బాలురు రాజ్యకాంక్షఁ దొం
దరపడుటంతె కాక యది ధర్మమ? తత్త్వమ? యాంధ్ర జాతికిన్. ౬

ఉ॥ ఆయువు నెట్టొ నెట్ట ఘనమా? పశుపక్షిసరీసృపంబులున్
బాయవు నైజధర్మము శుభప దవైదికధర్మపద్ధతిన్
దో యుచుఁ గాయచింతనముతోఁ బరమార్థము నీడవీడు ట
న్యాయము సాధులార! కనరా! వినరా! పరరాజ్యవృత్తముల్. ౭

ఉ॥ ఓపిక లేనివారిఁ దమ కోపినయట్లులఁ జేయనిచ్చియే
చూపిరి ధర్మసూత ములు స్థూలము సూక్ష్మము రెండుఁ త్రోవలున్
బాపురె! నేఁడు తేపు మనవారలు శూరులు ధర్మరూపమున్
మాపఁగ దీక్షఁబూని రణుమాత ము జంకక పెద్దవారికిన్. ౮

ఉ॥ దేశము బాస వేసము విధించెను నన్నయ మున్ను నేటికే
బాసను వేస మూనెదరొ పల్కు వశంబొకొ! వీలువెంబడిన్
వేసము వేసినన్ మది "నివృత్తిని" మానని ధీరచిత్తు ల
గే సరు లాత్మబంధులు ధరిత్రి భరింతు స్వధర్మ మిక్కలిన్. ౯

ఉ॥ వైదికవేష మూనియును బాలుర కన్యము నేర్పి యర్థసం
పాదనసేయువారిఁ గని భాగ్యము పండె నటంచుఁ బొంగి యీ
మాదిరి చేసిపెట్టిరి సుమా మన ధర్మము పోయెఁ బోయె నన్
వాదము సేయువారె ప తివాదులు నవ్వఁగ నేమనం దగున్. ౧౦

మ॥ పరదృష్టిన్ స్వమతమ్మునున్ గనుట సంభావ్యమ్మె గా దందునన్
బరమార్థంబును గాన కెట్టెటులొ దుర్వ్యాఖ్యానముల్ సేయు లే
ఖరులం గాంచి విముగ్ధులౌ జనులు చుల్కంజూతు రాత్మీయులౌ
గురులన్ శిష్టుల మానసంబులకు సంక్షోభంబుఁ గల్పించుచున్. ౧౧

ఉ॥ మాటలె వేదశాస్త్రముల మార్గము పెంప భరింప వట్టి కా
మాటము లెన్నిగల్గవు కుమార్గములందుఁ ? బ మాణబుద్ధి నా
నాఁటికిఁ దగ్గ నొక్కఁడు గనంబడఁ డొక్కఁ డధీరుఁ డక్కటా
యేటికి నేటికయ్యె నెదురీదుట పిన్నలు పెద్ద లౌటచేన్. ౧౨

## 29. శ్రీ వావిలికొలను సుబ్బారావుగారి నిర్యాణము

ఉ॥ ధీరుఁడు; సత్కవిత్వగురుదీక్షితుఁ; డారయ గోలుకొండ వ్యా
పారి కులావతంసుఁడు; ప్రబంధకృదగ్రణి; శిష్టసమ్మతా
చారుఁడు; భక్తిశీలుఁడు; ప్రచార విచార పరాత్మధర్మ వి
స్తారుఁడు; వాసుదాసుఁడు; ప్రశస్తయశస్తనుఁడయ్యె నయ్యయో.

చ॥ పరమహితుండు, బాంధవుఁడు, భక్తవరుండు, మహానుభావుఁడున్
హరిభజనైక తత్పరుఁడు, నాంధ్ర మహాకవిశేఖరుండు, స
ద్గురుఁడు కళాధురంధరులకుం; బ్రతి యేరిఁక సుబ్బరాయధీ
వరునకు నాతఁ డాదికవి వార్తకుఁ జాలిన మూర్తియాఁగదా. ౨

చ॥ తలఁపును వాత వర్తనము తథ్యమొకంబుగ వాసుదాసుఁ డా
ర్యులు పొగడంగ నియ్యల మహోజ్వలుఁడై ఋషివర్తనుండునై
వెలిఁగె నటుండఁగావలదె విద్యలనేరిచి నేర్పి భూజనం
బుల కొక లక్ష్య మట్టులదివో కవివర్యుల కిచ్చు గణ్యతన్. 3

ఉ॥ ముమ్మరమైన తాపమున ముంచుచుఁ దేల్చు భవమ్ముతోన నో
యమ్మ పనే మిఁకన్ మనమునందు హరిన్ భజియింపుమమ్మ వెం
గమ్మనుబోలె యోగినివి గమ్మ లిఖింపఁగదమ్మ భక్తికా
వ్యమ్ముల నాంధ్ర మందుఁ గనకమ్మ యటంచనె మున్నునాడు బా
ల్యమ్మున వాసుదాసుఁడు మహాత్ముఁడు వాని నుతింపఁ జెల్లదే. ౪

చ॥ సముఁడయి వాసనాత్రయ విసర్జనముం బొనరించి మించి యు
త్తముఁడయి చెప్పఁజేతఁగాని ధర్మము నాశ మయోగ్యమున్ వహిం
చి ముదముతోఁ బ్రచారమును జేసి సమస్తము ధారపోసి ని
త్యమగుపదంబు వాసుకవితల్లజుఁ డొందెఁ దరించె సంసృతిన్. ౫

## 30. రవీంద్రు నస్తమయము
[ 7—8—41 ]

ఆంధ్ర మహాసభ స్త్రీశాఖ సభలోఁ జెప్పినవి

గీ॥ 'అలరవీంద్రుండు గనలేనియది కవీంద్రుఁ
డెఱుఁగఁజాలెడు' నంచు దేవేంద్రసుతుఁడు
భూసురేంద్రుండు, సత్కళాభాసురుండు
ఘనరవీంద్రకవీంద్రుండు గనని దేది? ౧

గీ॥ ఎలుఁగు మిన్నంటఁ బలుకు సురేంద్రనాథు
నెలమిఁ బాడంగ వినిరి రవీంద్రనాథు
వంగదేశీయు లవ్వారిభాగ్య మేమొ
విశ్వభారతి విఖ్యాతి వెలసినారు. ౨

గీ॥ భరతభారతి మానసాబ్జ మకరంద
పానపరవశులై యుండ భారతీయు
లెల్లకడలందుఁ జల్లె రవీంద్రగంధ
వాహుఁ డద్దానఁగల సౌరభంబు నెల్ల. ౩

గీ॥ రవి రవినిఁ జేరె ముక్తుఁడై రాహుబాధ
లేనివాఁ డీ రవీంద్రుండు వీని కస్త
మయము లేదెందుఁ బ్రాక్పశ్చిమముల సమత
వేయికరముల సతతము వెలయుచుండు. ౪

గీ॥ కోకిలంబొకొ! యితఁడు వాల్మీకి యగునొ
యెలుఁగు మధురంబు నాకృతి ఋషినిబోలు
సరససంగీతసాహిత్యసామరస్య
మితనియం దుంట వాణి రవీంద్రుఁడేమొ. ౫

చ॥ పలుకక యున్న నా మొగమె పర్వముఁజూడఁగ, మాటలాడినన్
బలుకు వెలంది పల్కినటు భావము రంజిలుఁ, బాటపాడినన్
దలిరులుబుట్టు మోడులకుఁ దాపసయోగ్యము నీ నికేతనం
బలవియె? నిన్ను నెన్నఁగ మహాకవిచంద్ర! రవీంద ! యేరికిన్. ౬

## 31. కా వ్య ప ర మా ర్థ ము

రాజా రంగయ్యప్పారావుగారి కళాశాలలో
7—11—39

గీ॥ పలుకు వెలఁదికి మొగము కావ్యంబటందు
రమృతలోచనము లగు వేదాంత మండు
ఋషులె యుత్తములైన కవీందు లండు
కవులె తారకులందు రిక్కలి నరులకు. ౧

గీ॥ ప్రభుని శాసనమటు వేదవాక్కులండు
మఱి పురాణము చెలికాని మాటలండు
సరసరీతుల గుణముల వరునిఁ దేల్చు
కాంత కైనవచ్చు నెందు సత్కావ్యమండు. ౨



## 32. శ్రీ మరాంబా మల్లేశ్వరపుస్తక భాండాగార ప్రశంస

(బెజవాడ, 3-9-1940

శా॥ భక్తి శ్రద్ధలు తగ్గె వేదములపైఁ బ్రామాణ్యముల్ తగ్గె నా
సక్తుల్ హెచ్చెఁ బరప బంధములపై శాస్త్రాలపై నెట్టులో
యుక్తుల్ పన్నుచు భక్తిగూర్చికొనుటే యుద్యోగమా నొక్కటన్
భుక్తిన్ ముక్తిని గూర్చుపద్ధతులపై మోదంబెటుల్ గల్గునో!

ఉ॥ హంగగు గ్రంథరాజముల నన్నిటిఁ బొత్తులుగాఁగ బీరువా
లం గరముంచి దాని నొక లైబ్రరియందురుగాని దానిలో
నం గలదేదో తేల్పఁగల నైపుణిగల్గిన వారి సంగతిన్
సంగతులన్ని బోధపడు నవ్యపురాతన రీతు లెంతయున్ ౨

మ॥ చదువంజాలిన వార లే కొలఁదియో సాహిత్యమున్ గల్గు వా
రు దయన్ దక్కినవారికిన్ దెలుప వారున్ విజ్ఞులై నిల్తు రా
పదలందున్ గడు ధైర్యమూని యదివో పాండిత్య మెట్లెట్టులో
చదువన్ వ్రాయనుగాదు పత్రికల హాస్యగ్రంథరాజంబులన్. 3

గీ॥ భావముల వెల్లడింపంగ భాషవుట్టె
దోషములులేక పల్క వైదుష్యమండ్రు
నియమములు లేక పల్కుట నేర్పుకాదు
శుద్ధమగు వాక్కు మనుజు విశుద్ధుఁజేయు. ౪

గీ॥ జాతిరతనాలు వెలుఁగొందు సానదీరి
కదను నేర్చిన గుఱ్ఱాలు ఖ్యాతిఁగాంచు
చదువులను నేర్చి మనుజులు, సాము నేర్చి
వీరులును, లోకమం దెంతొ వెలయుచుండ్రు. ౫

గీ॥ మెఱుఁగులకు నేమి కనుఁడయ్య మేల్మి యొరసి
చౌకచూడక మేలైన సరకుఁగొనుఁడు
నీటు చూడక జనులలో నీతిఁ గనుఁడు
అట్టలకు నేమి? కనుఁడు లో నర్థగరిమ. ౬

---

## 33. దోమా వేంకటస్వామిగుప్తకుఁ గవిరత్న బిరుద మొసగు నపుడు

శా॥ ధీరుం డొక్కఁడు జాజిలిం దెలిపి కీర్తిన్ గాంచినాఁ డత్తులా
ధారున్ మీరలెఱుంగరే యతనిపంథం బోయి యెంతెంత వ్యా
పారంబుల్ నడపించినన్ మది బరబ హ్మంబును న్నిల్పి సం
సారంబుం దరియింపవచ్చునని వైశ్యశ్రేష్ఠు లూహింపుఁడీ.

శా॥ కోమట్లందునఁ బేరుఁగాంచె నొకమాఘుం డందు రెన్నండొ? యీ
దోమా వేంకటసామిగుప్తకన యొందుం గందుమే? సద్గురుల్
చే మన్ జూడ వధానకౌశలముఁ బేర్మిం జూపి, పౌరాణికుం
డై మాన్యత్వము గాంచె నీతఁడగు వైశ్యశ్రేష్ఠుఁ డీనాఁటికిన్.

మ॥ కులధర్మంబును నిర్వహింపుఁడని మీకుం జెప్పఁగానేల? యి
క్కలిలో వేదము, శాస్త్రముల్ గళల సాఁకల్ మీరుగాకెవ్వరేఁ
గలరే! పండితులన్ గవీశ్వరుల సత్కారమ్ముఁ గావించి శ్రీ
లలనాలాలితులైన పుణ్యమును నిల్పం బెట్టుఁడీ శ్రేష్ఠులై.

## 34. వైద్యరాజ దంటు సుబ్బావధానిగారి పండితరాయ బిరుద ప్రశంస

( 10—11—1940 )

క॥ ఎటుచూచిన నటుపోవుచు
నిటునటు చూడకయె తెచ్చిరింతకు దేశం
బిటుపైన నెటుల సేమము
ఘటింపఁజేయుటయొ యనుట కలదె యొకనికిన్. ౧

క॥ మెడలుపడ నడుఁగులెత్తుక
పడిపడి చూచితివికాదె పడమటికై నీ
యొడిలోన నేమిపడెనో
కొడుకా యను భరతమాతకుయి వినఁబడదా. ౨

క॥ ముక్కులు మూసుక యుక్కిరి
బిక్కిరియై కనులఁ జెవులఁ బిడుగులు పడఁగా
బొక్కల దూరుట మేలే
ముక్కంటిం గెలువ ముక్కుమూయఁ డొకండున్. ౩

క॥ నలుగురు పదుగురు వేవురు
తెలిసియొ తెలియకయొ పోవు తెఱఁగునఁ బోవన్
సులు వేటికి నెదురీదం
గల ధీరతగల్గు నీశుకరుణ నొకనికిన్. ౪

క॥ విద్యల విత్తముసేయక
విద్యల విత్తనముసేయు వెతచే సతమున్
విద్యావంతులఁ గూర్చుచు
నుద్యోగము సేయు టెంత యొప్పున్ గలిలోన్. ౫

క॥ తనవారని, తానని, నె
మ్మనమునఁ దలఁపకయె మాయమర్మమెఱుఁగ కొ
క్కని లెక్కసేయకే దే
వునిగా దేశికుని గొల్చు బుద్ధి యలఁతియే. ౬

క॥ ఈశుండని, ధర్మంబని,
దేశంబని, శాస్త్రమంచు దేశికుఁడం చా
వేశంబున లేశంబే
యాశయు లేకుండ మెలఁగు టది యెవ్వనికౌ౯.  ౪

క॥ అవధానులు కవిధీరుం
డవు ఘనవైద్యుండు సాధు వంతర్ముఖుఁడు౯
నవపండితరాయుండు౯
భువి సకలులపాలికల్పభూజం బగుత౯.  ౫

---

35. దేశోద్ధారక విశ్వదాత కా॥ నాగేశ్వరరాయుని
ఆ యు రా రో గ్య ప్రి శం స
20—2—37

శ శి క ళా ప ద్య మా ల

శా॥ కాశీనాధునివారు శైవులును భక్తశ్రేష్ఠులు౯ గారె ? నా
గేశా ! విశ్వపదంబు నీకు నిడె నెంతేఁ బ్రీతి విశ్వేశ్వరుం;
డీశుండై లివి సర్వతంత ములలో నీవి౯ భువి౯ నీవకా ?
దేశోద్ధారకుఁడంచు మించితివి కీర్తి౯; నీకు దీర్ఘాయువౌ.  ౧

చ॥ అలయక విశ్వదాత వయి; యన్వహము౯ సకలోపకారకం
బుల నొనరించుచు౯; నిముసము౯ వృథగాఁ జననీవు; నీకునెం
జలియును వేఁకియు౯ గలుగఁజేయఁగనౌనె విధాత ? యాపతం
జలియును హాయి నీ కిడగఁ జల్పఁడె పార్థన వేయిమోములకొ ?  ౨

చ॥ తమ యవివేకముం దెలిసి; తామె నిలింపులు నీకు హాయి వే
గమ సమకూర్చినా; రుపమగల్గునె యొండ్లకు నీకు ? నీదు చి
త్తము పలుకుల్ కి యల్ శివపదంబుల కర్పణమౌట; నీసమీ
పమునకు రాఁగ జంకు సమవర్తియుఁ గాలగళైకభూషణా !  3

మ॥ నమకమ్ముల్ జమకమ్ముఁ జెప్పుచు మహాన్యాసంబుతో రుదు నిర్
విమలంబైన స్వరమ్ముతో ద్విజులు సంప్రీతిన్ భజింపంగ; నీ
దుమదిం బుట్టు మహాప మోద మని వింద్రుల్; శైవుఁడై పుట్టి; ధ
ర్మము నిక్కాలమునందు నెవ్వఁ డిటు నిర్వర్తించు? నాగేశ్వరా! ౪

ఉ॥ ఆపదలం దహీశ! మనమందున నెయ్యది నిల్పు నద్దియే
లోపలిస్థాయి యందు కవులున్, నిను మెచ్చఁగఁ గాలకాలుఁడే
నీవయిఁ బ్రీతితో నిలిచి నిల్పె నినున్ భువి సాధురక్షకై
శ్రీపుల భూపుల న్నడువఁజెల్లునె సాటికి నీకు మాటికిన్. ౫

శా॥ మీమాంత ంబును ధర్మమార్గములఁ బే మింపంగ లేనట్టి వా
రే మర్యాదల నొల్ల కెట్టితఱి నొక్కింతేని శంకింప శా
గాముల్ చూడక సిద్ధపద్ధతులఁ జీకాకౌనటుల్ చేయుచుం
డ్రేమందున్? మఱివేఱు మందుగలదే యీ మందులన్ దిద్దఁగన్. ౬

మ॥ చదువుల్ సంధ్యలు పోయె, వేదములునున్ శాస్త్రమ్ములున్ బోయె నా
పదలందున్ ముదిమిన్ స్వధర్మమున సద్భావంబుఁ బుట్టంగ వాఁ
డెదియున్ జేయఁగలేక చింతిలుఁ గదా యెంతేని స్వాంతమ్మునం
దదియున్ స్వానుభవైకగోచరము గాదా నేఁడు? నాగేశ్వరా! ౭

మ॥ కులమున్ గోత్ర ము శౌచమున్ దయయుఁ దక్కంగల్గు సద్ధర్మముల్
గలుగన్ భారతజాతికిన్ గలుగు నిక్కంబైన జీవం బహో!
విలయంబున్ మఱివానికే బలిమిఁ గావింపంగ, జీవింప జీ
వులు లేవే యెటులెట్లు పొట్టకొరకై పుట్టంగఁ బోవన్ భువిన్. ౮

ఉ॥ ఎందఱ నెందఱం గన మహీనుల మానుల? నేమియైరి వా
రందఱు? శాంతిలేకయకదా జగమందుఁ బ వృత్తిమాని? రా
చందము ధీరచిత్తులగు సాధుల కెన్నఁడు రాదు సద్గురూ
క్తిం దెలివొంది కాంతు కృతకృత్యత సాంబునిభృత్యభృత్యులై.

ఉ॥ దేశము, భాషయున్, బ్రజయు, దేవుఁడు దేశికుఁడంచు లేక; యా
వేశముతోడ నేఁడు పదవీగ్రహణంబున కెంద ఱెంద రా

భాసపు దేశభక్తినిఁ బ్రభం గనుచుండరు నీ వెఱుంగ? నా
గేశ! బుధుండు తెడ్డు నొక యించుక నాకి; వ్రతంబు వీడునే? ౧౦

చ॥ ఒక పదియేండ్లు చన్న గుఱు తుండదు, భారతజాతి కీ ధరన్
సకలము నేకమా నకట సంద్రమునందు మునింగినట్టు నా
యకు లిది గాంచలేక వ్యవహారమె పట్టుచుఁ, గోఁతిపట్టుగా
నొకటొక టే మునుంగఁ గనుచుందురు ముం దెఱుఁగంగ నేరమిన్. ౧౧

ఉ॥ ఈ వొకరుండ! వొక్కరుఁడవే! సుమి! నేఁటికి నాంధ్రభూమిలో
భావము విప్పిచెప్పఁదగువాఁడవు తక్కిన నాయకోత్తముల్
పోవు పథంబు నే నెఱుఁగ! లోపముఁ బాపి; భవాబ్ధి దాఁటఁగా
నావగ నుండఁగాఁ దగు ఘనంబగు విద్యలఁ బ్రోవు మాస్థతో ౧౨

శా॥ నీతోఁగాక మఱేరితో ననఁదగున్? నీ కన్న మాకున్న ప్ర
ఖ్యాతుం డెవ్వఁడు నేత? నిక్కముగ వక్కాణింతు నాగేశ్వరా!
జాతిప్రీతి, స్వవేషభాషలను విశ్వాసంబు, చౌపష్టివి
ద్యాతంత్రంబులరక్తి, భక్తి పరతత్త్వంబందు నాంధ్రత్వమా. ౧౩

ఉ॥ పెద్దల బోధముల్ పెడచెవిం బడుచుండును బిల్లకాయ; కా
పద్దశలందు నయ్యదియెపట్టు భవాంబుధి తేలియాడఁగాఁ
దద్దయు మించినప్పుడు వృథాయగునంచుఁ; బ్రబుద్ధు లెప్పుడున్
బుద్ధులు చెప్పుచుందురు, ముముక్షుల కాపదఁబాప నోపికన్. ౧౪

ఉ॥ ఆయువు దీర్ఘమై! భగవదాజ్ఞను నీవు బలంబుఁ దేజమున్
శ్రీయును దాల్చి; చిత్తమున శ్రీ పరమేశ్వరుఁ బాదుకొల్పి నీ
కాయముతో స్వధర్మమునకై యెది యెయ్యది చేయవచ్చునో;
చేయు మవన్నియున్ యశముఁ జెందు మనన్యవిధాన మూనుచున్.

ఉ॥ దేశమునందు నెవ్వరి మదిన్ నిను నెట్టులఁ జూచిరేని నా
గేశకలాపసేవకుఁడ వీవని భావనసేయుదాన నా
గేశ! గతుల్ స్థితుల్ కలి నవెట్టుల మాఱినఁ; గొండగుర్తులన్
లేశము దారితప్పక చలింపక ధీరుఁడు చేరుఁ బారమున్. ౧౬

---

# 36. రాధాకృష్ణ పండితునకు

## హంసవిజయముఁ బంపునపుడు రచించినవి

19—11—34

క॥ మేధావికి నాంధ్ర జగ
ద్బోధాచార్యునకుఁ బూర్వపుణ్యోదయసం
సాధిత సద్యోగునకున్
రాధాకృష్ణార్యునకు వినతి నిటు వినుతున్ ౧

మ॥ సకలోర్విం జరియించి వేత్తల ప్రశంసల్ గాంచి యాధ్యాత్మవి
ద్యకు వ్యాఖ్యాతవనం బ్రసిద్ధిఁ గని హృద్యంబైన వాగ్ధోరణిన్
సకలస్వాంతము లుల్లసిల్లఁగ నుపన్యాసంబుఁ గావించు వ్య
క్తికి నీ కెవ్వరు సాటి? హంసవిజయోక్తిన్ వే విమర్శింపఁగన్ ౨

ఉ॥ కూలికి వ్రాయలే దొరులకోసము లేశము నాసఁజేసి భూ
పాలుర వేఁడలే దిఁక శబాసనిపించుకొనంగఁ గాదు క
య్యాలకుఁగాదు హంసవిజయమ్మును నేఁ బ్రకటింతు దేశదే
శాలకుఁ గర్మభూమిఁగల సద్గురుబోధము జ్ఞానసౌధమున్. 3

క॥ తెలివిఁగలవాఁడ వొరులం
దెలియంగలవాఁడ వెల్ల ధీమంతులకున్
దెలుపఁగలవాఁడ వనుచుఁ
దొలిపలుకును వ్రాయఁగోరుదును నిను ననఘా ౪

చ॥ గురుమథనంబునంబడి యకుంఠితభక్త్యనిలప్రధూతమై
గురుతరమైన తేజమునఁ గూర్చిన నాటకదీపమున్ భవ
త్కరమున నెత్తిచూపుమని కాంక్షయొనర్చెద లోకమంత కీ
వురుతరవిక్రమంబున మహోన్నతవీథిఁ జరించుచుండుటన్ ౫

## 37. రాధాకృష్ణయ్యగారి హంసవిజయాభిప్రాయముపై

22—3—35

గీ॥ హంసవిజయంబుఁ జదివి నీ వంపినట్టి
యాంగ్లపత్రిక భక్తితో నందికొంటిఁ
దలఁపఁ బైమూఁతలే గాక తాత్త్వికులకు
భాష లోకయాఁకయే లోని భావ మరయ ౧

ఉ॥ తప్పదు నీకు హంసజయతత్త్వము లోకమునందుఁ జాటఁగాఁ ?
దప్పుకొనంగఁ జూడకుము ధర్మముగాదది యాంధ్రదేశమం
దొప్పుగనున్న సద్గురులసూక్తులనాణెము, లోకమంతకున్
గుప్పఁగ నాంగ్లభాష సరికూర్చెద నీ కయి! తత్త్వకోవిదా! ౨

ఉ॥ వంగరవీంద్రనాథుని ప్రబంధమునందలి తత్త్వమెల్ల; నీ
కుం గనవచ్చె; నిచ్చలును క్షోణితలంబునఁ దత్త్వగోష్ఠులం
దుం గడుమన్ననల్ గను బుధుండవు; నీ దగు మాతృభాషలో
నం గల మత్ప్రబంధములనాణెముఁ దేల్చుట నీ కనష్టమే? 3

శా॥ మోమోటంబున కిచ్చు పత్రికలు సమ్మోదంబునుం గూర్పఁ; వాఁ
గాముల్ దెల్పఁగలట్టి పెద్దలు పరీక్షల్ సల్పి; యేమన్ననున్
నేమంబొఁ గృతికర్తకున్ గృతికి; నీ చిత్తంబు దుష్కాలమం
దీమాత్రంబగు ధర్మదీక్ష దగదే యిప్పట్లు మీ బోంట్లకున్. ౪

---

## 38. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యా పీఠపక్షమున శ్రీయుత సర్ రాధాకృష్ణ పండితులకుఁ గవితిలక కుటీరమున

## సమ్మానము

14—1—36

క॥ సర్వేపల్లికులంబున, సర్వారాధ్యుండు పుట్టె సకలజనులకున్!
పూర్వాపరఖండంబుల, నిర్వాణము బోధసేయు నేర్పరి; కలిలోన్.

మ॥ తమలోఁ గల్గిన పెద్దవారలకుఁ బా ధాన్యంబుఁ గల్పించి; లో
కము నెల్లం బ కటించుచుండ్రు గద పెక్కండ్రక్కటా! యాంధ్రదే

శమునం దన్యుల గొప్పఁజేయుటయె నిచ్చల్ గాంతు మీా భావదా
స్యమునున్ వీడి, తెనుంగు లన్నిఁటను బ్రాశస్త్యమ్ము నొందందగున్.

ఉ॥ తేరది యాంధ్రవిశ్వకళ; ధీరుఁడు కృష్ణబుధేంద్రుఁ డారయన్
సారథి; రెండుపక్షము లనందగుఁ బూర్వముఁ బశ్చిమంబునున్
భారతుఁడో, గిరీటి యరివర్గము జ్ఞానఖరాసిచేత సం
హారముఁజేయఁగాఁ దగు మహార్థముఁ బల్కెడు నూత్నగీతలన్. 3

ఉ॥ ఆంతరతత్త్వమిచ్చటి మహాత్ములు నిశ్చయముం బొనర్పు; ఖం
డాంతరపండితాళిపయి నాస లవేల? మనోగతాజ్ఞతా
ధ్వాంతముఁ బాప సద్గురుపథంబు వెలుంగఁ; దిలింగదేశమం
దెంతయు భ్రాంతి నిట్టు నటులేల చరింపఁ? ద్యజింప స్వీయులన్. ౪

ఉ॥ అంతటిదానఁ గాను జగ మంత యెఱింగిన మీాకుఁ దెల్ప శ్రీ
మంతులు, బ్రహ్మవిద్యఁగల మాన్యులు, ధన్యులు, మీారలో పర
స్వాంత మెఱుంగనేర్తురు శుభస్థితి భక్తుల కీయఁగల్గు వే
దాంతముఁ దాల్చుపీఠ మిది ధర్మమునం దగఁ బ్రోదిసేయుఁడీ. ౫

---

## 39. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ సందేశము

### తత్త్వాచార్యులుగా "ఆక్సుఫర్డ్"నకుఁ బోవునపుడు

క॥ బోధింపఁగఁ దత్త్వము నం
భోధులు దరియించి; సీమఁ బోయెడి నీకో
రాధాకృష్ణాచార్యా !
మాధవుని యనుగ్రహమున మంగళము లగున్. ౧

శా॥ నీ వేతెంచు పథంబునందు శుభమా! నీవారికిన్ క్షేమమా!
నీవిద్యార్థుల కెల్ల భద్ర మగు సందేహంబులం బాపి స
ద్భావంబుం గలిగింపు విజ్ఞులకు నా పాశ్చాత్యదేశంబులన్
శ్రీవాణీకరుణాకటాక్షమున వాసిం గాంచు నీబోధముల్. ౨

శా॥ "వాచారంభణమాత్ర మే యగును ద్వైత్వం"బన్న లోకోక్తి మా
పా చీదేశమునందుఁ జెల్లదు; మహాత్త్వం బంది భక్తాళి య
వ్వాచాతీతుని జీవరూప పరమబ్రహ్మంబు నిక్కంబుగా
నాచార్యోక్తిని నిల్చి చూతురని; యన్నా! చాటుమా యెల్లెడన్.

శా॥ ఏదీ తేలక; యర్థకామముల నెంతే మున్గుచున్ దేలుచున్;
మోదంబందఁగ లేని దేశములకున్ మోక్షప దంబైన స
ద్వేదాంతంబును దెల్పఁబోదువఁట! నీ విజ్ఞాన మేమందు? సం
పాదింపంగదె; యాంధ్ర భారతికి విశ్వశ్లాఘ్య మాహాత్మ్యమున్. ౪

శా॥ నీ కుద్యోగము పెద్దదైన దనుచున్ నీవారిసంతోష మే
మో! కానీ! సకలాంధ్ర లోకమున కోహో! కల్గు సమ్మోదమా
నాకంబంటఁగ బెత్తెడే యెడమునుమ్మా! యిట్టి నీవారికిన్
లోకఖ్యాతిగ నాంధ్రుఁ డీవని యటన్ ఘోషింపుమా! గోష్ఠులన్.

ఉ॥ మోడయినిల్చె భూరుహము మూలములం దినుచుండెఁ గీటముల్
చీడలుపట్టె శాఖలకుఁ జిక్కులకే కలవయ్యెఁ గోతులున్
బాడొనరించుఁ బిందెలఁ బ్రిభంజనుఁ డూచెడుఁ గాండ మింతకున్
వాడని పూలవాసనల వాడలవాడలఁ బర్వఁజేయుమా! ౬

ఉ॥ ఆదర మింతలేక విపదంబుధి మున్గుచుఁ దేలుచున్న యీ
వేదములం దదంగముల వేత్తల సాధుల సత్కవీశులన్
నీదు హృదంతరాళమున నిల్పుము వారు భవన్ముఖంబునన్
గాదె? ప్రసిద్ధి కెక్కెదరు కంటికిఁ గానఁగరానిసీమలన్. ౭

చ॥ అవసరమందు నాంగ్లమున నందఱకుం దెలియంగఁ జెప్పినన్;
బ్ర విమల సంస్కృతంబును స్వభాషను వీడకుమయ్య! నీకు నీ
వివిధసపర్యలన్ జలుపువీరలు నీదగు పాతినిధ్యమున్
స్వవిషయకీర్తిగాఁ దలఁచి; సంతసమందుచు నున్నవారహో! ౮

ఉ॥ జంకఁబనేమి? జన్మమున సద్గురుమిత దయార్ద్రదృష్టులన్
బంకముఁ బాసి; హంసల సమాగమముం గని; తీర్థవాసమున్

గొంకకసల్పి; యెత్తటిని గు ంకక; పైఁబయిఁ దేలియాడుచుఁ;
బంకజమట్టు లుండఁ గలపాజ్ఞలు పాచ్యు లటంచుఁ జాటుమా!౯

సీ॥ ఆవేశమేగాని యధికార ముండదు
పాలినిధ్యముఁ బూనువారి కొకట;
నధికార ముండిన నవకాశమది కల్ల
దెంతటి వేత్తలకేని నొకట!
నవకాశముండిన నది యదృష్టములేమి
ధీరులకైనను బేరు రాదు
ఇన్నిగల్గిన యేని నున్నచోటనెగాని
వ్యాపింపలేరు ప్రపంచ మెల్ల

గీ॥ సకలసద్గుణములు నీకు సంక్రమించె
సత్కవీశుల దీవనల్ సఫలములుగ
సాధు బుధజనసేవచే శాశ్వతముగఁ
బోయి రావయ్య! జయమొంది బుధవరేణ్య! ౧౦

---

## 40. శ్రీ రాధాకృష్ణ బుధేంద్రుని పుత్రిక

### శకుంతలా పరిణయ సందర్భమున

4—5—1936

క॥ నూతనము నీదు సౌధము
నూతన ముద్యోగలబ్ధి నూతనశుభ మీ
కూఁతురు పెండ్లియు సౌఖ్య
వాప్తంబగు నూతనముగ రాధాకృష్ణా! ౧

చ॥ మనమున సంశయించె బుధమండన కణ్వుఁ డహా! గృహస్థులే
యనువున నిల్తురో? సుతల నల్లురయిండ్లకు నూతనంబుగా
ననిపెడువేళ నంచుఁ దనయాకృతి నీవుగ నీ శకుంతలా
వనితయుఁ బుట్టె సాధుగృహవర్తన నర్తన సల్పఁ బోలెడిన్. ౨

శా॥ నీ కేమున్నది కీ_ర్తికాక జగతిన్? ధీవర్య! యర్ధాంగియై
నీకున్ సర్వముఁ గూర్చు నీ గృహమునన్ నిత్యోత్సవం బబ్బఁగా
సాఁకున్ నీదగు బంధుసంతతిని నీ సంతానమున్ సౌఖ్యమున్
శ్రీ కామేశ్వరి నీ యదృష్టము! పురంధ్రీ రత్నమా నారయన్.    ౩

మ॥ ఎలమిన్ యోగి ధనుర్ధరుండు నగుచుఁ గృష్ణార్జునుల్ భిన్నులై
రలనాఁ డిర్వురు నేఁటి కొక్కఁడయి నీ యాకారమున్ దాల్చి యి
ట్టులఁ బెండ్లిండ్లని పేరఁటంబు లని యూఢిన్ గేహమందుండి చూ
పుల శు భ్యంతమునందు నిల్పెదరు నీ పుణ్యంబు రాధాపతీ!    ౪

ఉ॥ ఆంధ్రు ల కాంధ్రపండితుల కాంధ్ర కవీశుల కాంధ్ర వాణి కి
య్యాంధ్రు లసచ్చరిత మున కాంధ్రు లవ్య_క్తి కి నాంధ్ర శ క్తి కి
యాంధ్రు లత త్త్వసంపదకు నాంధ్రు ల కీ జగమందు నెందు నీ
రంధ్ర యశంబుఁ దెత్తు వని వా యుట కా కిటు మాటి కేటికిన్?    ౫

---

## 41. జయపురాధీశ్వర విక్రమదేవవర్మ ప భునకు హంస విజయము పంపునట్టిసందర్భము

క॥ అవధారు! జయపురీశ్వర!
భవదాస్థానంబు దుర్లభంబగు రాధా
ధవనామబుధవరేణ్యుని
యవిరళకృప నీకు వినుతు హంసవిజయమున్.    ౧

క॥ మముఁబోటి కవుల గొడవలు
మమతఁ వినునట్టిరాజు మహిఁ గలఁడే? వి
క్రమదేవ కవిసుధాంశుని
నుమ జయపురి నిల్పె బుధులయుల్లము లలరఁ.    ౨

క॥ ఋషివ_ర్తనులకు సచ్చే
ముషి గలవారలకు, భక్తపుంగవులకు స
ద్విషయమును హంసనాటక
ఘోషమునఁ బల్కితిని హరిని మెప్పింప; నృపా!    ౩

క॥ రాధాకృష్ణాచార్యుఁడు
మేధావియుఁ దత్త్వఘనుఁ డమేయపదవిక్రీ
సాధనమగు నానాటక
బోధము విని; మదినిఁ బొంగి; పూర్ణప్రీతిన్. ౪

చ॥ తొలిపలుకేను వాయుటొక దొడ్డది గాదిఁక, భారతావనిన్
గల నృపకోటి కెల్లను శిఖామణి ; శ్రీజయపూరు నాయకుం;
డలఘు కవిత్వతత్త్వనిధి; యాతఁడు విక్రమదేవవర్మ ని
స్తుల భవదీయ సత్కృతికి శోభను గూర్చునటంచుఁ దెల్పఁగన్. ౫

క॥ తెంపున నా నాటకమున్
బంపితిఁ ద్వత్సభను జదువఁ బండితరాజా
లింపంగ నుత్సహించుట
కింపై యుండుటయ కాదె ? కృతికి ఫలంబా ! ౬

మ॥ గురుపుత్రుండు,సతీర్థ్యుఁడున్,హితుఁడు,నాకున్ మాన్యుఁడున్,భారతీ
వరివస్యాకుశలుండు, రాజసభలన్ భవ్యుండు దంట్వాన్వయా
భరణుం డీ యవధాని మత్కృతిని భూపా ! నీ సభన్ విన్పుఁ దాఁ
బరమోత్సాహముతోడఁ బాడుచు, మహాప్రౌఢుల్ ప్రహర్షింపఁగన్.

క॥ ఆ కుశలవులన్ మున్ వా
ల్మీకులకై పోలె; లీల మేదిని సభలన్
నాకృతుల భక్తిఁ బాడన్;
శ్రీకృష్ణగురుండు సేసె శ్రీ యవధానిన్. ౮

గీ॥ కవనములకేమి ? యెన్నైనఁ గట్టవచ్చుఁ
బరమపురుషునిపై భక్తిఁ బబలఁజేయు
పాత్రములు వాయుటది పూర్వపుణ్యఫలము !
కమ సద్గుణజాల ! విక్రమనృపాల ౯

చ॥ కవులన బ్రహ్మముం దెలియఁగల్గిన వేత్తలు! బ్రహ్మవిద్యకున్
దెవులు ఘటిల్లుకాలమున ధీరతఁ దత్త్వముఁ జాటునట్టి స
త్కవితల కేమిసేయ నధికంబగు, సత్కవిరాజవైన నీ
కెవరు వచింప నేమి కల ధేలిఁక పాలనసేయు ధర్మమున్. ౧౦

## 42. వి క మే ళ తా రా వ ళి

క॥ యుక్తమె విక మదేవుని
సూక్తుల వక్తవ్య మనుట; సుకృతులలోనన్
యుక్త మయుక్తం బెఱిఁగెడు
శక్తిఁకిఁ దత్కవినృపాలుసాటిఁ గలుగమిన్. ౧

క॥ భవదీయాస్థానంబునఁ
గవిభూషణుఁ డైన సెట్టికవిసింహాకృత
స్తవ మెఱిఁగి; యలరితిన్ వా
స్తవముగ్ సత్కవులు దెలియఁజాలుదు రనఘా!

ఉ. హంసజయమ్మునంగల మహత్తరతత్త్వము గుర్తెఱింగి వి
ద్వాంసులకున్ ముదంబొదవు వైఖరి వ్యాసమునున్ లిఖించి సా
రాంశముఁ దేల్చె నీ జయపురాధిపుఁ డద్దిర! యార్యధర్మ వి
ధ్వంసము గల్గుకాలమున దక్కెను దిక్కన సాధుపాళికిన్. ౩

శా. వాణిజ్యంబ యగున్ గవిత్వమును జేర్పన్ రాణివాసంబులన్
వాణీదత్తము మత్కవిత్వ మది భూపా! తత్త్వమున్ దెల్పుటన్
రాణించెన్ నర కాంతవృానుగద! యీ రాజ్యంబు నద్దాన గీ
ర్వాణప ఖ్యుల జ్ఞానబీజధరులన్ బహ్మణ్యులన్ బో వుమా. ౪

క॥ శుకనాసోపన్యాస
ప్రకటితగర్భైశ్వరత్వాభంగు లకట! నేఁ
టికిక్తైందుఁ గాననో ?, ధా
ర్మికకులం బోషించు ఱేఁడు పృథివిం గలఁడే ? ౫

ఉ॥ ఎక్కడనుంటి ? వేమి గతి ? యెచ్చటఁ దింటి ? వదెట్లు వచ్చి తీ
విక్కడ? కెట్లు వ్రాసితివి? యింతటిగ్రంథము చిక్కలేదు; నీ
యక్కఱ లన్ని దీఱు నిఁక నంచుఁ గవీశుల నాదరించు ఱేం
డ్రెక్కడ నుందురో! జయపురీశ్వర! దేవుఁ డెఱుంగు నిక్కలిన్. ౬

చ. కవనము నేర్చి పద్దెములుగట్టి నృపాలుర బట్టులట్లు సం
స్తవములుచేసి జీవనము సల్పెడు వారల కేమొ? కాని వా
స్తవమగు శక్తిగల్గి పరతత్త్వము సద్గురు లొద్దనేర్చు సా
ధువులగు వారికిన్ స్థితిగతుల్ కనిపెట్టెడి ధీరుఁ డెవ్వఁడో! ౭

ఉ. భారతధర్మబీజముల భక్తులకై పరిరక్షసేయు న
వ్వారలు ధీరు లవ్విబుధవర్యుల నార్యులఁ బో చుచుండు నా
భూరమణుండు ధీరుఁడు ప బోధ మొసంగఁగఁజాలు కావ్యముల్
తారకమూర్తిపై నుడువు ధన్యులు ధీరులు విక మాధిపా! ౮

ఉ. సూరులు తొల్లి సత్యమును జూడఁగఁ గల్గిరి రాజులోకి యా
శూరులు ధర్మవీరు లగుచున్ భరియించిరి సాధుపాళి వా
క్సూరులు నేఁడు పత్రికలఁ జూపుచు నుండఁగ విద్దె; లాస్థతో
ధీరులు సద్గురూక్తవరదీక్షుల రక్షయొనర్తు జ్ఞానముల్. ౯

ఉ॥ అన్నిటి మించినట్టి పురుషార్థము మోక్షము దానికన్న నె
న్నెన్నియొ విఘ్నముల్ గలుగు; నెవ్వఁడో నేర్చును గోటి కొక్కఁడ
న్నన్న! ఫలం బతండె! జగమంతకు నాతఁడు వృద్ధిపొందఁగాఁ
డెన్న ఘటించుతేని కిల దీటగు నెవ్వఁడు? విక్రమేశ్వరా! ౧౦

ఉ॥ ఒక్కొకవిద్య కొక్కొకని, నూపిరితోడుత నిల్పరాదొకో!
యొక్క నరేశ్వరుండయిన నోపికతో సకలాంధ్రభూమికిన్
దక్కిటి వొక్కఁడీ వెటులు ధర్మము నిల్పెదొ! విక్రమేశ్వరా!
దిక్కటి రూపుమాసినవి దేశపువిద్యలు పట్టు వీడుటన్. ౧౧

చ॥ పదిపదియేండ్ల కొక్కతటిఁ, బండితులన్ గణియింప; నక్కటా!
హృదయము వ్రీలు వృక్షములకేఁ గల దొక్కట లెక్క నేఁడు; ప్రాఁ
జదువుల వారు పుట్టినను, జచ్చిన నెంచెడువాఁ డెవండు? పె
ల్లొదవె విపత్తు విద్యలకు నో పృథివీశ్వర! యెట్లు మాన్పెదో! ౧౨

చ॥ అవసరమందు దత్తమగునట్టిది, దానమటండ్రు కుంభినీ
ధవ! పదిలక్షలిచ్చిన వృథాగద! తొల్లిటిబ్రహ్మవిద్య సా

ధువులకు నీయఁగల్గు విబుధుల్, నిలువందగు నీడనీని వె
ట్టివియును సంస్థ లెన్నికల డిగ్గుపడుఁ బరమార్థగోష్ఠిలోఁ. ౧౩

ఉ॥ చేసెడు బుద్ధియుండియును, జేయఁగఁజాలమి; బుద్ధిమంతు లా
యాసము నొందుచుందు రెపు డా తరుణం బని చూచుచుంద్రు నీ
కీసిరి వచ్చి పైఁబడుట యెంతయు మేల్గద ! దీప ముండ నా
వాసముఁ జక్కఁబెట్టుము నృపా ! తటిమించినఁ జేయవచ్చునే. ౧౪

చ॥ కవనము సత్యమున్ దెలుపఁగల్గునె ? సత్యము సత్యవంతుఁడే
భువి నెఱుఁగుఁ గురూత్తముల్ నోల నహంకరణమ్ము మాని ని
ష్కవమగు వర్తనంబుఁగను కోవిదుఁ డీశ్వరతత్త్వమెల్ల వా
స్తవముగఁ గాంచు బ్రహ్మమయి తాఁ గనఁగల్గునుగాదె బ్రహ్మమున్.

చ॥ పలుకఁగ నేర్చు సత్కవికి బత్తెముపుట్టనినాఁడు చాటుగాఁ
బలుకక సత్యమున్ దరుచు భక్తుల కెవ్వఁడు భుక్తిఁబెట్టు రా
జులు గనుఁగొందురే యెదుటఁ జూచియుఁ గాననివారు దేవుఁ డ
వ్విలయముఁ బాప నిన్నుఁ బృథివీపతిఁ జేసెను వికమాధిపా! ౧౬

ఉ॥ ఏనుఁగు లమ్మి కార్లపయి నెక్కెడు కక్కుఱితిన్ జరించు భూ
జానులు సత్కవీశ్వరుల సాఁకఁగ నేర్తురె సర్వవిద్యలన్
దాను భరింపఁడేని నిలఁ దా నొక రాజుగ నుండనేల ? సం
స్థాన మదేల ? వాని కొకస్థాన మదేల ? మదించి మించఁగన్. ౧౭

ఉ॥ బొమ్మలఁ జేసి యెవ్వ రెటు మోసుకపోయిన నట్లపోవుద
ద్దమ్ములు పార్శ్వవర్తులకు దాసులు; రాజులు; వారికేల త
త్త్వమ్ములు ధర్మముల్ గుసుపదమ్ములు నేనుఁగుపై జవాది సం
ద్రమ్మున వృష్టియున్ మరుపదమ్మునఁ బెట్టిన శాలిబీజముల్. ౧౮

ఉ॥ మంచిది మంచిదిద్ది; కడు మంచిది; మంచిది యంచు మాటలన్
ముంచినఁ బ్రాణపంచకము పోవదె ? పోషకయున్న నద్దికా
మంచియు ! కాదయేని గడమంచియు ! వంచన మేల ? యేమి కా
వించిన బ్రహ్మవిద్య కిలబజము నిల్చునో; చూడు ! భూవరా ! ౧౯

ఉ॥ ఇచ్చకమేల రాజుల ? కొకింత కవీశుల కుండుఁగాక ! నీ
మెచ్చుటయే నిజంబయిన; మేకొనకుండువె ? హంసనాటకం
బచ్చుపడంగఁదెల్పు పరమార్థము నర్థము పా ణముస్ వెసస్
బొచ్చెములేక; సాధువులఁ బ్రోవను; గావను; దేవె ? భూవరా !

ఉ॥ తక్కువలేక సద్గురుఁడు తత్త్వముఁ దెల్పెను నాకు; భుక్తికిన్
దక్కువలేదు గౌరవము తక్కువలేదు: సభాంతరమ్ములన్
మక్కువ మీఱ సత్కృతుల మన్ననఁ జేసిరి సత్కవీంద్రులో
ధిక్కృతవైరి ! వికమసుధీనృపమౌళి ! పరాంబ సత్కృపన్. ౨౧

ఉ॥ అచ్చునఁగూర్ప గ్రంథముల నచ్చట నిచ్చటఁ ద్రిప్పకుండఁగా;
లచ్చికృపన్ ఘటిల్లె నవిలంబముగా నిఁక నొచ్చె మేమి ? నీ
మెచ్చుట చాలదే ? కృతి కమేయఫలం బది పైనఁ బెచ్చుఁగా
న చ్చుతురాన్యుఁడో జయపురాధిప ! యేమని నిర్ణయించెనో !

గీ॥ దీక్ష సద్గురులొద్ద నధీతి యయ్యె;
నర్థులకు బోధమొనరింతు నహరహంబు
హరికృపావశమునఁ గొంత యాచరింతు
సాగవలసిన దింకఁ బ్రచార మొకఁడె. ౨౩

ఉ. ఎన్నిప చారముల్ గలుగు నిక్కలి; నేఁడొక బహ్మవిద్యకే
మన్నన లేకపోయె మునిమాన్యులు తొల్లిటిరాజు లెల్ల నా
పన్నులఁ గాచుపొంకెను దపస్వులఁగా చెడుపొంటె దీక్షఁ గై
కొన్న దెఱుంగవే? యడవిఁ గుయ్యిడ డయ్యుటగాదె? భూవరా! ౨౪

ఉ. యోగ్యుఁడ పీవుగాన నిటు లోపికతో వచియించుదాన దౌ
ర్భాగ్యులు మెచ్చనెన్నఁడును వా యదు నాకల మేమి నిత్య మీ
భోగ్యములం దహర్నిశము మున్ మును లొందినసిద్ధిఁ బొందఁగా
వాగ్యతులైన భక్తులకుఁ బట్టగు మింకను విక్రమాధిపా! ౨౫

గీ॥ చెప్పఁదగిన దిందుఁ జెప్పంగఁబడె విక
మేశ వినఁగఁదగుదు పీవటంచు

నీకు నచ్చుకున్న నిక్కంబుగా నాకు
భర్తృహారికి నొకఁడె భాగ్య మవని. ౨౯

క॥ దేవబ్రాహ్మణ భక్తియు
భావజ్ఞత కార్యదీక్ష పాత జ్ఞత స
త్సేవయు శ్రీహరి! విక్రమ
దేవున కిడి పో వు మాంధ్ర దేశవిబుధులన్. ౩౦



శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహా విద్యాపీఠమున

## 43. జయపురాధీశ్వరులు విక్రమదేవవర్మగారిసమ్మానసందర్భమున

ఉ॥ వెన్ను నియంశముండుఁ బృథివీపతులన్ ఘను నట్టి రాజు వి
ద్వన్నుతు నాంధ్ర భూమికిఁ బ్రధానుని విక్రమదేవవర్మ నేఁ
డిన్న గరంబునన్ విబుధు లిందఱిలోన బహూకరింపఁగాఁ
గన్న త్రిలింగపీఠ మెటుఁ గాంచదె యున్నతి భారతావనిన్. ౧

క॥ అమృతానందుని సందే
శము వింటిరి కవులు నృపులు సర్వజనులు ధ
ర్మము నిల్పఁబెట్టు టీ దే
శమునకుఁ గర్తవ్య మఖిలసంపద లదియే. ౨

ఉ॥ ఆర్చునొ తీర్చునో పిదప నాదర మొప్పఁగ విన్నవాఁడు పో
కార్చును జింతఁ గొంత వెనుకన్ మునుగానక సిద్ధహస్తు లి
ట్లేర్చుచునుండ నున్నవియు నేఁగిన ధర్మము లిన్ని నా జమా
కర్చు లిఖింపఁగాఁగద పకాశితమా నిదమిత్థమం చొగిన్. 3

ఉ॥ ఎక్కడ నేమియున్న దెవ రేమి యెఱుంగుదు రార్యవిద్యలన్
జిక్కనివాని; వానఁ గృషిచేసినవారిని లెక్కవాసి యం
దొక్కొకవిద్య కొక్కొకని నొక్కొక మండలమందు నిల్పినన్
దక్కును బీజ మిప్పని వృథాయన కీరలు పోత్సహింపరే. ౪

ఉ॥ వేఁడుకకాదె యిక్కలిని విజ్ఞుఁ డొకం డొక విద్యయందు ను
న్నాఁడని విన్నఁ బాణపవనంబుల నాతఁ డదెట్లు నిల్పుచు
న్నాఁడని చూడఁ బాప మగునా! కలవేత్తల శిల్పు లందఱన్
గూడఁగఁ జేసి వారి కొసఁగుండు బహూకృతులుఁ ధనంబులున్. ౫

ఉ॥ కొమ్మల నుండఁగాఁదగిన కోఁతులఁ గొంపల నిల్పి; రాజమా
న్యమ్మగ నుండఁదగ్గ సకలాళిని, వీథులలీలఁ దోలు బి
చ్చమ్మున కౌర! కాలము ప శస్తుని నొక్కని దిబ్బమీఁద దీ
పమ్మను బెట్ట నిల్పఁ డనుపాటికి నోచమె? వట్టి మాట కేన్. ౬

ఉ॥ వాడలఁ బోవునట్టి ప్రతివాఁడును దాల్చెదు తాళ్ళకుండునే
నాడెము ? మేలుజాతిరతనంబుల మూఢులు చూడనెంతురే?
తేఁడులు వాని జాడల నెఱింగి, వరించి భరింతు రై తలన్
తేఁడులు, జోగితేఁడులు, గణింతురు సద్గుణరత్నజాలముల్. ౭

వా॥ ఇచ్ఛాద్వేషము లీ జగమ్మునయి మా కేమాత్రముఁ లేవు? తా
స్వేచ్ఛఁ శ్రీహరి దాల్చినట్టి తను వెట్లేనుండు మా కేమి? ధ
ర్మేచ్ఛన్ వేరికిఁ గూర్చె; వా రొకట నెంతేఁ బూనికతో నేకమై
స్వేచ్ఛమ్మైన స్వధర్మరక్షణము నాత్మార్థంబుఁ జేయంగనౌ. ౮

చ॥ ధనమున కేమి? వచ్చునది తానె ప్రసక్తి ఘటిల్ల! నుద్యమం
బునకు బుధానుమోదమది ముఖ్యము శ్రీగురువాక్య మూని; స
జ్జనపతు లూఁతగా, నిగమశాస్త్రపురాణకళల్ సెలంగు న
య్యనువు త్రిలింగపీఠమున నౌనటు మీర లనుగ్రహింపరే! ౯

---

## 44. ఆంధ్ర సాహిత్య పరిషచ్ఛంద్రికామాల

కాకినాడలో మ॥ రా॥ శ్రీ॥ సాహిత్య సమ్రాట్ విక్రమదేవవర్మ, జయపూరు మహారాజావారి యాజమాన్యమున జరిగిన పరిషత్తునకుఁ బంపఁబడినవి.

క. ప్రార్థనములేకె జన్మము
సార్థక్యముఁ జెందఁ బారమార్థికులకు స
ర్వార్థములు గూర్పఁ జాలు స
మర్థుఁడు గద విక్రమాంక మనుజవిభుఁడహో! ౧

ఉ. కన్నడియుండఁగాఁ దెనుఁగుఁ గ్రైతనె ఖ్యాతివహించె రాయఁ డా
తెన్నున నోఢ్రముంచి వినుతింగనె విక్రముఁ డాంధ్ర భాషలో
వెన్నుని పెండ్లిఁ జేసె నొకవీరుఁడు, వాసె నొకండు, నాఁడు నేఁ
డున్నదె భేద మిద్దఱు మహోజ్జ్వలులౌర త్రిలింగభూమిలో. ౨

శా. ఎట్టెట్టేఁ జనురాజు నేమనఁగ నేమేమున్నె? సాహిత్య సా
మ్రాట్టై దుర్గమసత్కటాక్షమున సామ్రాట్టైన రాజుండఁగా
ముట్టున్ మిన్ను బుధాళి కాస, యది తప్పంగాదు, నేఁడెల్లి క
న్పట్టున్ బట్టును భాగ్య మాంధ్ర పరిషన్మధ్యంబునన్ విద్యకున్. ౩

చ. అభినవభోజుఁడై రవిసమాఖ్య నొకండును సార్థనాముఁడై
యభినవ విక్రమాంకుఁడననైన మహామహుఁ డొక్కఁడిత్తఱిన్
విభవము విద్యయుం గలిగి విశ్రుతుఁడౌచుఁ ద్రిలింగభూమికిన్
బ్రభఁ గలిగింపఁగా సకలపాళికి వేళకు నేమి లోపమా. ౪

ఉ. నాఁడె మెఱుంగునట్టి ప్రభునాయకమైన సదస్సు దీనఁ గా
కేడనొ పల్కనేమి యగు నింతి వచించు నిదెంత? యంచెదన్
జూడకుఁడయ్య సద్గురుని సూక్తులె భక్తిగ విన్నవింతు వా
రౌడక జ్ఞానబీజముల నుర్వినిఁ బర్వఁగఁజల్లుఁ డెల్లెడన్. ౫

మ॥ నవరత్నంబులు నష్టదిగ్గజములు లానాఁ డట్టు లీనాఁడు నీ
నవనాథాంకుల సన్నిధానమునఁ గానన్వచ్చు టబ్బంబె బాం

ధవులై తెల్పెడు ధీరులుండఁగఁ గొఱంతల్ దీరుఁగా కెందు స
త్కవులన్ సాధుల శిల్పులన్ మనుపఁగాదా ? కల్గె సంస్థానముల్. ౬

ఉ॥ ముప్పదియేండ్ల కీవలనె మున్గిన దెంతయొ విద్య యెట్టు లీ
ముప్పది పాయు జ్ఞానతరు మూలము లేతెగ నిట్లుచూచుచున్
జప్పనిమాటలన్ సభలసల్పుచు సంతసమొందు చుండఁగా
నొప్పునె తప్పునే యసువు లుండ స్వధర్మము నిర్వహింపఁగన్. ౭

ఉ॥ భారతభూమినిం గల ప్రభావము భావము లంతరింప ని
స్సారమగుం జగం బది, ప్రశాంతికి మూలము బ్రహ్మవిద్య, సం
తారక మీ భవాబ్ధికి బ్రధానములన్ బరిరక్ష సేయుఁడీ
ధీరులు ! సత్కవుల్ ! తెలుఁగుదేశము వాసికి వన్నెకెక్కఁగన్. ౮

శా॥ బంగాలీయులు నాంగిలేయులటుఁ బైపై వేసము ల్వేసి తె
ల్గుం గీర్వాణము రాక, యాంగ్లమునఁ బల్కున్, హిందితో నూఁగుఁ బా
డుం గీతంబుల, నాంధ్ర తత్త్వమును వీడున్, వీఁడు తైలింగ్యభా
షం గుర్వీశ్వరతత్త్వబోధకములన్, సద్గ్రంథముల్ నేర్పునే? ౯

చ. ఒకపదియేండ్లు ముందో వెనుకో? యెప్పుడైన నదేమిపోవు? మా
రకములు పుట్టువుల్ ధరఁ దొరంగిన వారికి ధీరులైన పూ
ర్వకవులతత్త్వముల్ తెలుపరాదొకో? యేలొకో? వట్టితద్దినా
లకుఁ దిథులెప్పుడంచు మిగులన్ దగవుల్ ఘటియింత్రు శోధకుల్.

ఉ. ఇచ్చిన యట్టియిచ్చు నదియెందునఁ బొందదు, సత్కవీంద్రులన్
మెచ్చిన యట్టిమెచ్చు నొక మేలొనరింపఁడు, సత్యమున్ సభన్
దచ్చినయట్టి తచ్చును, యథార్థము తెల్పఁడు నట్టివారి వా
క్రుచ్చఁగనేల మ్రోలఁ గవికుంజరుఁడో ప్రభుఁడుండ దండిగన్. ౧౧

ఉ॥ కీడును మేలెఱుంగకయె కేవల మైహికమోహమంది య
ల్లాడెడు లోకులం గనుచు నక్కట, యక్కరణిం జరింపఁగా
వేడుక నాడనేల ? మనవిజ్ఞులు తద్జ్ఞులు నాఁడునేఁడు నే
జాడఁ జరింతురో పరమసాధు లటుల్ చనఁ దారకం బగున్. ౧౨

ఉ॥ ఉన్నది యున్నయట్టులనయుండఁగ ధీరులు ధీరురాండ్రు సం
పన్నులునున్ దరిద్రులు సమంబుగఁ బండితపామరాళి య
భ్యున్నతమైన సత్పథము నొందెడు మార్గముఁ జూపుచుండు రా
పన్నులనున్ గురూత్తము లపారకృపన్ దరిఁ జేర్చి సర్వదా. ౧౩

ఉ॥ ఎక్కువ తక్కువల్ గనక, యేకపదార్థమునందు నాత్మలో
మక్కువ భక్తపాళికి సమంబుగఁ బంచి తెనుంగుసీమలోఁ
జిక్కిన యార్యవిద్యలఁ బ్రసిద్ధికిఁ దెండిఁక లెండు చాలుఁ జా
ల్వెక్కసమయ్యె జీవితము, వేవితముల్ పరధర్మచింతలన్. ౧౪

చ॥ పడమటిగాలి దుమ్ము పడి, బాటలు గానవు కన్ను లద్దులున్
దడఁబడు, వెన్కమాటలు వినంబడ, వారెను గుండె, పొద్దటో
కడపఁగఁ జూచు, నద్ది యనఘుంబు నఘుంబనఁ డాస్యమెండ నె
క్కడ నొకచుక్క చిక్కదెటు గాచుట సొక్కిన మంచి మొక్కలన్.

శా॥ హృద్యంబై నది తెల్గుభాష విన వాగీశుల్ కవుల్ సత్కవుల్
విద్యారణ్యుఁడు రాయ లిర్వురు జగద్విఖ్యాతవిద్వత్ప్రభుల్
సద్యోగీంద్ర కృతుల్ తరంగము లగున్ సంగీత మీ విశ్వమం
దాద ం బాంధ్రులభూమి శ్రీనగము శేషాద్రీంద్ర ఖిం దుండుటన్.

---

## 45. శృంగారప బంధతత్త్వము

శా॥ సార్థక్యంబుఁ గనున్ బ్రబోధ మది సమ్యక్ప్రార్థితంబైనఁ; బ్రా
ప్యార్థంబుల్ భువి నాలుగే యనిరి బ్రహ్మజ్ఞుల్ సదా వానిలో
నర్థంబున్ మఱిఁ గామమున్ నరులుఁ బశ్వాదుల్ సమానంబుగా
న్థంతు ర్పరమార్థతత్పరుల కాద్యంతంబులౌ ముఖ్యముల్. ౧

మ॥ పరమార్థంబు తురీయమైన; నృపతుల్ వర్గత్రయంబందె సు
స్థిరతన్ లోకము నిల్పిరీ జనము తాత్రయంబునం దెప్పు డా
దరమున్ జూపు ద్వితీయ సంపదనె చూ ధర్మంబుఁ గామంబు ని
ర్భరమౌ ధర్మవిహీనమై చెఱుచు సర్వస్వమ్ములుం గామముల్.

శా॥ ఈయర్థంబునె వేదముల్ నుడివె భూమీశుల్ దగన్ బ్రోచి రా
ష్యాయంబౌగతి సత్కవీశ్వరులు రమ్యంబైన కావ్యంబులన్
జేయంబూనిరి నేటికాలమున నిస్సీ! ధర్మముల్ మీఱఁగా
వా యంబూనిరి నేఁటికాలమున ధర్మం బెట్టులో మాఱఁగా
శ్రే యోదాయక సంప్రదాయములు విచ్ఛిన్నంబు లయ్యెంగదా!

శా॥ శృంగారం బన నాద్యమౌ రసము పేర్మిం గాంచె లోకంబునం
దుం గావ్యమ్ములఁ దల్లిదంపు లకు ముందుం జెల్మికిన్ హేతువై
సింగారంబుగ దానిసత్కృతులలోఁ జెప్పందగున్ బామరుల్
పొంగన్ క్షుద్రులు వ్రాయుపొత్తములు మున్పున్ నేఁడు నింద్యంబులే.

శా॥ కావ్యాలాపము వర్జనీయమని వక్కాణింపరే మున్నస
త్కావ్యమ్ముల్ నిరసింప భక్తిమెయి రాధామాధవోదంతమున్
భవ్యంబౌ జయదేవసత్కవి ప్రబంధంబున్ లిఖింపండె స
త్సేవ్యంబై భువినట్టి సత్కృతుల నిందింపంగ న్యాయ్యంబొకో! ౫

ఉ॥ లేశము శంకిలంజనదు; లీలగ మున్ను గవీంద్రు లల్ల జీ
వేశులు భిన్నులై విరహ మెంతయుఁ జెందుట పొందుటెల్ల నా
వేశముతోడఁ బాడిరి; పవిత్రముగాఁ దలఁ దాల్చి రద్ది యీ
దేశమునందు శిష్టులు మదిన్ గనలే రది మూఢమానవుల్. ౬

క॥ విరహమునఁ గరుణరసమగు;
విరహార్తి హరించు రామవిభు యోగమునన్
విరహం బెఱుఁగని యోగం
బరయఁగ శృంగార మదియు నడఁగు సమాధిన్. ౭

శా॥ సావాసంబున జాతిపోవు సతికిన్, ఛందానుసారంబుగా
నేవో చెప్పుచు; హంసవింశతిని మున్నెట్లో కవీశుండు నా
రీవృత్తంబునుగాచె నయ్యది విచారింపంగ, సత్కావ్యమాఁ
గా; వీతస్పృహులౌచు ధర్మ మెపుడున్ గాపాడఁగాఁ బూనుఁడీ.

# 46. దేశోద్ధారక - విశ్వదాత - నాగేశ్వరరాయ నిర్యాణము

## శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ సంతాపము

శా॥ కాశీనాథుని వాఁడవై తిగద నిక్కంబిప్డు నాగేశ ! కై
లాసావాసము సాంబుసన్నిధిని సల్పంబోయి నీకేమి ! నీ
యాశన్ గాదె ! త్రిలింగదేశ మొకఁడై యత్యుజ్జ్వలంబయ్యె నో
దేశోద్ధారక మందభాగ్యుల కిఁకన్ దిక్కేది నీ వేగినన్. ౧

ఉ॥ నాయకులొట కేమి యొకనామము రూపము నీవుపెట్ట నీ
సాయము పొందకుండ నొక సత్కృతిఁ జేసినవాఁడు లేఁ డిలన్
బాయకుఁ డీ వహో కనకవర్షమునున్ గురిపించినావు నీ
చేయని దేది నీ కుపమ చేయఁగ నొక్కఁడు లేఁడు వేయిటన్. ౨

మ॥ క్షమసారుండవు సర్వపక్షములకున్ సాయంబు గావించి స
ర్వము బ్రహ్మంబని నిర్ణయించితివి యైశ్వర్యంబుతోఁ బాటు శాం
తము నీభాగ్యము సర్వసమ్మతము నీదానంబు నీదాకుటుం
బము లోకంబు, యశంబు శాశ్వతము నీవారౌదు రేవారలున్. 3

శా॥ నిన్నున్ జూచుక మిన్నుముట్టిరికదా నీవారలై యెందరో
యన్నా ! యెందర కెన్నిరూపముల సాహాయ్యంబు గావింతు నిన్
గన్నన్ లేమికి లేమి వచ్చుకద నీకన్నన్ భువిన్ లేరె సం
పన్నుల్ ? వారు గడింపగల్గిరొకో ? నీ ప్రఖ్యాతి నాగేశ్వరా! ౪

మ॥ భవునిన్ గొల్చితికాని నాఁ డిటు మహైశ్వర్యంబు నీకుండునే
శివుతాదాత్మ్యము సర్వమంగళ మహాశ్రీ నిచ్చె నేపాటిభూ
ధవుఁడున్ జాలునె నీకు నర్థులిల హస్తంబంచు శల్యంబు లే
దవురా నిక్కము విశ్వదాతకని నిత్యం బెల్లెడన్ జాటులన్. ౫

---

## 47. డైసుడేలు దొరసాని

క. తనవారని పెఱవారని
మనమున భేదంబు లేమి మా మా కోర్కుల్
ఘనకృపతో నెరవేర్చుచు
మనుచు మిసెస్ డ్రైసుడేలుమాతకు శుభమా. ౧

ఆ. వె. డైసుడేలు భర్త ఐసుహౌసేపిల్ల
తాను దల్లిగాఁగ ధరణి వెలసె
చిత్ర రీతి నిట్లు పుత్రి కఁగాంచిన
మాత కిడుత! శుభము సీతమగఁడు. ౨

శా. భీమాకారము వైరులందుఁ బరమప్రేమంబు మాయందు నీ
భామారత్నము మాకుఁగాదె సృజియింపం బడ్డదంచున్ సదా
రామాలోకము ప్రస్తుతింప నిను నీ రాష్ట్రంబులో నచ్చటన్
రామబ్రహ్మ మొసంగు ముక్తిని మిసెస్ డైస్ డేల వేయేలనే. 3

శా. బాలారత్నములన్ గృపన్ గనరు స్వప్రావీణ్యాబద్ధస్పృహుల్
లోలాత్ముల్ గద పూరుషుల్ దమ కెటో లోనా నుపాయంబులన్
జాలం బన్ని విముక్తలన్ బొనరుపన్ శంకింతు రంచున్ మదిన్
జాలింజెంది దయార్ద్ర దృష్టిఁ గనుటన్ స్వస్థానముల్ వీడి నీ
నీడన్ నిల్చితి మన్న నెన్నవలెనా? నీ మాతృవాత్సల్యమున్. ౪

చ॥ కలకల నవ్వు మాయెడలఁ, గార్యము పట్లఁ బ గల్భభావమున్
వెలఁదులయందు గౌరవము, వేడుక వేడుకలందు, విందుగా
జిలిబిలి పాటలందుఁ, గృతిసేతకుఁ బ్రీతిని జెందు, డెంద మా
కులమును బొంద దెందు, ననుకూలప్రవృత్తి సుహృత్తులందు, స
త్కులములయందు ధర్మములకున్ సరియౌనడకందు ముందు, నీ
కెలఁదికి నీమె నెన్నఁ బదివే లవి నాల్కలు చాలవందు, నె
చ్చెలి మనుముందు, మందు నరిచేష్టల కెందును, బెంచుటందుఁ ద
ల్లుల మఱపించు నందుసరి లోవెలిసంపద మాకు నీగఁ దా
నిలిచెను సుస్థిరాత్మయయి నేఁటికి శ్రీయని యందు డెందమా!

క॥ కనుబొమముడిచే లోకము
నననయము ముడివేయఁజాలు నతివర నిన్నే
కని యాడువారు నిల్చిరి
మనమందిరమందు భక్తిమై చిత ంజే? ౫

## 48. శ్రీ పిఠాపురము మహారాణీగారిని దర్శించిన సందర్భము (1920

చ॥ తిరుమల వేంకటేశ్వరుని దీవన సూర్యనృపావతంసు పే
రురమున లక్ష్మివౌచు విభవోజ్జ్వలవై తనరారి పుత్రు లన్
మరు మఱపించువారల సమర్థులఁ గాంచుచుఁ గుక్కుటేశుపో
లరుదుగ నేలుమమ్మ! శతహాయనముల్ కవివాణి కింపుగాన్. ౧

చ॥ వరదుఁడు శ్రీనివాసుఁడు శుభస్థితి సుస్థిరరాజ్యలక్ష్మి మీా
ర రుచిరసత్కవీంద నికరప కటావనదీక్ష చెల్ల నీ
దు రవిధరాధిపున్ నిను విధుం డుడువీథి వెలుంగుదాఁక నేఁ
డు రహిఁ గటాక్షదృష్టినిఁ గడుం గను సాధుజనావనార్థమై. ౨

చ॥ మనలను గూర్చు శ్రీహరిసుమా! మననెయ్యము పెంచు;నీదు నా
ననమును గన్న నీగుణగణంబులు విన్నవి యున్నవయ్యెఁ జా
లని చిటిఁబోటులన్ మదిఁ దలంపను ధీరవు సాధ్వి నైతి భా
నునిమెడఁ జాయవౌటను నినుం గని మెచ్చఁగనుంటిఁ బీఠికన్. ౩

చ॥ నిరతముఁ దెల్గువాడల జనించెడువారికి నర్థసంపదా
ర! రమణమీాఱఁ గొల్వ సుకరంబగు కోశము నిల్పె సత్సభాం
తరమున నీదుభర్త; ప మదంబున నాతని తోడు నీడవై
మురిపెపుమూర్తిఁ దాల్తు నిజమూర్తినిఁ జిత్రము పుణ్యమెన్నెదన్.

చ॥ కృపఁగను నిన్ను వత్సలతఁ గృష్ణుఁడు సాధుహితార్థ; మెందుఁ బా
పపుఁ గలికాల మూర్ఖులకు బాధ యొనర్చెడి నంచుఁ; గావునన్
గపటులఁ దోచి సాధువులఁ గాచి స్వధర్మముఁ బ్రోచి స్వామితో
నుపమకుఁ జాలియుండుము తలోదరి! సోదరి! యాదరంబునన్. ౫

# 49. ప్ర తి భ_

సీ॥ మగని నారాధించు మహిమచే ననసూయ
ముమ్మూర్తుల నొనర్చె బుడుతలట్లు ;
సావిత్రి పతిభక్తి శమనునితోఁ బోరి
ప్రాణనాథునకు జీవంబుఁ బోసెఁ
బ్రాణేశు భక్తి నారాధించి దమయంతి
పైకొన్న బోయని ప్రాణ ముడిపెఁ ;
బతిభక్తిగల్గు ప్రభావమ్మునను గదా !
దావానలమ్ముఁ జంద మతి యార్చెఁ;
గీ॥ దాపసుల కించు కేనియుఁ దగ్గకుండ
సతులు పతిభక్తి నతులితశక్తిఁ గలిగి
భరతభూమిని సర్వప్రపంచమునకు
దర్పణములట్లు నిలుతు రుదాత్తమహిమ. ౧

క॥ పతియన శ్రీపతి వాణీ
పతి గౌరీపతియు విశ్వపతి యాతండే !
మతి యెట్టులో గతి యటులొఁ ;
బతిభక్తికి సిద్ధి పరమపద మగు టరుదే ? ౨

క॥ ప్రత్యక్షదైవతంబులు
ప్రత్యయ మొకఁ డున్నఁ జాలుఁ బతులున్ గురులున్
నిత్యారాధనయోగ్యులు
శ్రుత్యుపదిష్టమగు ధర్మసూక్ష్మ మిదిసుమా. ౩

క॥ గురుమూర్తిన్ శిష్యులు, భూ
వరమూర్తిన్ బ్రజలు, సతులు వరమూర్తి, భిష
గ్వరమూర్తి రోగులున్, భూ
సురమూర్తిన్ జగము, గొల్చెఁ జూమి పరమేశున్. ౪

క॥ వరసుకరసూక్ష్మధర్మముఁ
బురంధ్రులు వహింపలేక పురుషులపై సం

కర మొనరింపఁగఁ గడఁగెద
దరయుమి నేమేమి సేయ దక్కట కలిలోన్. ౫

క॥ గురులం గొల్వని నరులును
వరులం బూజింపలేని వనితలు నకటా
ధరలో వెలిసిరి నేఁటికిఁ
దరణోపాయంబు వెంకెతన మయ్యెఁగదా. ౬

ఉ॥ వేదమునందు భక్తియును విప్రులయందుఁ బ్రపత్తి ధర్మమం
దాదరముల్ మహాకవులయం దనురక్తియు సాధుసేవలో
మోదముఁ గల్గుధన్యులు ప్రబుద్ధులు భారతభూమిలోన మ
ర్యాదలు నిల్పుచుండ్రు భువి నా రవిచందిరతారకంబుగాన్. ౭

---

## 50. గృహలక్ష్మి

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహాంగణభూమిని రంగవల్లు లిం
పొదవు; ద్విజోత్తమాంఘ్రి జలజోదకముల్ ప్రవహించు; లేఁగలున్
మొదవులు నిల్చు ధాన్యములు పో వగు వేడుక ముద్దుబిడ్డ లా
డుదురు శుభంబులున్ జరిగెడున్ గడు సంతసమంద బందుగుల్. ౧

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహాంగణభూమిఁ బురాణసత్కథల్
చదువఁబడున్ హరిప్రణుతి సల్పఁబడున్ ఫలపుష్పపల్లవా
స్పదమగు వృక్షరాజి పెనుపంబడు సాఁకఁబడుం గురంగముల్
ముదితలచే ననారతము ముద్దుగ హారతి పాడఁగాఁబడున్. ౨

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహాంగణసీమ సమస్తవిద్యలున్
జదువుదు రాస్థతో వటులు సద్గురుసన్నిధి నర్థికోటికిన్
ముదమగుఁ దైర్థికాళిపదముల్ గను విశ్రమ మెట్టివారికే
నుదకము నన్నముల్ దొఱకునో యడుగంగనె యర్ధరాత్రమేన్. ౩

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహాంగణసీమను గీరశారికా
వదనవినిర్గళన్నిగమవాక్కులు గీతము శ్రోతృపాళికిన్

వదలుచు శంక, శాంతి నిడు వాకిట నిల్చిన, గుద్యచిత్రముల్
ముదమగుఁ జూడ "లేద"నుట బొత్తుగ లేదెటువంటి వేళలన్. ౪

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహాంతరమందున వస్తుజాతమం
దెది యెటనుండ నా నచటనే కనుపట్టును సంజలందు వే
ల్చెదరు హుతాశునందు మురళీనినదంబులు వీణపాటలున్
హృదయమునించు మించులటు లింతలు నంతలు సంచరింతురో! ౫

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహంబునభాండములున్ బదార్థముల్
సదమలరీతి నుండు సకలంబును లెక్కగ నుండుఁ జూచినన్
హృదయము పొంగుచుండు నెదియేనియుఁ దత్త్వముఁ దాల్చియుంటసం
పదలు సమస్తముండు హరిభావనయుండును గన్నదానిపై. ౬

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహంబునఁ బండుగలుండు వేడ్క స
ల్పుదురు గృహోచితక్రియలు మోదముతోడ స్వయంబుగానె చే
యుదు రుపచారముల్ గుసుల కోర్వఁగలేరు పరాపవాదముల్
చదువుచు విన్చుచుంద్రు బుధసమ్మత పూర్వనవీనకావ్యముల్. ౭

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె గృహంబున నూత్నవధూవరుల్ వటుల్
ముదమున మొక్కుచుందురు పూజ్యుల నెమ్మది నున్నదానితో
నోదవెడుఁ జక్రవర్తి మదినుండ నితృప్తి నిజాధినాథు న
భ్యుదయము గోరి యేమరక భూషణముల్ ధరియింతు రింతులున్.

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె హృదంతరమందు మగం డెటుంగరా
నిది యొక యింతకల్గ దతనిం దనియింపఁగఁ జేయఁబూను నె
య్యెదియు సుమంబు సౌరభము నిందుని వెన్నెలయట్టు లైక్యసం
పదఁ బొదలున్ విభుం గలసి మాన్యులు మెచ్చ ననన్యభక్తికిన్. ౯

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె హృదంతరమందు నిజాధినాథుఁ డె
య్యెదియను నద్దికాని మఱియేదియు నుండదు, వానికిన్ వ్రతం
బెది తనకేని సద్వ్రత మదేయగు రూపులు రెండు తోఁచినన్
మది యొకఁ డట్లులై కడు సమంచితభావము నిండియుండెడున్. ౧౦

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె హృదంతరమందున నార్యధర్మముల్
చదువులు, సంప్రదాయములు, సచ్చరితంబులు, సాధుగోష్ఠులున్
ముదమునఁ గూర్చు, నాత్మజులు మోదముతో నవి నేర్చునట్లు దో
హదమును సల్పు, నన్యమగు నట్టి వాకించుక పట్టకుండఁగన్. ౧౧

చ॥ అది గృహలక్ష్మి యెవ్వతె హృదంతరమందలి దైవభక్తి నా
గఁడరముకాదు బంధులకుఁ గాంతునకేని సుశీల, సత్కృపా
ర దరినిఁ జేరినట్టుల స్థిరంబగు దీక్షను జేరు బారమున్
వదలని కూర్మితోడఁ దనవారల కెల్లను దారకంబగున్. ౧౨

చ. అది గృహలక్ష్మి యెవ్వతె హృదంతరమందునఁ దాను శక్తియా
చు దయితుఁ డీశుఁడంచుఁ దలఁచున్ దనసంతతి వక తుండ ష
డ్వదను లటుల్ దలంచు సుదృఢంబుగఁ దారకమంత మూర్తిపై
వదలని భక్తియున్ విబుధవర్గముపై నెనరుండు దండిగన్. ౧౩

చ. అది గృహలక్ష్మి దేన నెలకంతకు స్వాంతము సంతసంబునన్
బొడవఁగఁజాలు వింతలుఁ బ్రబోధములున్ గథ లెన్నొ చిత్రముల్
చదువఁగ ముది తంబయి ప్రచారమగున్ సకలాంధ్ర దేశమం
దెదితమ యింటలేమి యదియెంతయొ లోపమటందు రందఱున్. ౧౪

చ. అది గృహలక్ష్మి దేనిహృదయంబున భారతభూమి కెల్ల శం
పదమగు నుద్యమంబుల ప్రవక్తల సూక్తులు వెల్గు ధర్మముల్
వదలక తాల్చు ధీరుల ప్రవర్తనముల్ గను గౌరవంబు బా
జదువులు నూత్నవిద్యలు ప్రశస్తముగా వివరింపఁగాఁ బడున్. ౧౫

చ. అది గృహలక్ష్మి కేసరి గృహంబున వెల్వడి సర్వగేహినీ
హృదయము లుల్లసిల్లఁగ సమీరిత ధోరణి వ్యాసరాజముల్
పదములు పద్యముల్ సరసభంగులనుం గవయిత్రు లుం గవుల్
చదువరులున్ లిఖించినవి చల్లెడు నెల్లెడ వేయిమోములన్. ౧౬

---

## 51. గృహలక్ష్ములకు

(21—8—39)

గీ॥ తనదు దేశంబు వేసంబుఁ దనదు బాస
తన కులాచారపద్ధతి తనకు మేల
టంచు నెవ్వారు నిజధర్మమందు నిల్తు
రార్యులాంధ్రులు వారలే యందు బుధులు. ౧

గీ॥ పరులభాషల వ్యవహార బాధబోరయ
కుండ నేర్చిన నంతలో నుంచవలయుఁ
బరుల ధర్మాలపై బుద్ధి పారెనేని
హాస్యభాజనమై పోవు నాంధ్ర జాతి. ౨

గీ॥ జంతువులు చెట్లు తాళ్ళు స్వజాతిగుణము
మానకుండుటఁ గనఁడు నీ! మానవుండు
పరుల ధర్మం బనుసరింపఁ బరువులెత్తు
ఘనకలిపే రణంబున జ్ఞానమెడల. ౩

గీ॥ వ్యర్థమౌ ధర్మరహితమౌ నర్థమట్లు
కామములు దుఃఖదంబులై కానవచ్చు
నేకవాక్యత గానరాదెందు నేని
దేవగురు వర్జితంబైన దేశమందు. ౪

గీ॥ స్వైరవృత్తియు గాలిలో సాము సమము
సంప్రదాయానువర్తన సౌఖ్యమిచ్చు
నూహాలంబట్టి జీవులు సాహసమునఁ
గట్టు దప్పి చరింతురు కలియుగమున. ౫

గీ॥ తోఁచినట్లెల్లఁ జేయంగఁ జూచునొకఁడు
చూచినట్లెల్లఁ జేయంగఁ జూచు నొకతె
చూచినది తోఁచినది రెండుదోచి యాప్త
సూక్తి వెంబడిఁ జరియింప ముక్తి కలుగు. ౬

గీ॥ కట్టుబాటుల నిలువంగఁ గష్టమండ్రు
తోఁచినట్టులఁబోవ సంతోషమండ్రు
పామరుల కార్యులకుఁ గట్టుబాట్లనుంట
సద్గురూక్తుల నిలుచుట సంతసంబు. ౭

గీ॥ పట్టకుండుట తప్పెప్డు పట్టఁదప్పు
విడువకుండుట తప్పెప్డు విడువఁదప్పు
పట్టువిడుపులు పెద్దలవలన నెఱిఁగి
సత్పథంబునఁ జరియింప సౌఖ్యదంబు. ౮

గీ॥ తోఁచినటుచేసి చెడియె ముఁ దొవలతేఁడు
చూచినదికోరి సీతయు శోకమొందెఁ
జూచుటయు యోజనయు మాని ధీచతురత
నాత్మతాదాత్మ్య మొందంగ నగును శుభము. ౯

ఆ॥ ప్రాఁతదియని యేది పథ్యంబు కాఁబోదు
క్రొత్తది యయినంత రోఁతకాదు
క్రొత్త ప్రాఁత లేదు గురు నిగమోక్తికి
సర్వకాలములఁ బ్రశస్త మదియ. ౧౦

గీ॥ ప్రాఁతదైనంత నెయ్యది పాడుకాదు
క్రొత్తదైనంతమాత్రాన గుణము లేదు
ఆత్మధర్మంబు ప్రాఁతదై యమృతసమము
అన్యధర్మంబు క్రొత్తదై హాలహలము. ౧౧

గీ॥ ఆపదలయందు స్థితిగతు లట్టునిట్టుఁ
దారుమారయ్యు ధర్మంబుఁ దప్పరాదు
మున్ను ద్రౌపది దమయంతి బన్నములను
బడియుఁ దమతమశీలముల్ విడువరైరి. ౧౨

ఆ॥ ఇహముఁ బరము నుండు నెవ్వారికవ్వారి
కుండు మంచిచెడ్డ లుర్విలోన

నిహముఁ బరములేక యిల్లేదియూ లేది
పశులమందగాక ప జలమూఁక. ౧౩

గీ॥ కానఁబడుదానికంటెను గానరాని
దానియందున మతిఁబెట్టి ధర్మమందు
స్త్రీలు బురుషులు నిలిచిరి ధీరవృత్తి
భరతఖండంబునందు స్వాభావికముగ. ౧౪

గీ॥ పుణ్యమని పాపమంచు నపూర్వమంచు
కర్మమని జన్మమంచు నాకంబటంచు
శాస్త్రమని వేదమని సాధుసంఘ మనియు
బ్రిగ హము లివిసూ జీవుఁ బట్టి నడప. ౧౫

ఆ॥ ప్రియుని మీఁదిపే మ పిల్లలపైఁ బ్రేమ
యత్తమామలందు నతిథులందు
గురులపైని భక్తి కుదిరిన యిల్లాలు
కలినిఁ గోటి కొకతె కానవచ్చు. ౧౬

---

## 52. రాధాకృష్ణానందాశ్రమము

### శ్రీ రామమోహన గ్రంథాలయ శ్రీ శాఖాభవనాష్టమ వార్షికోత్సవము

(12—4—1940, బెజవాడ.)

క॥ రాధాకృష్ణాశ్రమ మిది
సాధింతురు తత్త్వమిందు సాధ్వీమణు లా
రాధయె జీవుఁడు దేవుఁడు
మాధవుఁ డిరువురును గలియ మంగళము లగున్. ౧

క॥ మగవాఁ డాడుదియును గా
దగదా జీవుండు మేనితో భేదం బా
పగజీవుఁ డబ్ధిదేవుం
డగు నుభయుల యోగమందు నానంద మిలన్. ౨

క॥ బోటులకు మిమ్ముబోటుల
కేఁటికి మాటికిని దెల్ప నెన్నటికైనన్
సూటిగఁ బెద్దలు చెప్పిన
మాటకుఁ బైమాట లేదు మదిపరికింపన్. ౩

క॥ పతియును, గురువులు, దేవుం
డతివల కందఱకు సేవ్యు లగుదురు సతికిన్
మతిమతికి గురుఁడె దైవము
మతిలేమిని గతులు పెక్కు మదవతి కకటా! ౪

క॥ వేదాంతము "చాదస్తము"
కాదది ధర్మంబు నర్థకామములన్ సం
పాదించుఁ బుణ్య మక్షయ
మోదంబిడు మోక్షమార్గములు సులభములే. ౫

క॥ నారులకై శూద్రులకై
పౌరాణికగాథ లనిరి భారత మని ము
న్నేరీ! గీర్వాణంబున్
ధారాళముగాఁగఁ జదువు తన్వంగులెటన్. ౬

క॥ అమరభాషయు నాంధ్రము
వామాక్షులు విడిచి నేఁడు పామరభాషన్
గామింతురి నలువరాణికి
సామర్థ్యము కలుగ శక్తి చాలదె మనకున్. ౭

గీ॥ భవమునం జిక్కి చచ్చు నా బ్రతుకుకంటె
సమరమునఁ జచ్చి స్వర్గంబు చనుట మేలు
భోగములఁ జిక్కి రోగాలఁ బుచ్చుకంటె
యోగినిగ శాశ్వతానంద మొంద మేలు. ౮

గీ॥ ఒంటరిగ నుండి యాపద నొందుకంటె
జంటగా నీద మేల్ భవసాగరంబు

వంధ్యగా తన జన్మంబు వ్యర్థ మగుట
కంటెఁ గొడుకులఁ గూఁతులఁ గనుట మేలు. ౯

సీ॥ గోడసంచులు బొమ్మలకొలువు లాట
పాటలును పనిపాటలుఁ బడఁతి వేడ్క
కత్తె నొనరించుఁ దాను వేడ్కగఁ జరించుఁ
గొంపలను వీడి రచ్చలఁ గూడరాదు. ౧౦

గీ॥ సంస్కృతిని మానిచేసెడు సంఘసేవ
సంకరమె కాక యదియు సంస్కార మగునె
పట్టువీడిన కొమ్మయై పడదె చెడదె
పడఁతి పతిదైవతంబుల పట్టుతప్పి. ౧౧

గీ॥ అందముగనుండి చెట్టున కంద మిచ్చు
తీఁగ యట్టుల మగనికిఁ దీవపోఁడి
కి ందనే ప్రాకులాడిన యంద మేమి?
దున్న లెద్దులు మేకలు దొ కుక్కఁగాక. ౧౨

గీ॥ పశువులను జేయు రష్యను పద్ధతులకు
భారతసతీమణులు పాలుపడఁగ రాదు
మగలబిడ్డల నతిథుల మఱియు గురులఁ
బో చుకంటెను లేదండు పుణ్యమనుచు. ౧౩

గీ॥ కలియుగంబిందు ధర్మముల్ కలఁతఁ జెందు
కావఁదగుదురు కాంత లీ కలినరులను
కావ్యమే కాంత, కాంతయే కావ్య మంద్రు
సహజపాండిత్య విలసిత చాన గాన. ౧౪

గీ॥ అక్కయై చెల్లెయై యమ్మ యగుచు మిగుల
ప్రేమగల భామయై యలరించి కాంత
పూరుషుల నుపదేశించి దారి నిలుపు
తరుణియే తగుఁ బూనంగ ధర్మదీక్ష. ౧౫

---

## 53. స్వాస్థ్య గీతము

### విజయవాడ—ఆరోగ్యవారము

2—1—40

గీ॥ దేవుఁ డున్నాఁడు మనుజుల దిద్ది పోవ
ధర్మ మన్నది యున్నది దారి తెలుపఁ;
బెద్ద లున్నారు తత్త్వంబు వెలువరింపఁ;
గర్మభూమినిఁ బుట్టు జిజ్ఞాసువులకు. ౧

గీ॥ భరతఖండంబు త్రిజగదాభరణ మిచట
వేదవేదాంగములు కళల్ వెలయుఁ దెలివి
మోదమును గూర్ప జనులకుఁ బుణ్యమార్గ
ములను జూపింపఁ బాపంబువలన మాన్ప. ౨

గీ॥ తినుచుఁ దిరుగుచుఁ బిల్లలఁ గనుచు, జనులు
పశువు లట్టులఁ జరియింపఁ బాడి కాదు;
ధర్మమున నర్థకామముల్ దగ గడించి
తుదిని మోక్షంబు సాధింప దొడ్డబుద్ధి. ౩

గీ॥ తల్లిదండ్రులఁ బోలి సంతాన ముండు;
బలమునందు సుగుణమందుఁ దెలివియందు
గుణము పితరులయందునఁ గొఱఁతవడిన;
పందిపిల్లల యటు వృద్ధిఁ జెందు మంది. ౪

ఆ॥ తల్లి కడుపుచేటు తనయులు ధర్మంబు
లేని గుంపు ప్రబలె నేని; ద్యూత,
మద్యపానములను, మచ్చరంబుల, యుద్ధ
ములను, మున్గుచుండు ముంచుచుండుఁ. ౫

గీ॥ వరుస దోషత్రయంబును బాళ్ళు తప్పి
రోగము గుణత్రయంబు విరోధ మంది
రాగముఖమానసవ్యథల్ ప్రబలఁజేయు
వ్యాధి మొదటిది రెండవ దాధియండ్రు. ౬

గీ॥ శుకులు హనుమంతు లుండె భీష్ములును గలరె
సులభలను బోలు సుదతుల సులభమె కన
నాంధ్రుమగలును గార్హస్థ్యమందె నిలిచి
మనుచు టది మేలు సర్వధర్మముల నిలను. ౭

గీ॥ దంపతిసపర్య సలిపిరి ధర్మ మెఱిఁగి
యతుల వటుగులఁ బోషించు టధికభక్తి
వృద్ధిగాంచంగ వంశాలు పెంచినారు
తొంటి పృథివీశ్వరులు గృహస్థుల నెఱింగి. ౮

గీ॥ గురుఁడు దైవంబు లేనట్టి నరులు నేఁడు
కాపురంబులు సేయుట కట్టిపెట్టి
పూటకూళ్లను గాలంబు బుచ్చుచుంట
పుచ్చుటయె చూవె యాభాస భోగములును. ౯

గీ॥ తిరముగా నుండు నొక్కటి తిరుగు నొకటి
రెండు ఱాల్ చేరి తిరుగలి పిండి విసరు
విడివిడిగ నుండెనేనియు విసరుఱాళ్ళు
ఱాళ్ళెయా భారమగుఁ గాపురంబునట్టె. ౧౦

గీ॥ ధీరురాం ధ్రుంధ్రు కొందఱు తీవఁబోండ్లు
తీఁగ లాలంబరహితమై సాగఁదగదు
కాపురము భారమని మాను కాపురుషుఁడు
సంఘమున కెల్ల చేటు నిస్సంశయముగ. ౧౧

గీ॥ సతుల నేడ్పించు పురుషులు శాపదగ్ధు
లతివలును బూరుషుల నేచ నధమురాండు
పూవుఁ దావియునుం బోలి పురుషుఁ డతివ
పొంది పొసఁగిన లోక మామోద మొందు. ౧౨

గీ॥ పిల్లలం గని పెంచుట తల్లియగుట
బరువు కొందఱ కదియును బరువు కాదు

పురుషుఁ డొకజాతి యొకజాతి పొలఁతి యందు
జాతియగు నెట్లు కలియక సతియుఁ బతియు. ౧౩

గీ॥ తల్లిలేనట్టి పిల్లయుఁ దండి లేని
పిల్ల లొంటరిగా నుండు వెలఁది పురుషుఁ
డరయ దేశంబునకు నెంతబరువు వీరి
దిద్ది పోవంగఁ గలఁ డెట్లు దేవుఁడైన. ౧౪

గీ॥ రెండు సగములు మగువ మగండు రెండు
నిండురూపగు శక్తి శివుండుపోలె
నొక్క సగ మెంతగా సాఁగి యూగెనేని
గోలయగుఁ గాని యొక్కింతమేలు లేదు. ౧౫

గీ॥ మానసవ్యాధు లన్నియు మాసిపోవుఁ
బొంది పొసఁగిన నింట నానంద మొదవు
దైవగురు భక్తిగల్గిన దంపతు లిల
ధర్మమూర్తులు వారని తలఁపరమ్మ. ౧౬

గీ॥ నాగరికులము మేమన్న నాణె మేమి?
నడవడియె నాడెమై కీర్తి నాతి కిచ్చు
చదువుకొన్నా మటన్న పాశ్చాత్యమేమి
సతులు పతులను బిడ్డల సాఁకరేని. ౧౭

గీ॥ పాలు చాలక డబ్బాల పాలుచేసి
భాగ్యమని యెంచి దాయీల పాలుచేసి
ప్రాలుమాలికఁ గాఫీల పాలుచేసి
బాలకునిఁదల్లి రోగాల పాలుచేయు ౧౮

గీ॥ పిడుతతోఁ బిల్లవానికిఁ బిడుకదాలి
నన్నమును వండిపెట్టెడు నమ్మకలదె?
మేకులను బోలు తప్పెల మెతుకుఁబెట్టి
పొట్టఁబెంతురు తల్లులు ముందెఱుఁగక. ౧౯

గీ॥ అందమారోగ్యమును గూడునట్టు లెన్నొ
పద్ధతులఁ బెట్టినార లాభరణములును
బసుపు కుంకుమ పూలును స్వర్ణరత్న
హారములు వాని ధరియింపనగును దెలిసి. ౨౦

---

## 54. స్వాతంత్ర్యము

19—2—40

విజయవాడ స్త్రీలసభ

క॥ స్వాతంత్ర్యంబన నెయ్యది
ఖ్యాతిగఁ బురుషులును స్త్రీలు గాంక్షింతురు ము
న్నే తెలుఁగు దాని కిపు డెది
భూతలమునఁ గలిగె వివరముగ రూపింతున్. ౧

గీ॥ స్వపదమారయ బ్రహ్మవాచకమటంచుఁ
దత్త్వవేత్తలు పల్క స్వాతంత్ర్యమనఁగ
ధర స్వతంతు లనఁగఁ జెప్పఁదగినవారు
బ్రహ్మభావం బహో! దానిఁ బడయువారు. ౨

గీ॥ బమ్మ బొమ్మలఁ జేయంగవలసెఁ గలువ
ఱేడు తమ్ములఱేడును ఱేయుఁబవలు
వేళదప్పక వినువీధి వెడల వలసె
బన్నములు పడిపడి హరి బడలవలసె. 3

గీ॥ ఆయవారంపుఁ బుసుక దిగంబరంబుఁ
బాఁపపేరులు సామేసఁ బడఁతిఁదాల్చి
కొండకోనల బూచులపిండుతోడ
నుండవలసెను గాదె మృత్యుంజయుండు. ౪

గీ॥ కర్మతంత్రంబునందు జగంబు దగుల
నెవనికున్నది స్వాతంత్ర్య మించుకేని

నలుఁడు రాముఁడు వసుదేవనందనుండు
తాముఁ దమవారుఁ జింతలఁ దగులుకొనరె ? ౫

గీ॥ భరతఖండంబునందునఁ బ జలు బక్క
చిక్కియుండంగ నెట్లుండిరొక్కొ యితర
దేశములను స్వతంత్రులై లేశమేని
కొఱఁత లేకుండ నున్నారొకో యరయఁగ. ౬

గీ॥ సీత ద్రౌపది దమయంతి శీలవంతు
లరయ సులభయు, మీర వెంగమ్మ నేయి
పాలు దావిరె పండిరె పూలలోన
నింతు లెంతటి వారయ్యు నేమిగారు. ౭

గీ॥ వేదశాస్త్రాల నమ్ముచు విభులఁ గొలిచి
భారతాంగన లిట్టులఁ బడిరె చెడిరె
యుత్తమోత్తముల గురువుల నరయకుంట
లాఁతి సీమల నతులవిభూతిఁ గనిరె. ౮

గీ॥ అతిథి యభ్యాగతియును గృహంబు గురువు
లనక తిరిగెడి వారు భాగ్యంబు గనిరె
సతులు పతిదైవతంబులు సచ్చరిత
లిలను జెడిపోయిరే పెఱలెలమిఁ గనిరె. ౯

గీ॥ ఎవరి ధర్మంబు వారికి నెక్కుడగుట
నొకరి కృత్యంబు లొకరు చేయుటయుఁ దగదు
చిన్న బుద్ధులు మనవౌట శ్రేయమెదియొ
హేయమెద్దియొ వేదంబులే వచించె. ౧౦

సీ॥ వేదశాస్త్రాల గురువుల వెక్కిరించు
నమ్మినారని వానిఁ బోనాడి యాడి
స్వైర మార్గంబులందుఁ బాశ్చాత్యులేమి
వారుకున్నారొ తగద నేఁడారయంగ. ౧౧

గీ॥ ఎవరి లోపంబు వారికే యెఱుఁగరాదు
పరులు దెలిపిన యందాక, గురులు వేద
ముల నెఱిఁగి కాదొకో ధర్మములు వచించు
టాది మధ్యాంతముల నరుఁ డరయఁగలఁడే. ౧౨

గీ॥ లాభమని చేసి నష్టంబులను గణించి
మాను మానవుఁడు పశుసమానుఁ డనిరి
శంకరులు మున్ను సూత భాష్యమున బుధుఁడు
ధర్మమనిచేయు మాను నధర్మమనుచు. ౧౩

గీ॥ పుణ్య మని దుర్ఘటంబులు పూనిచేసి
రఘ మని త్యజించి రెట్టి మోహములనేని
పాపమని పుణ్యమని భగవంతుఁ డనుచు
బ్రదికి తరియించి కూర్చిరి భద మనుచు. ౧౪

గీ॥ వేద మనుమాట లేనట్టి వెంగలులకుఁ
బాప మనుమాట లేనట్టి పామరులకు
దేవుఁ డనుమాట లేనట్టి తెంపరులకు
నాచరింపంగరాని కృత్యంబు కలదె. ౧౫

గీ॥ అర్థకామంబులకునై యహంకరించి
గ్రామ సింహంబు లట్ల సంగా మము లొగి
సలుపుచున్నార లకట పాశ్చాత్యు లిప్పు
డాత్తరక్షణకై చేయ రాహవములు. ౧౬

గీ॥ ధర్మ మన్నది లేనిచో ధరణి హద్దు
పద్దు లెటులుండు నెవనికి బలముకలుగు
నర్థకామంబు లాతఁడే యనుభవించు
నియమములు వోవఁ జెడునుబో నీతి జాతి. ౧౭

గీ॥ ధీరులై కూల్చుచున్నారు దేవళముల
జంధ్యములఁ దీయుచున్నారు సాహసమున

కాపురముమాని విడివిడిగాఁ జరింతు
రడ్డములుదో సి కుడిచెద రన్నికూళ్లు. ౧౮

గీ॥ దేవుఁ డొనరించునవి కొన్ని తెలివిమాలి
మనము గావించునవి కొన్ని మనలఁ జెఱచు
శాసనంబులు గొన్నింటి సాహసంబు
లన్ని చెఱపంగ మర్యాద లన్నియుఁ జెడె. ౧౯

గీ॥ సహగమనముల సల్పిరి, సన్న్యసించి
నియమమున నింటఁ గాలంబు నెట్టి రబల
లయ్యుఁ, బతిదైవతములు గార్హస్థ్య విధుల
నిర్వహించిరి ధర్మంబు నిలిపినారు. ౨౦

గీ॥ ఎఱిఁగి చెప్పిన నామాట లింతులార
వీనులొగ్గుచు వినుఁడల్ల వేదవిహిత
మార్గమునకన్న లేదింక మార్గమొండు
సంసృతినిదాఁటి సుఖియింప సతుల కెందు. ౨౧

గీ॥ శంకరులఁజేసి భర్తల శక్తులైరి
అమ్మలైపోచి రందఱ కన్నమిడుచు
సంప్రదాయంబు పోషింతు సతులు మున్ను
నేఁ డికెటు పోవుచున్నార లాఁడువారు. ౨౨

---

## 55. రా జ మ హేం ద్ర వ ర ము

ఆంధ్రయువతీ సంస్కృతకళాశాలా సాంవత్సరికోత్సవమున
అధ్యక్షత వహించినవుడు
ది 17—4—1936

శ్లో॥ రాజతే రాణ్మహేంద్రస్య రాజధానీ సదా నవమ్
అధునాచ పురా యస్యాం భారతం భారతీ శుభా. ౧

శ్లో॥ లక్షణంచ తథాలక్ష్యం యత్రాభూ దాంధ్రవాసినామ్
భాషాయాః ప్రథమం తస్మై క్షేత్రరాజాయ తే నమః. ౨

ఉ॥ భావము కెన్నియో గలుగు స్వాంతమునందున నాకు నేఁడు గో
దావరితీరమందు విబుధప్రకరంబులు స్నానసంధ్యలన్
పావనదీక్షలన్ వివిధశాస్త్రవిమర్శల సాధుపూజలన్
బావనుతాటు నాయెదుట నాటకమట్లుఁ గాన నౌఁగదా. 3

శా॥ శ్రీగోదావరితీరవాసమును వాసిం జేసి పూతాత్ములై
రాగద్వేషములన్ ద్యజించి సతతబ్రహ్మానుసంధాన స
ద్యోగం బూని భవాబ్ధి గోష్పదముగా నుంకించి లంఘించుచున్
వాగర్థైక్యవిమర్శ సేయు ఘనులన్ బ్రహ్మణ్యులన్ గొల్చెదన్. ౪

క॥ యోషామణు లాద్యంబగు
భాషం దైళింగ్యభాషఁ బ్రాజ్ఞత వడయన్
భాషాయోషామణులై
భూషింతురు భారతీయభూమిన్ భూమిన్. ౫

ఉ॥ ఎంతకు వచ్చునేని చెడనీయక విత్తన మెట్టులెట్టులో
కొంతకుఁ గొంతయే నిలిపికొన్నది గౌతమి యార విద్యలే
ప్రాంతమునందుఁ బండితులఁ బ్రాజ్ఞులఁ బెద్దలఁ గోనసీమనున్
స్వాంతమునన్ భజంతును సభన్ వినుతింతును భక్తి నెంతయున్. ౬

శా॥ దాక్షారామ మనంగ మోజుపడి గ్రంథంబందు భీమేశుఁ బ్ర
త్యక్షంబుం బొనరించు నాంధ్రకవితాధౌరేయు శ్రీనాథునిన్
వీక్షింతున్ గవిసార్వభౌముని మనోవీథిన్ జగన్నాథ హా
ర్యక్షున్ బండితరాయనిన్ బులుసువిద్యారణ్యులన్ శ్రోత్రులన్. ౭

క॥ ఢిల్లీని వారణాసిని
దెల్లని విఖ్యాతిఁ గన్న ధీరులఁ గనునో
తల్లీ! గోదావరి! నీ
పిల్లల దీవించి జ్ఞానభిక్ష నొసఁగుమా. ౮

చ॥ తిరుపతి వేంకటేశకవిధీరులఁ గృష్ణకవీశ్వరేశునిన్
వరవసురాట్కవిన్ నరసవాజ్ఞిపుణున్ నరసింహసత్కవిన్

దరతమముల్ గణింప కెదఁ దత్పరతన్ భజియింతు నెంతు మున్
సరసత యెందుఁ గల్గునట శారద నాకుఁ గనంగవచ్చుటన్. ౯

క॥ ఇరుగడలఁ గళాశాలల
నిరువురు చదువంగ బురుషు లింతులు గోదా
వరి! పోషింతు విరువురున్
వరమతులై యుంటకా శుభంబు జగతికిన్. ౧౦

గీ॥ విత్తకారణంబు విద్యయౌట నిజంబు
వినయమును వివేకమును స్వధర్మ
దీక్ష చిత్తశుద్ధి మోక్షమందు నపేక్ష
సాధుసేవ దాని సత్ఫలములు. ౧౧

క॥ బదుకుటకా చదువుట? యీ
చదువులు బదికింపఁగలవె చచ్చెడువారిన్
సదసద్వివేచనంబున
వెదకుట సుమి ఫలము వేదవీథుల నజునిన్. ౧౨

శా॥ రాజుల్ పోయిరి రాజ్యముల్ చనియె ధర్మం బెల్లెడన్ మాసె హా
బూజుల్ వట్టెను విద్య లన్నియును సంపూర్ణుల్ గనన్ రారు స
త్తేజం బించుక తాల్చు వారి కెచటన్ దిక్కన్న దే లేమిచే
నేజాడన్ వెలయంగలేరు జడులై హీనప భావంబునన్. ౧౩

మ॥ తమధర్మంబె బలంబుగా నిలిచి రీ ధాతీ తలంబందు ని
క్కముగా వైశ్యులు సర్వసంస్థలను సాఁకంబూని యీ తెల్గుదే
శములో నాళము నారివంశ మది పా శస్త్యంబునుం గాంచె నెం
దమరున్ సద్గుణ మద్ది చెప్పఁదగుఁ గాదా సాధు సద్గోష్ఠిలోన్. ౧౪

గీ॥ ఒక్క లక్ష యిచ్చె యువతీజనంబులు
సంస్కృతంబు నేర్చు శాల కవుర!
రామలింగసెట్టి ధీమంతుఁడౌ నిట్టి
దక్షుఁ డెందుఁ గలఁడు దాతలందు? ౧౫

ఉ॥ కోమటులందు సత్కవులు గొందఱుఁ గానఁగవత్తు రందులో
దోమకులుండు గుప్తవినుతుల్ గనె నాళము కృష్ణరాయఁడుౝ
గోమలమైన సత్కవితకుం గుదురైన బుధుండు ముందుముం
దేమహితుండు నేమహిళ లెప్పుడు పైకిఁగనంగవత్తురో. ౧౬

క॥ కామాక్షికృపౝ బత్తుల
కామాక్షమకబ్బె నాంధ్రకాంతామణులౝ
ధీమతులఁ జేయు సుకృతము
సామాన్యమె యిదియు పూర్వజన్మఫలంబే. ౧౭

ఉ॥ లోకముఁ జూచి యించుకయు లోగక సర్వము బహ్మమంచు నా
లోకనసేయఁగల్గెడి సులోచన మీఁగల జ్ఞానవిద్యలౝ
సాఁకెడువారు లేమిని విషాదము పుట్టును భారతావనిౝ
లౌకికవిద్య లేడఁ బ బలంబగుచుండెఁ గలిప సక్తిచేన్. ౧౮

ఉ॥ స్త్రీలను బాగుజేయు టది దేశము నంతయు బాగుసేయుటౌ
శీలము ధర్మముౝ బలముఁ జేడెల కయ్యవి నిల్పుకున్న నె
క్కాలము నార్యసంతతికిఁ గల్గునె సేమము లాభ మింతకుౝ
మూలము స్త్రీలు వారి పరిపూర్ణత పూర్ణత జాతి కంతకుౝ. ౧౯

---

## 56 హిందూసుందరి పత్త్రి కాశీర్వాదము

శా॥ హిందూసుందరి హిందుసుందరుల కెంతే బుద్ధియుౝ విద్య లా
నందంబున్ సమకూర్పఁగా జనుపు యత్నం బాంధ దేశంబులో
నం దీక్షం గొని ముప్పదేండ్లుగ స్వతంత్రంబైన మార్గంబునౝ
జందా లిచ్చిన నీయకున్న నెటులో సైరించి యిక్కట్టులౝ. ౧

మ॥ వరబాలాంతపువంశదీపకుఁ డనన్ బ ఖ్యాతుఁడైనట్టి సుం
దరరామాఖ్యుని చెట్టఁబట్టి పలువిద్యల్ నేర్చి యా పో డ హా
చ్చరికన్ జేయఁగ శేషమాంబిక కళాసంపత్తితోఁ జారుచా
తురితో ముప్పది యేండ్లుగా నడుపు హిందూసుందరిౝ విందుగౝ.

చ॥ మగువల కొక్క పతి క సమంచితరీతిని నిర్వహించునే?
మగువ యొకర్తు వట్టి నగుమాటలఁగాక స్వధర్మబోధకం
బగునటు లార్యతత్త్వము మహర్షులమార్గము లాంధ్ర భాష కిం
పగునటు శేషమాంబిక పరాంబిక సత్కృప నెట్టు లెట్టులో. 3

చ॥ అల, పులుగుర్త లక్ష్మి నరసాంబిక చూడమ సీతమాంబయుఙ్
జెలులయి తోడుఁగాఁ బనులుసేయ నమేయవిధాన మూని బా
లల కొక పాఠశాల, సకలపత్రికటాంధ్ర నిలింపపుస్తకం
బుల కొకశాల, దీక్ష నడపుఙ్ బురి శేషమ యాత్మతృప్తికై. ౪

గీ॥ బాల్యతారుణ్యములు దాఁటి ప్రౌఢ యయ్యె
శీలతన మెగె భూరివివేక మొదవె
శ్రద్ధయును భక్తి పరమార్థబుద్ధి కలిగె
హిందుసుందరి విందగు డెందమునకు.

ఉ॥ చిన్నతనంబునుఙ్ గడచె శ్రీహరిసత్కృప సాధుసేవచేఁ
దిన్ననిభావముల్, నిగమదేశికదేవబుధాళి మెచ్చఁగా
వన్నెగఁ బల్కుసుందరి నవంబగురీతి మనోహరంబుగా
మున్ను మహామహుల్ పలుకుబోధములఙ్ బ్రతిమాసమ్మాసతోఙ్.

ఉ॥ భారతభారతీమహిమపారము సిద్ధికిఁ గర్మరాశికిఙ్
సారము తారకం బనుచు సారసనేత్రల కెల్లఁ జాటఁగా
భారము హిందుసుందరికిఁ బైఁబడియున్నది సర్వసత్కళల్
గూరిచి యార్యధర్మములకుఙ్ స్థితియుఙ్ గతి నిల్పఁగాఁదగుఙ్. ౬

సీ॥ గుజ్జనగూళ్లతో గోటిముద్దలతోడఁ, జిలుకపందిరితోడ గిల్కతోడఁ
జిన్నయన్నలతోడఁ జెల్లెళ్లతో,నాట,పాటలతో ముద్దుమాటతోడఁ
జదువుసంధ్యలతోడ,సాధుసేవలతోడ,వడుగుపెండ్లిండ్ల సందడులతోడ
బుద్ధిచెప్పాటలతో బుజ్జగించుటలతో,నుపచారములతోడనోర్పుతోడఁ,

గీ॥ దల్లి పిల్లలఁ దన్ను విధంబుగాఁగ
లలితపద్యంబులకు వ్యాసములనుగూర్చి

చిత్త మలరించి పోషించి శివము పెంచి
హిందుసుందరి లాలించు నెల్ల ప్రజల. ౭

మ॥ అనుభూతిన్ సకలంబునున్ దెలిసి యాద్యంతంబు రాగాదికం
బున నెప్పట్టుననైన బొంకని మహాపుణ్యాత్ములౌ నాప్తు లా
డిన మాటల్ పరమప్రమాణ మని యూహించు జాతి యీ యాంధ్రభూ
మిని భామామణులన్ స్వధర్మమునఁ గూర్మిన్ నిల్పఁబెట్టందగున్. ౯

---

## 57. కాకినాడ విద్యార్థినీ సమాజ వార్షికోత్సవ సందర్భము

ఉ॥ అర్థిను లుందు రెయ్యెడల నాభరణాలకుఁ గాకినాడ వి
ద్యార్థిను లీ సమాజమున నాంధ్రిమునన్ సురభాషఁ గాంతు స
ర్వార్థములన్ సతీమణుల కార్యుల పద్ధతు లిష్టమైనచో
సార్థకమౌను జన్మములు సత్యము భారతభూమిలోపలన్. ౧

చ॥ పురుషులలోనె సంస్కృతము పూజ్యతఁ గాంచఁగఁ గాకినాడవా
రరుదుగ బాలికామణుల కాదరమొప్పఁగ దేవభాషలోఁ
జొరవ కుదుర్చుచుండు టది చూడఁగ నిద్ధర బీజధర్మ మీ
శ్వరుఁ డెటనో యెటెట్టొ పరిపాలన చేయుట గాననయ్యెడిన్. ౨

శా॥ శ్రీకా వెంపటి వంశ్యసన్మణులు వాక్కుం జేయి సాయంబు నీ
నేకార్యం బవలీలఁ జేయుచుఁ గడున్ వృద్ధత్వమం దేనియున్
జీకై యుండినవేళలం దయిన నీ శేషాంబ ధైర్యంబుగాఁ
బాఁకున్ సిద్ధిఁ గనున్ సమాజమున విశ్వాసంబుతో నన్నిటన్. 3

శా॥ కన్నుల్ కాలును గేలు చక్కఁబడె వీకం దా సభామధ్యమం
దు న్నిల్వంబడి పత్రికం జదువఁ గాంతున్ శేషమన్ దూరమం
దున్నన్ నామది, మాట కేమి! యిటు లత్యుత్సాహముం బూని యే
ర్యున్నల్ ముప్పదివత్సరాల్ కథఁక విద్యాసేవకుం జాలిరే? ౪

శా॥ తా నెట్లోయటు నెచ్చెలుల్ కడఁగి విద్యాసేవలన్ బూనఁగాఁ
దా నెట్లో యటు సాధులందఱును విద్యన్ దేల్చఁగా బిడ్డలన్
దానెట్లో యటు లార్యధర్మములఁ జిత్తంబుంచ విద్యార్థినుల్
తా నీ నేలకు మేలుబంతి యటు బాలాంత్రపు శేషాంబయా. ౫

---

## 58. శ్రీ మతి బాలాంత్రపు శేషమ్మగారి షష్టిపూర్తిప్రశంస

ఉ॥ ఒంటిఁగ ముప్పదేండ్లిటుల నోర్పున నేర్పున మానసత్త్రి కన్
దంటలమారి కాలమునఁ దద్దయుఁ బూనిక నిర్వహించు నీ
వంటి మఱొక్కతెన్ గనము పల్కుట చుల్కన, శేషమాంబ వా
ల్గంటుల మేలుబంతి వని కాంతురు నిన్నునె కార్యదీక్షులన్. ౧

ఉ॥ మోదముతోడఁ బెంచెదవు పుత్త్రి కఁ బత్త్రి క నొక్కరీతి సం
పాదకురాలవై కళలఁ బొండితి వ్యాసనమృద్ధిఁ గూర్చి నీ
మాదిరి సంస్కృతంబును గుమారికలం జదివించువార లి
మ్మేదిని లేరు నీ కెపుడు మేలు దలంచెద శేషమాంబికా! ౨

శా॥ పాచీనోక్తుల నీదుపత్త్రి కల నిల్పంజూతు మేలేర్చి య
రాచీనోక్తుల గూర్తు, సద్గురుల ధీరస్వాంతవై కొల్చి, యి
వ్వీచీమధ్యమునందు నిల్వఁబడి సంవేద్యంబు రూపింతు నీ
దా చాతుర్యము శేషమాంబిక ప్రశంసార్హంబు లోకంబునన్. ౩

మ॥ కలిసంపర్కము దుర్నివార మది కల్లన్ గల్గు నెన్నేనిఁ; బె
ద్దల బోధంబున *దానిఁ దోచి, పరమార్థప్రకాశంబైన బు
ద్ధులతో హద్దులనుండు సాధ్వులకుఁ జేతుల్ మోడ్తు నీ భారతీ
యుల రక్షింతురు, వారి కీడెవరు లేరో శేషమాంబాసతీ! ౪

క॥ కాలప వాహమునఁ బడి
కాలూనఁగలేక యెట్టిఘనులున్ జారన్
స్త్రీలకుఁ బత్త్రి క నడపుచు
శీలము నిలుపం గడఁగెదు శేషమఁ దలఁతున్. ౫

---

* దాని = ఆ సంపర్కమును.

క॥ భారము వేణీభారము
నారీజనమునకు నేఁడు నానాటికి నే
భారంబు సైపుదురు సం
సారంబే భార మనెడు సమయము వచ్చెన్. ౬

క॥ మనువులకె మనువు లయ్యెన్
జనుగుడుపన్ మనవియయ్యె సంతతి కేనిన్
జననిగ నుంటకె మనవులు
వనితల కే మిట్లు వచ్చె భారతభూమిన్. ౭

క॥ ధవు మాధవుఁ గొలువక భువి
వివిధములగు వృత్తులందు వెలఁది వెలఁదిమై
శివ! శివ! పడమరఁ దిరుగుట
శివమెత్తఁగఁజేయునకట చేడెల కెందున్. ౮

క॥ బోనంపుఁబెట్టుకూటికి
మానిను లాసించి వంట మఱచుచు నుండం
గా నాతిథ్యము లెక్కడ
నీ నాఁటికి ముందు ముందు నెట్టివి యగునో. ౯

క॥ సులభంబు పెండ్లి మానుట
సులభలు గావలదె వట్టి సోయగమునకా?
సులభంబు తలలు పెంచుట
సులభమె వెంగమ్మ లగుట సుదతుల కెందున్. ౧౦

క॥ మీఱంగవచ్చు నానల
మీరా లయ్యెదరె? పే మమీఱ సతతమున్
గౌరీవిభు చెలికాని న
హోరాత ముఁ గొలుచుచుండు నుత్సాహముతోన్. ౧౧

గీ॥ విభులు పతితులైన వెలఁదులు తమ శీల
మునన పతులఁ బట్టి మునుఁగనీక

యుద్ధరించుచుండ నొకకొంద టీనాఁడు
మునిఁగి మగలఁగూడ ముంతు రకట. ౧౨

క॥ తెనుఁగుం దేశపు వేసము
తెనుఁగుం బాసయును జదువఁ దెనుఁగుం గృతులున్
దెనుఁగుం బాటలరుచులున్
దెనుఁగుపురంధ్రు లకుఁ గూర్చు దెసలన్ యశమున్. ౧౩

మ॥ సతి బాలాంత పు శేషమాంబ యను విశ్వఖ్యాతి నేఁ డబ్బె; ను
న్నతనారీమణి కింతకంటెఁ గలదా ? నానాఘముల్ తోడనే
సతినిన్ గన్న నడంగిపోవు నని శాస్త్రంబుల్ వచించున్ నమ
స్కృతికిన్ లింగము నీడుఁ జూడరుగదా యెన్నండునుం బండితుల్.

శా॥ స్త్రీలై యుండి సతీత్వముం గనిన సాధ్వీరత్నముల్ బూరుషుల్
చాలం బూజ్యు లటంచు వేదములఁ దెల్పంగా వృథాభేద మిం
కేలా చేయుదు రేరియందు గుణముల్ వృద్ధిం గనున్ వారలే,
బాలో? స్త్రీలో? కుబాలో? యేవయినన్ రత్నంబు లందుర్గదా!

---

## 59. భర్తృవియోగదుఃఖితయగు సతి శేషమాంబగారికి

## ఉపదేశము

ఉ॥ అమ్మరో! ముందువెన్కలె ప్రయాణము సిద్ధము నేఁడో? రేపో? దే
హ మ్మది నశ్వరమ్ము, పరమార్థమె శాశ్వత మెంతవారలున్
బొమ్మలు కర్మసూత్రమునఁ బోవుచు వచ్చుచునుందు రెందు స
ర్వమ్మును బ్రహ్మ, మన్యము ప్రపంచమునందు నొకండు లేదహో!

శా॥ భావింపంగ జగమ్ము లన్నియు నగున్ బ్రహ్మమ్ము జీవాళియున్
బోవున్ వచ్చు తరంగపాళి యటు లంభోరాశిలో పౌరుషం
బా వాగీశముఖామరాళికె యసాధ్యం బేను నీ వేడ? సం
సేవింపందగు సద్గురూక్తుల నికన్ శ్రీశేషమాంబాసతీ! ౨

శా॥ ధన్యత్వంబును గన్న జీవితము మాతా నీది, నీ తాల్మి సౌ
జన్యంబున్ దయ తేటమాటయును విశ్వాసంబునుం జెల్మియున్
మాన్యుల్ మెచ్చిరి; హిందుసుందరి జగన్మాన్యం బహో! లేరు నీ
కన్యుల్ స్త్రీయులు నెల్ల రొక్కటియె సుమ్మా, శేషమాంబాసతీ! ౩

శా॥ సౌందర్యంబును సాధుసేవయును విశ్వాసమ్ము దాతృత్వ మా
నందంబున్ సహజమ్ముగాఁ గలుగు నీనాథుండు నిన్వీడిపోఁ
గుందున్ లోకమె నీమదిన్ గలుగు గర్గో లెన్నఁగానౌనె? యా
నందంబౌ నల బ్రహ్మచింతనమె కృత్యంబక్క నిత్యం బిఁకన్. ౪

శా॥ సన్న్యాసం బది వచ్చెఁ బూర్ణముగ నీ చారిత మందున్ సతీ
త్వన్యాయంబున నెల్లవారలకు సద్ధర్మమ్ముఁ దెల్పన్ మహో
పన్యాసంబులఁ బత్రికల్ నడపి విశ్వశ్రేయముల్ గూర్పమా
యన్యంబుల్ కలిచోదితంబులు సహస్రారంభముల్ దంభముల్. ౫

శా॥ నీకున్ సేవయొనర్చి ధన్యతఁ గనన్ నీయల్లుఁడున్ గూఁతురున్
నీ కంచంబున నీదుపిల్లలుగ సాన్నిధ్యంబునం బెర్గి సు
శ్లోకత్వంబును గన్న యెల్లరును సంశుద్ధాంతరంగంబులన్
నీకై యూఁతగ శేషమాంబ! నిలుతుర్ నిర్నిద భద్రార్థులై.

శా॥ ఆధివ్యాధులు లేక జీవితము శేషాంబా! యిఁకన్ ధ్యానమున్
బోధంబున్ జపమున్ దపంబు శుచి సంపూర్ణత్వమున్ గాంచ దు
ర్మేధన్ దిద్దుచు నాశ్రితావళికి సద్వృత్తంబు గల్పించుచున్
సాధింపందగు సద్గురూక్తులను మోక్షం బాస్తికోపాస్తిచేన్. ౭

## హిందూ సుందరికి

శా॥ తల్లిం దండి యు నేఁడు తల్లియగు శ్రద్ధంబూని శేషాంబ రం
జిల్లన్, నేఁడు దివానిశంబు మృదుసంసేవల్ పొనర్పంగఁ బో!
చెల్లన్ నీదు ఋణంబు సుందరి భవచ్ఛీలున్ గళల్ శక్తియు
ద్యల్లావణ్యములామెమూలమునఁజూ తాల్చెన్ బుధుల్ మెచ్చఁగన్.

# 60. కాళ్ళకూరి మహాలక్ష్మి సుందరమ్మ నిర్యాణము

19—7—41

గీ॥ నీ ప్రమాణబుద్ధి నీ త్రికరణశుద్ధి, నీమశక్తియుక్తి నీ మృదూక్తి
నీ విరక్తి రక్తి నీ పతిభక్తియు, స్త్రీలలామములకు మేలుబంతి. ౧

చ॥ ఇరువదియైదు వర్షములకే శతమానము నిండె నీకు సుం
దరి వరలక్ష్మి శారద ముదంబునఁ గొల్వఁగఁ జెల్వమీఱు శాం
కరిఁ బురుడించుచున్ సిరియు జ్ఞానము శక్తియుఁ గల్గి వెల్గుచున్
హర హర మండి యారితికదా! జగమంతయు మున్గఁ జీఁకటిన్. ౨

మ॥ కలిలో నాలవపాలు ధర్మమని వక్కాణింతు, నీ పాలిటన్
వెలయున్ ధర్మము నాల్గుపాళ్ళనుచు విద్వేషించి నీ యాయువున్
గలియే మింగెను బంకజాతములు గందంబోవునే యొము నేఁ
దోలిజామే జలజాప్తుఁ డాకసమునందున్ ముందె వెల్గన్ దగన్. 3

క॥ మిన్నేటి మన్ను వెన్నయు
వెన్నెల తెలివియును గళలు విన్నాణముగా
నన్నలువ కలిపి సుందరి
ని న్నిర్మాణమ్మొనర్చె నిజధీగరిమన్. ౪

ఉ॥ అంతరమందు బాలను నిరంతరమున్ భజియించువారు బా
లాంతరులై త్రిలింగవసుధామహులందుఁ బ్రసిద్ధికెక్కినా
రెంతయు సుందరాంబ జనియించెను వారలలోన స్వాంత మ
త్యంతము శ్రీసదాశివ పదంబుల మోదమునొంద విందుగన్. ౫

## 61. పోణకా. కనకమ్మ గారికి
## ఓదార్పులు

ఉ॥ ధీరత నీకుఁ జేయు; నతిదీనత మాంద్యముఁ జిత్తమందుఁ జే
కూరుచు ధీప్రచారము వికుంఠితమౌ స్వవచఃప్రవృత్తి ని
స్సారమగుక్ గనం గనఁగ సర్వజగత్ప్రియంబు దోఁచు హా!
కూరిమిబిడ్డదైన వెతఁ గుందెడు ని న్నెటు లూరడింతునో! ౧

చ॥ వగవకుమంచు నెట్లకట! వ్రాయఁగ నేర్తును? బిడ్డపోక కా
పగవలెఁ బాలుశోక మెటు లాపఁగనోపును? శాస్త్రయుక్తు లె
వ్వగ వగ మాన్పఁజాలు? నల పాండవమధ్యముదుఃఖ మా పదా
ఱుగురచరిత్ర మించుకయుఁ ద్రోయఁగ నో కనకమ్మ, చాలెనే? ౨

చ॥ కలుగక కల్గ కొక్కటియ కల్గెను గన్నియ నీకు దాని భూ
తలమున నిల్పఁ డా విధి వృథా! కనకమ్మరొ పౌరుషమ్మహో!
కలిమియు లేమియున్ మఱి సుఖంబును దుఃఖము దైవదత్తమై
కలుగును జీవకోటి; కని కాంతురు ధీరులు చిత్తశాంతినిన్. ౩

ఉ॥ చచ్చెడువార లెల్లరును సత్యము! నిత్యము బహ్మ మొక్కఁడే
నచ్చదుగా యథార్థము జనంబున కో కనకమ్మ! శాంతితో
సచ్చరితుల్ మహామహులు సర్వ మెఱింగియుఁ జచ్చినట్లుగాఁ
బుచ్చెద రీ జగాన నెటో పొద్దులు సద్గురుబోధ మెంచుచున్. ౪

క॥ భోగములో గముప్రియులవియోగము యోగమ్ముఁగల్గుచుండునుదానై
రాగంబేలా ? యీశ్వర భోగాయతనము శరీరముగఁ గనకాంబా!

సీ॥ తానుదానైన యందాక దైవతంబు తానుదానైనయప్పుడు దైవతంబు
జీవుఁడే జాడఁజూచిన దైవతంబు తల్లి! తద్ధ్యానమవుత! నీధర్మ మెపుడు.

# 62. మా పద్మిని

14—9—39

క॥ కొలిచినది తల్లిదండ్రు లఁ
గొలిచిన దత్తింటివారిఁ గొలిచెన్ దయితున్
గొలిచెను సాధుల గురువులఁ
గొలిచిన పద్మినికి నీడగుదురే ముదితల్ ? ౧

క॥ లోపము పాపము తాపము
మా పద్మిని జన్మమందు మందునకైనన్
జూపఁగలే దనవరతము
శ్రీపతి భజనమ్ము సలిపి శ్రీపతిఁ జేరెన్. ౨

క॥ నీలాలక బాలికవై
లోలాకులు దూల భజనలో జయదేవున్
దాళము తప్పక పాడెదు
నీ లీలలు దగులు పద్మినీ మది నేఁడున్. ౩

క॥ నీ పాటయు నీ పద్దెము
నీ పతిభక్తియును రక్తి నీగురుదేవ
శ్రీపదపూజయుఁ బద్మిని
నీపోలిక లెచటఁగాన నిజము జగానన్ ౪

క॥ కవులున్ బండితులున్ సా
ధువు లలరఁగఁ బద్దెములఁ జదువుచున్ వినుచున్
గవనముఁ జెప్పుచుఁ బాడుచు
భువిఁ బద్మిని! మెఱసి యెందుఁబోయితి తల్లీ! ౫

క॥ కనకకృతకందరామా
యణామున్ సౌందర్యభవనమందున సభ్యుల్
విని మెచ్చఁగఁ బాడిన ప
ద్మిని చనుటకు సాధులెంత దిగులొందెదరో. ౬

క॥ నినుఁగని కన రొారులను బ
ద్మిని ! నీ తలిదండ్రు లిపుడు దీను లగుచు నీ
చనుటకు వాపోవుదు రే
మని వారిని దేర్పవచ్చు నమ్మా చెపుమా. ౭

క॥ అనుకూలుం డనురక్తుం
డనురూపుఁడు సచ్చరిత్రుఁ డగు నీ నాథుఁ
గనిమైన నిలువకీ మే
దినిఁ బద్మిని! యెందుఁబోయితివి విధివశతన్. ౮

క॥ పద్మిని, పద్మిని, పద్మిని,
పద్మిని యని నీ విభుండు పలవించుట కా
పద్మాప్తజుండు కరుగఁడు
పద్మిని పద్మజుని వా ౯తఫల మెట్టిదియో. ౯

## 63. విజయనగర స్త్రీలసభ

శా॥ ప్రీతిన్ శ్రీ విజయాఖ్య పట్టణ పురంధ్రీ రత్నముల్ నన్ను నీ
రీతిన్ మన్ననఁ జేయ వారి కిదె యర్పింతుం బ్రణామమ్ముఁ బ్ర
ఖ్యాతల్ సర్వకళావిచక్షణలు పూజ్యల్ గల్గ విద్యావతుల్
నాతో నయ్యెడిదేమి కీర్తి యది పుణ్యంపున్ ఫలంబౌఁ గదా. ౧

శా॥ ధీరస్వాంతలు వీరమాతలును సాధ్వీరత్నముల్ యోగినుల్
గారే భారతనారు లిప్పటికి దుష్కాలంబునన్ మాత్ర నా
తీరెల్లన్ సతులార యెన్నటికి నీ దేశంబుతో సాటిరా
వే రాజ్యంబులు పై మెఱుంగుకద యెందేమున్న దాసింపఁగన్? ౨

ఉ॥ కొా త్తొక వింతగా జరగెఁ గొన్ని దినంబులు పోవఁబోవ నీ
పత్తును మేలులేదుసరి! సత్యము ధర్మము నిష్ఠ నీమముల్
బొత్తుగఁ బోయె నేఁటి పరబోధలు బాధలు సాధ్వులార? స
ద్వృత్తము మీాదు పున్నెమున నేకద? నిల్చెను గర్మభూమిలోన్. ౩

ఉ॥ ముద్దని నేర్పినంతఁ బరబుద్ధులు సుద్దులు వేషభాషలున్
హద్దులు దాఁటుచుండి రకటా! మనబిడ్డలు నేఁటి కెద్దియున్
వద్దనఁ గద్దనన్ గలదె భారతభూమిని నూత్నభావముల్
దద్దయులాగు దిక్కుగలదా? యిఁకఁ బెద్దలు పూనకున్నచో. ౪

చ॥ చెలియలికట్ట శీలమది స్త్రీలకుఁ గాలము గర్మమెంతగాఁ
గలఁచిన దాని దాఁటరది కానని యన్నలదేమొ పగ్గగాఁ
దలఁచెద రన్యదేశముల దారిని మాఱుపుసేయ ముగ్ధలున్
దెలియక వారిత్రోవఁ జని తెచ్చెద రెంతయుఁ గొంపమీఁదికిన్. ౫

చ॥ మగలకు నాండ్రకుం గలుగు మక్కువ తక్కువగాక యుండు నా
బిగువెడలింపఁ దెంపఁ జను వీరులు శాసనముల్ పొనర్పఁగాఁ
దగుదు మటంచు వత్తురుగదా! పతగంబులు మింట నూతముల్
దెగి యెటువా లునో యెఱుఁగ దేవుని కేనియు సాధ్యమౌనొకో?

ఉ॥ దేవుఁడు వేదముం గలుగు దేశమునం దవి రెండుఁ బోయినన్
జీవులకుం బ్రమాణ మెది సేయఁగ మానఁగ నెట్టులెట్టులో
భావతరంగమాలికలపైఁ బడి కొట్టుకపోయిపోయి యే
రేవునఁ బట్టునో యెవఁడెఱింగెడి నేనుడి నేడ మున్గునో. ౭

మ॥ కలివచ్చెన్ సకలంబు పోవునని పల్కంబోలదారా! మహా
ప్రళయంబందునఁ గాశికాపురము భద్రంబౌఁగదా యెంతయున్
దలకింపదైనను జ్ఞానబీజములు సద్ధర్మంబులీ భూమిలో
నిలుచున్ వంతులు పోక నిల్వఁడొగిఁ దన్వీరత్నముల్ పూరుషుల్.

---

## 64. చి॥ చుండూరు వేంకటరెడ్డిగారి జన్మదినోత్సవ సందర్భము

శా॥ 'ఆయుష్మంతుఁడుఁ గీర్తిమంతుఁడును విద్యావంతుఁడున్ దక్షుఁడున్
శ్రేయోదాయకుఁ డాప్తపాళి' కని యాశీర్వాదముల్ భూసురుల్
సేయన్, వేంకటరెడ్డి సాధుగురు సంసేవావిలోలాత్ముఁడై
శ్రీ యున్ బుత్త్రులఁబౌత్త్రు లన్ బడసి,యుర్విన్ మించుధన్యాత్ముఁడై.

మ॥ మమతాహంతలుమాని, సద్గురుల సమ్యగీతి ధ్యానించి వి
త్తమునుం బేర్చి, స్వధర్మరక్షకుల కాస్థన్ శాంతమున్ గూర్చి చి
త్తములోఁ గోర్కెలు దుంచి, విష్ణుపదచింతం బెంచి భక్తాళి ను
త్తముఁడై వేంకటరెడ్డి వర్ధిలు శతాబ్దంబుల్ తిలింగంబునన్.

ను॥ గురుభక్తుండవు భాగ్యవంతుఁడవు నీకున్ సాటి యెవ్వార లీ
ధరలో సద్ద్విజమాన్యవర్తనుఁడవై ధర్మంబుఁ దత్త్వంబు నే
మర కెల్లప్పు డుపాధిదోషములు గమ్మన్ బజ్ఞతో నెట్టి శ్రీ
గురు పీఠంబున సాధువృత్తిఁగొని మాకుం బీతిఁ గావింపుమా.

శా॥ వైరుల్ చూడఁగలేక నీ పతిభ దుర్వారంబుగా దూరఁగా
ధీరత్వంబున ధర్మదీక్ష దృఢభక్తిన్ దాల్చినా వీర! నీ
పారంభంబులు సత్ఫలంబు లగు నీ భాండారముల్ నిండు నీ
వారల్ నీవు సుఖింతు నిర్భయముగా భాగ్యోన్నతిం గాంచుచున్.

శా॥ పూజాభాజనమా నవస్థ తన తెంపున్ సొంపునుం గాదటం
చోజల్ సెప్పిరి రామచందు నకు నా యోజన్ జనుం డెంచుచో
నేజాడన్ గనఁ డుబ్బు దైన్యమును దానే లేఁడు తత్తే సుమీ
యీ జీవుండు జగత్తు నీశ్వరుఁడు రెడ్డీ తత్త్వమున్ గాంచుమా.

## శ్రీరామస్తుతి

ఉ॥ జన్నముగాచినన్ జనకజన్ గయికొన్నను గన్నవాఁడు ము
న్నన్నది నిల్పినన్ వని సురారులఁ గూల్చిన వాలి రాల్చినన్
వెన్నడివచ్చు లక్ష్మణు విభీషణుఁ బ్రోచిన నాజిఁ బంక్తికం
ఠు న్నురుమాడినన్ బలమెటుల్ దృఢధర్మమె రామమూర్తికిన్.

శా॥ చెంతన్ సేవయొ దూరమందుఁ దపమో శ్రీకాంత నీ ప్రీతియాఁ
గాంతన్ ద్రుంతువు మంతు సాధ్వికయి యక్కాంతారమం దేతయో
భ్రాంతుండైతి కఠోరగర్భవతి డింపంబంపి తక్కాన నీ
స్వాంతంబున్ గుహుఁడున్ జతుర్థమునియున్ సాంతంబుగాఁ జూచిరే.

శా॥ పెట్టెం బుట్టిన నేలపట్టి యఁట నీపెండ్లామిఁ కా లంకలోఁ
బుట్టుంగాంచినవారు వైరులఁట యబ్ధుల్ దాఁటు నీబంటు తాఁ
బుట్టెం గాలికిఁ బుట్టెజుంగ కఖిలంబు న్నీవయా రామ యా
పుట్టంబుట్టువు పుట్టతేనెవలె జీవుల్ దావఁ బాడెన్నినున్.

మ॥ పురుషుల్ లెక్కయె సిన్ ఋషుల్ గనియు సమ్మోహంబునుం గాంత్రు సుం
దరరామా! నిను వీడ లేకకద సీతాకాంత నీ వెంట దు
ర్భరకాంతారముఁ జొచ్చె నాయమకునై వారాశి బంధించి ము
ష్కరు, దైత్యున్ దునుమాడి లోకములకుం గల్గింతు వానందమున్.

---

## స్వస్తి

క॥ ఈ తోమాలియ నీకున్
జేతః ప్రీతిగ రచింతుఁ జిరతరమగు ప్ర
ఖ్యాతిన్ నీకున్ నాకున్
నీతిన్ బాలకుల కొసఁగు నీరజనయనా. ౧

శా॥ నీవున్నావని యెన్న కెన్నఁడొరులన్ నిర్భీతి వాకుచ్చితిన్
భావంబందునఁ దోఁచినట్టి విలసద్భావుల్ ప్రహర్షింపఁగాఁ

జేవల్ దీరిన యాతతాయులను శిక్షింపం గటాక్షింప నో
దేవా! నీవొకరుండె దక్షుఁడను కీర్తిన్ నిల్పెనో శ్రీపతీ. ౨

ఉ॥ మెచ్చులకై తగాంధ్రము మెరమెచ్చుల దాతలయాత్రఁజూచు కొం
చచ్చులఁగూర్చి పాడెద రహోచిటిగీతలు, సచ్చరిత్రముల్
నచ్చవు నేటికుఱ్ఱలకు నవ్యపథంబుల భావవీథిలో
గ్రుచ్చెద రౌర సూత్రములకున్ వెలిగాఁగ నభఃప్రసూనముల్. 3

శా॥ ఎన్నెభంగుల నందు వొక్కఁడవె నీదేగాదె యీలీల శ్రీ
మన్నారాయణ! నీప చోదనమునన్ మర్యాద పద్యాలలో
విన్నాణంబును గూర్చఁ దెల్పితిని; యీ విశ్వంబు నందేని నే
నెన్నన్ రాదది మంచిచెడ్డ యని స్వామీ సైపుమా పూనికన్. ౪

చ॥ తెలియనిదాననై మనసు దేవరపాదములందుఁ బెట్టి నేఁ
బలుకకయున్న మాధవ ప్రబంధములెన్నియొ మన్ముఖంబునన్
బలికితి పల్కుచుంటి విఁకఁ బల్కఁగనుంటివి కాళి దాసుఁడై
పలుకదె మున్నదెన్నటికి భక్తియొకింతగ దాసురాలికిన్. ౫

శ్లో॥ పద్యమాలా మహామాలా రసామోదానురంజితా
శ్రీపతే! రచితేయం తే హేమసూత్ర సమన్వితా. ౬

గద్యము

ఇది శ్రీ మదమృతానందనాథగురునాథ బోధసుధాబ్ధికన్యాధవ పదాబ్జ
సేవాజనితోభయ భాషాకవితా భూషాలంకృత విద్వత్కవితిలకాయమా
మాన కనక కవితా విశారదావిఖ్యాతతోమాలియాఖ్య
ప్రాస్తావిక పద్యమహామాలామహాకావ్యంబు
సర్వము సంపూర్ణము.
ఓమితి శివమ్



శ్రీకృష్ణానదీతీరమున

నింద్రకీల పర్వతపాదతలంబున

శ్రీ కనకదుర్గాంబా కటాక్షరక్షిత మహాక్షేత్రంబున

శ్రీ విజయవాటికాపుటభేదనంబున

శ్రీతిరుమల శ్రీనివాస

త్రిలిఙ్గ మహా విద్యాపీఠప్రాసాదమున

పంచాయతనాంగి యగు కలినాయకుండు

## శ్రీ తిరుమల శ్రీనివాస దేవరాయని

# ప్రవేశము

కలిగతాబ్దములు ౫౦౪౩

శాలివాహన శతాబ్దములు ౧౮౬౪

స్వస్తిశ్రీ చిత్రభాను సంవత్సర శ్రావణ బ ౩

రాత్రి 2 గం. 10 నిముసములు

**29—8—1942.**

శ్రీభాస్యాయనమః

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యా పీఠ
# నూతన ప్రాసాద ప్రవేశ మహోత్సవ సందర్భమున

## కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారిచే రచింపఁబడినవి

చ॥ విజయము చేసినాఁడిచట వేంకటనాథుఁడు స్వీయసౌధ మం
దు, జయము మితోధికంబుగఁ గనున్ గురుపీఠము ధర్మబీజముల్
విజయునివాడనుండి పృథివీతల మెల్లెడఁ జల్లఁగాఁ బడున్
సుజనులు కార్యదీక్షఁగొని శోభను గూర్పుఁడు కర్మభూమికిన్.

ఉ॥ ప్రాణము లుండుదాక తినరా? మఱికట్టర? నిద్రవోవరా?
మానిన దేది? కాలములు మంచివి కావని స్వీయధర్మముల్
మానుటెకాని ప్రాణములు మానము నప్పనసేసియైన స్వ
స్థానము వేషభాషలును ధర్మము శాస్త్రము నిల్పఁగాఁదగున్.

ఉ॥ గడ్డి యదెంతకోసికొని గంపలు మోసుకపోయి రేనియున్
గడ్డ గదల్పలేరొరులు గానగరాని యమూల్యరత్నముల్
బిడ్డల కిచ్చు దల్లి పృథివిన్ మన భారతభూమి నమ్మినన్
దొడ్డతనంబు వచ్చును బుధుల్ మణులౌదురు దీప్తిబోధమున్.

—("మణిదీపములెల్ల భూమికిన్" అని పాఠాంతరము)

మ॥ అగు నిత్యోత్సవ మిద్ది బ్రహ్మమున కిందా మేళ్ళుకీళ్ళెన్ని యో
యగు కీడల్ మఱి పీడ లజ్ఞులకు నీ వ్యాపారమం దించుకేన్
దగులం బోక స్వధర్మనిష్ఠఁగొని యాత్మారాము లీ కర్మభూ
మిఁ గృతుల్ సేయుదు రార్యసమ్మతముగా మేల్గాఁగ శిష్టాళికిన్.

ఉ॥ నూరు గజాల కాల్వ నొక నూలును వెత్తిగ దాఁటనీళ్ళలో
జారు నిఁకెచ్చుతగ్గుల విచారణ నేమగు? ధర్మదీక్షలో
ధీరుఁడు నెగ్గుఁ దగ్గుదురు దీనులు, ధర్మము ధర్మసూక్ష్మమున్
నేరుపఁ గృష్ణసద్గురుఁడు నిల్పెను ధాత్రిఁ ద్రిలింగపీఠమున్.

---

ఏతన్మహోత్సవాంతఃపాతి

## కృష్ణాష్టమిని

శ్రీమతి కనకాంబగారు చెప్పినవి.

శా॥ నీ పుట్టొందిననాఁడు పుట్టుట యింకన్ నీపేక మానుష్యయున్
నీపేరింటగురున్ భజించుట కదున్ నీ బోధ మందాస్థయున్
నీపై ధ్యానము నిచ్చలున్ గలిమి నీసిర్వ్యాజకారుణ్యమా
నాపై శ్రీపతి నీదు బిడ్డనయి యన్యం బేమియున్ నేగనన్.

ఉ॥ కాలము కర్మమెట్లయిన గావను బోయిను జాలియున్న గో
పాలుఁడు పక్కతోడగుచు భక్తులకుండఁగ జీవ నీకిఁకే
జోలియు నేల? ధ్యానలయశోభనుగాంచుము తోలుబొమ్మకై
యేల భయం బెరుంగవా కొ యిట్టివి పుట్టఁగ గిట్టనెన్నియో.

ఉ॥ గాలికిఁ బోవుమాట కలకాలము నిల్చును బీక మొండ్లకై
వేలుపులన్ యజించుటయుఁ బెద్దలసేవయు మానుకొందురే
చాలగ దొంగలుందు రని సస్యము నాటరె కర్షకుల్ స్వభా
వాలవి మాఱ వెన్నటికి భవ్యుల కేని యభవ్యపాళికేన్.

శా॥ తాదాత్మ్యం బిడు సంతతంబు నది కాదా నీదు పాదాబ్జముల్
నీ దాస్యంబును దర్శనంబు మఱియున్ నీయాటలున్ పాటలున్
నీ దివ్యామృతబోధమున్ వినఁ గనన్ నిత్యంబుఁ గల్గింపు నా
కో దేవా మది నిన్నె నమ్ముకొని యిట్లున్నాను నీదాసనై.

చ॥ నరునకు దత్త్వమున్ రణగుణధ్వను లెల్లెడ మ్రోగుచుండఁగా
గురుఁడయి తెల్పియుంటి హరి! క్షోభము లెన్నియు నున్ననేమి ని
బ్బరముగఁ దత్త్వ మారయుచుఁ బండితుఁడుండును యుద్ధమన్న నం
గరమొకొ కామ ముఖ్యరిపుకాండము గెల్చుటె, మృత్యువాగుటే.

---

## శ్రీ. తి. శ్రీ. తి. మ. విద్యాపీఠము.



సీ. కలవిశ్వమంతటఁ గర్మార్హమైనట్టి
మర్త్యలోకంబె సమ్మాన్య మందుఁ
దత్త్వాంధమై యున్న ధరణికిఁ బెనుదివ్వె
గా వెల్గు భారతఖండమందు
నధ్యాత్మవిదులు సదాచారఘనులచే
దీపించు నీ యాంధ్రదేశమందుఁ
గలినాయకుండు వేంకటనాథుఁడుండు స
ద్ధామంబు శేషభూధరమునందు

గీ. భోగిరాడ్భూషణాంచితమ్మను దిరుమల
శ్రీనివాస త్రిలింగాభిధానపీఠ
మిది మహావిద్యఁ గాంక్షించు నెల్ల భక్త
వరులు సేవింపఁ దగినట్టి పరమపదము.



శ్రీ భాష్యాయ నమః

# తోమాలియ - అనుబంధము

శ్రీ తిరుమల శ్రీనివాస తి లింగ మహా విద్యాపీఠములో
అమృతానంద నాథ జయంతి సందర్భమున
మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ ఆంధ్రవ్యాస కవిసార్వభౌమ
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు చెప్పినవి.

మ॥ అజరుండై యమృతుండునై యమలుఁడై యానందనాథుండునై
యజరుద్రాంచితకృష్ణభూషణమునై హార్ద్యేందు బ్రహ్మంబునై
త్రిజగద్వంద్యపదాభిషిక్తుఁడగుచున్ దీపించు మా దేశికున్
నిజహృత్పద్మమునందు నిల్పి సతమున్ సేవించి భావించెదన్. ౧

చ॥ తన వరసౌధమందు గురుదైవసమంచితసత్యపీఠమున్
మునిజనసంప్రదాయమును బోషణఁజేసి గురూక్తపత్తిన్
బొనరిచి మూఁడుపొద్దులను బూజలొనర్చుచుఁ బుణ్యవిగ్రహం
బనఁదగి ధన్యయైన కనకాంబ కెసంగుఁ జిరాయురున్నతుల్. ౨

శా॥ ప్రత్యూషంబున లేచి స్నానమును దేవబ్రాహ్మణారాధన
ప్రత్యాహారవిహారముల్ సలుపుచున్ వ్యక్తి మున్ గాంచనై
నిత్యైశ్వర్యముఁ గొన్న మేటియయినన్ నిర్లిప్తయై జీవునిన్
సత్యాన్వేషణచేయు మా కనకమన్ వర్ణింతు బ్రహ్మంబునాన్. ౩

చ॥ కనకమయింటిపేరఁ గనకమ్మ తనర్చు నిజాహ్వయంబునన్
గనకమ చిత్తశుద్ధిఁ గనకమ్మ గుణమ్మున నాగనొప్పు మా
కనకమ సత్కవీశ్వరులకంఠవిభూషణమై మహోన్నతిన్
వనజదళాయతాక్షునికృపన్ మనుఁగావుత నూఱువర్షముల్. ౪

క॥ గీతాశాస్త్రము వెనుకన్, సీతారామాంజనేయచిరసంవాద
ఖ్యాతగ్రంథం బిప్పుడీ, భూతలమున జీవయాత్రఁ బోలుం బొగడన్. ౫

ఉ॥ పద్యము లెల్ల హృద్యములు పండితపామరవేద్యముల్ పవి
త్రోద్యమబోధకంబు లన నొప్పెడు నెప్పుడు నాత్మచింతయే
విద్య యటంచుఁ జెప్పు గుణవిశ్రుతురాలల కాంచనాంబ, కా
వ్యాద్యముగా రచించిన మహత్తరతత్త్వము జీవయాత్రలోన్. ౬

కింకవీంద్ర ఘటాపంచానన కళాపరిపూర్ణ, మహాకవి

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, శతావధాని.

మ॥ తన సౌధము నం బీఠము న్నిలిపి నిత్యం బేడుసారుల్ కృపా
ఖని శ్రీ వేం టనాథు నర్చితునిఁగాఁ గావించుచుఁ వేంకటా
ద్రినివాసున్ స్ఫురియింపఁజేసెడి కృతా భూత సత్కావ్యవ
ని శ్రీమత్కనకాంబ భక్తి మిగులన్ ధన్యంబు కామేశ్వరీ. ౧

మ॥ గురువాక్యంబుల సారమున్ సకలముం గ్రోడీకరించెఁ గవి
త్వరసం బొండొక తోడుచేసి భగవద్దాస్యంబుతో విద్వదా
దరముం బూని యొనర్చు సత్క్రతులతో దంభానపేతంబుగా
జరపున్ మా కనకాంబ జీవితము మెచ్చన్ జెల్లుఁ గామేశ్వరీ. ౨

శా॥ తాతాశాస్త్రియు దెందుకూరి కులవిద్వన్మౌళి శ్రీపాదవి
ఖ్యాతశ్రీనరసింహశాస్త్రి మఱియున్ గవ్యగ్రణుల్ పీఠపున్
ఖ్యాతిం జెప్పఁగలార లీ బుధుల నాకారించి నూత్నార్థచే
నీ తన్వీమణి గారవించె వినియుంటే తల్లి కామేశ్వరీ. ౩

మ॥ పలువు ర్పండితు లేగుదెంచి కనకాంబాసౌధరాజమ్మునం
దలి శ్రీవేంకటనాథుసన్నిధిని శాస్త్రంబుల్ ప్రసంగించు న
య్యేలమిన్ గాంచిన గద్దువాలపురసాదృశ్యంబు నా నెమ్మదిన్
గలయంబ్రాకి స్ఫురించె నద్దికద భాగ్యం బన్నఁ గామేశ్వరీ. ౪

మ॥ కవితల్ సెప్పెడి స్త్రీలు మున్నె కల రకాంతల్ కవిత్వమ్మునన్
స్వవివేకము నె చూపి రీ కనకమాపాండిత్య మల్లంతఁ బో
క విశేషించి విచక్షణత్వమునకుం గాణాచియై సర్వమా
నవకల్యాణము గోరి వర్తిలుట ధన్యంబయ్యెఁ గామేశ్వరీ. ౫

శా॥ యావ వము విద్వదర్చనకు శ్రీహర్యంఘ్రిపద్మార్చకున్
దాపై మా కనకాంబసౌధము ప్రసిద్ధంబౌత మం చే నిదే
దీవింతున్ జననీ "తథా" స్తనుము నా దీవించుటల్ సా క
శ్రీవాసించుత నింతమాత్ర మిడుమీ చేయూఁత కామేశ్వరీ. ౬

ఉ॥ పాత్రము లెన్నియో గల వపూర్వవిశేషములందు నందు వి
ద్వత్తములైన వారలకుఁ దద్దయు బోధ్యము లౌచునుండు నీ
విత్తముగల్గు పాత్రములు పృథ్విని మృగ్యములౌట దీనికిఁ
విత్తములైనవారలు వివేకముమై నతి సేయుటొప్పగుఁ. ౭

గీ॥ పేరు జీవయాత్ర ధోరణిసరిళంబు, తప్పు గానరాదు తత్త్వమెల్ల
యెడల వేద్య మిట్టి యెడఁద యే సాధ్వికిఁ, గలుగుఁ బున్నె మెంతొ సలుపకున్న. ౮

ఉ॥ ఈయమ పాండితీగరిమ మీయమ జ్ఞానవిశేష మీమహా
ధీయుతురాలి వర్తన విధేయత యోగ్యత నీతియుక్తి యాం
గ్లేయకళాప్రవిష్టత మలీమసకార్యపరాఙ్ముఖత్వముల్
ధీయుతు లీ కృతిం గనినఁ దెల్లముగాఁ బొడకట్టు సర్వముల్. ౯

ఉ॥ కావున విస్తరింపక యిఁకన్ విరమించెదఁ గబ్బ మిద్ది స
ద్భావులకున్ ముదంబిడుచు భావికలార్థుల భాగ్యరాశియై
యీవిపులన్ యశమ్ముఁ గని యెల్లెడలన్ జయమందుఁగాక యీ
కోవిదురాలిపుట్టువునకున్ ఫల మబ్బెడిఁగాతఁ బూర్ణమై. ౧౦

గీ॥ ఇట్టి దుర్భిక్షకాల మందెపుడొ పూర్వ, ముపనిషత్తుల వినఁబడు నువిదల తల
మానికంబును బోలిన మగువ యొకతె, పుట్టె మనభారతీయులపుణ్య మనఁగ. ౧౧

చ॥ కలిమికిఁ దానకంబయిన కాంచనపల్లి కులంబునందుఁ గాం
తల తలమానికంబయి తనర్చెడి రంగమకున్ మహాతపః
కలితుఁడు రంగనార్యునకు గాదిలికూఁతురుగా జనించె జ్ఞా
నులకును నక్కజంబు మది నూల్కొనఁజేయు వెలంది పేరిమిన్. ౧౨

---

## విమర్శకాగ్రేసర బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుసామయ్య గారు.

క॥ ఆద్యులపద్యముల ట్లన,వద్యములై సుకవినికరవంద్యములై నీ
పద్యము లాస్వాద్యములై, హృద్యములై ముదముఁగూర్చు నెంతయు నింతీ! ౧

క॥ భవ్యంబై లలితపద, స్తవ్యంబై వఱలు సుజనసంసేవ్యంబై
దివ్యంబై పండితసం,భావ్యంబై నీదుకృతులు మహిఁ గనకాంబా! ౨

చ॥ విమలములైన భావములు విశ్రుతమై తగురీతు లార్యవం
ద్యములగు వృత్తులున్ నయనిధానములైన గుణంబులున్ మనో
జ్ఞములగు వాగ్విలాసములు చక్కనికాంతులు సొంపుమీఱు న
త్తమసతిలీల నీదు కవితాసతి చెన్నలరారు నమ్మరో! 3

క॥ నీరీతిఁ గవితచెప్పెడు, నారీతిలకముల నేఁ గనన్ గనకాంబా ౪
హారియశోవిభవంబులు, మారమణుని దయను జెందుమా మహిలోనన్.

సీ॥ బొండుమల్లియపూలదండలో సంతాన, కుసుమంబు లందందుఁ గూర్చినక్రియ
నచ్చంపుఁదెలిముత్తియపుఁజేరులో మానికంబుల నెడనెడఁ గలుపుకరణి
శర్కరాయుతపాయసంబునఁ దీపారు,పనసతొనలఁ బొందుపఱచినట్లు
కమనీయధవళచేలమునఁ దళ్కుల పైఁడి, జలతారురేఖలు నిలిపినగతి

తే॥ రుచిరసరసాంధ్రపద్యాళి నచట నచట, దేవభాషావినిర్మిత దేవతాస్త
వాంచితశ్లోకములు కొమరారు నీదు, వినుతకవితారసాలంబ, కనకమాంబ! ౫

క॥ ఘనభక్తియు వైరాగ్యం, బును లలితముగాఁగ నిండుఁ బొలుపారుటచే
వనితామణి! నీకావ్యము, వినుతింపందగును గాక విప్రవరులకున్ ౬

క॥ మధురము వర్ణితవిషయము, మధురతరము నీదు పలుకు మంజులవాణీ
మధురతమము నీరచనా, మధురిమ నీకావ్య ముత్తమంబయి వెలయున్. ౭

క॥ ఇప్పగిదిని నీ కబ్బముఁ, దప్పక పఠియించి ముద మెదం జిగురొత్తం
జెప్పితి హృద్గతభావముఁ, గుప్పుస్వామ్యార్యనామకోవిదహితుఁడన్ ౮

---

## అభినవశిక్షణ, సాహిత్యస్థాపక, బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు,
## నెల్లూరు.

మ॥ కవయిత్రీమణివంచు నిన్నుఁ బొగడంగా వత్తునో లేక బ్ర
హ్మవిద ప్రియుఁడు కృష్ణభూషణుని శిష్యంగాఁ బ్రశంసింతునో
చవి బాల్యంబుననుండి సత్కవిత కిచ్చున్ గొన్న నీ బు వై
భవ మగ్గింతునో? తోఁపలేదు కనకాంబా, సాధుపూజాప్రియా!

చ॥ అతిగహనము లైన పరమా ములన్ విశదంబు సేయు ధీ
చతురత, శంకరార్యునకు సాటియనం దగు నొజ్జ త్వత్పురా
కృతసుకృతైకపాకమున నెట్లొ లభించె, మఱేమి వింత నీ
కృతులు తదీయబోధసుధ నెల్లెడఁ జిల్కు నన్ యశస్వినీ.

మ॥ అతిలోకప్రతిభుండు లోకనుతిగర్వాల్ రెండు తుల్యంబుగా
మతి భావించిన తత్త్వవేత్త యుపమామార్గంబునన్ భక్త సం
తతిశంకల్ తృటిలోఁ దొలంపఁగల విద్యాశాలి మీయొజ్జ వా
క్తతి నేఁడున్ నను ముగ్ధఁ జేయు సుచరిత్రా! నెమ్మదిన్ బర్వినన్.

చ॥ పదిపదునైదువర్షముల పాటి యెలర్చిన నెయ్యమున్న నే
యదనుననైనఁ జెప్పుకొనఁ డయ్యె నిజోన్నతపూర్ణదీక్షు, న
య్యది యిపు డెట్టులో విదిత మయ్యెను దావక "జీవయాత్ర"చే
సుదతిరో! ధాత్రి నీగురుయశోవిముఖత్వ మెఱేనిఁ గంటిమే.

చ॥ అమృతునిపాదసారసము లంటిన శిష్యవటంచు తద్గురూ
త్తము నుపదేశసారసుధ ధాత్రికిఁ బంచిన ధన్య వంచు, నె
య్యమునను నీకు మొల్లమజయంతితతిన్ 'గృహలక్ష్మి' పూజనం
బమరుచువేళఁ జెప్పె నివి యాప్తుఁ డొకండు గ్రహింపు ధీమతీ!

---

# సింహపురి బాలికాపాఠశాలోపాధ్యాయ పదవి వదలికొని మద్రాసున ఆంగ్లవిద్యాభ్యాసము సేయఁబోవు కనకాంబగారికి

## వీడ్కోలు పద్యములు

బాలికల ప్రార్థనపై

**అభినవతిక్కన, దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు రచించినవి**

**1913**

సీ॥ తన బోధమహిమ నే తరుణి కష్టంపుఁ బాఠములను సులభసాధ్యములఁ జేసె
తన ప్రవర్తనల నే తల్లి చెప్పకయె సద్గుణములు మాకుఁ జేకూరఁజేసె
తన శేముషీమహత్త్వమున నే జనయిత్రి యాంధ్రసాహిత్యమ్ము నందఁగలిగె
తనతోడి యమ్మలఁ దనయడంకువకుఁ జిత్తముల నే తన్వి సంతసిలఁజేసె.
తే॥ అట్టి కనకాంబ యాత్మ విద్యాభివృద్ధి, కోఱకు మము వీడి యల చెన్నపురికిఁ బోవు
నను నుదంతమ్ము స్వాంతమ్ములందు మాకుఁ, జింతయును హర్షమును దారసిల్లఁజేసె.

మత్త॥ నాలుగేండ్లుగ మమ్ముఁ గూడి యనంతరీతుల మా కొగిన్
మేలొనర్చినతల్లి నే క్రియ మేము విస్మరియింపఁగాఁ
జాలువార మిఁకన్ బరీక్షలఁ జాలఁ దేరియు నీమె యీ
ప్రోలికే యరుదెంచి యుంచునె పొందుగాఁత మహోన్నతిన్.
తే॥ సత్యమును శాంతికలనయుఁ జాలగల్గి, ఓర్పునకుఁ బుట్టినిల్లయి నెవ్వపట్ల
నధికసామ్యమును జూపునట్టి నిన్ను, మఱవవచ్చునే? మా కెన్నిమార్లకైన.

చ॥ తెనుఁగున నేవిధంబునను ధీరత నీ వలరించుకొంటివో
వినుతగుణాఢ్య! యవ్విధినె విశ్రుతమౌ నల హూణభాషయుం
దును సముదారశక్తి యది తోడనె నీ కొనఁగూడ కుండునే
కనుఁగొన సూక్ష్మశేముషి యొకండెగదా! కళ లెన్నియైననున్.

మ॥ జననీ! నీపయనంబు సౌఖ్యకరమై సంధిల్లి నీపోవుచో
ట నితాంతంబు జయంబు కల్గుటయు వేడ్కన్ నీ కనారోగ్యమెం
దును జూపట్టక యుంటకున్ మనములందున్ బూర్ణభావమ్ముతో
ననయం బీశ్వరు సంస్మరించెదము! నెయ్యం బుంచుమీ మాయెడన్.

---

కోరాడ రామకృష్ణయ్యగారు, యం. ఏ.
మద్రాసు విశ్వవిద్యాలయమునందు బ్రధానాంధ్ర పరిశోధకులు

క॥ కనకాంబా విరచితకృతి, వినుతానందరససార విఖ్యాతిని బొం
దును గాదె ముముక్షువు లెల్లనుఁ గ్రోలరె కావ్యరసము బ్రహ్మము మున్ట్లన్. ౧

---

మధ్వ శ్రీ శతావధానులు, సాహిత్యస్థాపక, కాశీ కృష్ణాచార్యులుగారు

ఉ॥ కాంచనపల్లివంశతిలకంబగు నో కనకాంబ! నీ కృతిన్
గాంచితి దానిలో రసము గాంచితి. నీవలె నిట్టికైతలన్
గాంచిన కాంచనాంగులను గాంచుట దుర్ఘటమంచు విస్మితిన్
గాంచితి నీదు భక్తికి నఖండవిరక్తికిఁ దృప్తి గాంచితిన్.

---

బ్రహ్మశ్రీ కురుగంటి సూర్యనారాయణశాస్త్రిగారు.

ఉ॥ తూచిన మోచ కిద్ది సరితూగురసం బది శాంతమౌర నేఁ
జూచితి జీవయాత్ర పరిశోధనగాఁ బ్రతిపద్య మెందుఁ దా
ల్దోచను స్వస్వరూప మవలోడన సేయు తదైక్యభావనా
సూచన లింపులొల్కఁ గనకసూక్తులు ముక్తికిఁ దావలంబగున్. ౧

ఉ॥ కాంచనపల్లివంశమునఁ గాంచినమౌక్తికరత్నమాల యీ
కాంచనగాత్రి ధీపరమ కాంతి తమోహరమౌచు జీవదే
వాంచితసచ్చిదైక్యరమ వన్నె సేసిన జీవయాత్ర ప్రా
పంచిక ముంచుదాకఁ గ ళవాసిగ నుండుతఁ గీర్తిభాసిలన్. ౨

---

కవితిలకబిరుదము

అగ్రాసనాధిపతి, బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు.

మ॥ జననంబందితి సత్కులీనకులమునన్ సత్స్వప గావించి పెం
చిన కైతన్ పరమాత్మసాత్కృతిగ వాసిన్ సర్వ మర్పించి స
నమాన్యత్వము గాంచి శాశ్వతయశస్సంతాన మార్జించి తో
నకాంబా! సతులందు నీ కుపమ కంబందు లే దెందునేన్. ౧

శా॥ కాశీనాథునివంశదీపకుఁ డనంగా నెందుఁ బెంపొందు నా
గేశుం డేనును శ్రీపదాన్వయుఁడు శ్రీకృష్ణుండులోనా సుధీ
వైశంపాయనులట్లు నీదుకవితన్ వర్ణించు నాఁ డిచ్చు నా
యాశీర్వాదము చాలదే సుకృతి బ్రహ్మానందమున్ జెందఁగన్. ౨

క॥ ఉవిదకుఁ దిలకముకన్నన్, బ్రవిమలభూషణము లేదు ప్రారబ్ధమునన్
దవుల దది నీకుఁ బోనీ, "కవితిలకమ" పైతి నాత్మకళ్యాణము గాన్.

## శతావధాని దోమా వేంకటస్వామి గుప్తగారు.

ఉ॥ కాంచనపల్లివంశము నిఁకన్ గనకాంబిక పేరు నల్లభో
ధాంచితురాలి సత్కృతి సమంచితమంచును నిర్ణయింపఁగా
నంచితుఁ డిందు శాణఫల కాకృతి వేంకట సత్కవీంద్రుఁడే
మించె నిఁకిందుఁ దేలఁగల మేల్మితనంబున సందియంబొకో.

---

కవితిలకప్రశంస

## విద్వాన్ మధురకవి దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు.

మ॥ కవితల్ చెప్పినఁ బాడనేర్చిన వృథా కష్టంబె చిత్తంబు త
త్త్వవిచారం బొనరించు భాగ్యమె యలభ్యంబైనచో జాప్యరే!
కవనం బంతయుఁ దత్త్వచింతకె సమగ ప్రజ్ఞ వెచ్చించు భా
గ్యవిశేషం బలరారె నీకు, కనకాంబా యెంత సన్మాత్మవో! ౧

చ॥ అమృతమయంబు నీ హృదయ మార్తజనావనవిద్య నీకు ని
క్రమము సహజమ్ము ప్రాజ్ఞపదకంజసమర్చ యనన్ నిసర్గతా
నమలగుణమ్ము లెల్ల నొకఁడై నినుఁ జేరఁగఁబోలునమ్మ యు
త్తమ మగు వర్తనమ్మున కుదాహృతి నీ చరితంబు చిత్రమా. ౨

సీ॥ కావ్యకల్పనఁజేయఁ గల కళాభిజ్ఞత, అనువాద మొనరించునట్టి నేర్పు
తత్త్వమ్ము గుఱుతింపఁ దగిన విజ్ఞానంబు, తెలిసినయంత బోధించు ప్రతిభ
జంకు గొంకునులేని స్వాతంత్ర్య సంపత్తి, పండిత వినుత సంపత్సమృద్ధి
సత్కారములు గొనఁజాలిన యోగ్యత, సత్కారములు చేయఁజాలు శక్తి
నేటి కవితాప్రపంచాన నీకె చెల్లె, నీవు గడియించినట్టి నిర్మిదకీర్తి
యరయ త్రిలోకమునకు జయధ్వజంబు, కమ్రగుణరత్నావలంబ! శ్రీ కనకవాంబ! ౩

క॥ పరదూషణ పరభూషణ, పరతన్ గవనంబు వ్యర్థపరుపక పరమే
శ్వరచరణ స్మరణమునకె, గురిచేసెన్ గనకమాంబ సుకవయిత్రీ. ౪

---

## సంగీతసాహిత్యచక్రవర్తి, ఆదిభట్ట నారాయణదాసః

14-6-41

శ్లో॥ శ్రీగోలకొండ వ్యాపార, మహీసురకులోద్భవా,
కాంచనపల్లీ కనకాంబా, ప్రత్యక్షసరస్వతీ.

—♦ తరువోజ ♦—

కాంచనపల్లి కనకమ్మ చదువరికన్నాకు మిగులచక్కని తెల్గుపల్కు
లెంచికూర్పఁగఁ జాలునెంతేని వేల్పునెల్లపుడుం గొల్చునెఱుఁగదు టెక్కు
మంచినడువడికి మచ్చెవరైనమాటికి హాయిగా మనఁ గోరుచుండు
మించనాడదు కలిమిన్ వందయేండ్ల మేర నాదీవనం బెంపొందుగాత.

—♦ విరిబంతి ♦—

మాటలల్లెడుతీరు మైలాగుసౌరు,
పెట్టనితొడవు లీపెకు మంచిపేరు.

---

## నాటకచక్రవర్తి, విద్వత్కవి, మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు.

సీ॥ పోతనామాత్యుని పోకడ భక్తిలోఁ, బ్రాతదా యనిపించు పట్టు లోకట
తిక్కన మంత్రి యీ తెలుఁగుతేటఁగ శాంతి, వ్రాసెనా యనిపించురచన లోకట
బాణునినోటిలోఁ బడక డాగినశబ్ద, జాలమా యిది యను (సరణు) స్థలము లోకట
బ్రహ్మసూత్రా తాత్పర్యమందలి సార, సరణు లింతియ యను స్థలము లోకట
నమరియున్నవి గనుఁగొన్న హంసవిజయ, రూపకంబున హంసస్వరూపమనుచు
జెప్పవచ్చును నిక్కంబు సిద్ధగురుని, మహిమ గాకున్న కృతియింత మహము గనునె.

గీ॥ శారదాసత్కృపాసారసార మనఁగ, చెలఁగి చెలువొందుగాదె యీ జీవయాత్ర
గురుకులంబునఁ గ్రమశిక్షఁ గఱచియున్న, శిష్యసంతతి గనఁదె సవయాత్ర.

---

## బ్రహ్మశ్రీ శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి కవి గారు

మ. అమృతానందపదైక చిత్తవయి దీవ్యత్కావ్య పాత్రంబులం
దమృతానందరసంబులన్ దివిబుధసేవ్యం బొనటుల్ చేసి లో
కము మన్నింపఁగ శీలసంపదలు వెల్గన్ సద్గురు ప్రాప్తత
త్త్వ మహాభాగ్యము గన్న యోకనకమాంబా తేర్చుమా ధర్మమున్.

---

## కవయిత్రీమణి గుడిపూడి ఇందుమతీదేవిగారు, విజయవాడ.

పేరు కనకాంబ మతి యింటిపేరు కాంచ,నంబు లోక ప్రసిద్ధమైనది దలంప
ఉన్నతోద్యోగపదవి మీ కొసరెఁ గనక, కల్పలత బుధపాళికిఁ గావె నీవు.
నాకధునీ జీవనముల్, గాకుపఱచు జీవయాత్ర గంభీరగతిన్
నీకవితా మధురిమ మ,స్తోకానందంబునున్ బుధులకే నొసఁగున్.
గురుని దయయును వేంకటేశ్వరుని కరుణ, బుధజనాశీస్సు లెవ్వేళఁ బ్రోదిసేయ
సమ్మతభావనపాళియై యమృతమగుచుఁ, దనరుఁ గనకాంబయాచంద్రతారకముగ

---

## పండిత పులగుర్త లక్ష్మీనరసాంబగారు, కాకినాడ.

హంసవిజయదర్శనము

తే॥ పరిమళించు మేల్ బంగరు పలుకుఁగముల, నైహికాముష్మికఫలంబు లందఁ జేయు
హంసవిజయంబుఁ గంటిధన్యతను గంటి, నలవియగు నంత చిత్సుధ నానుకొంటి.

చ॥ చిగురులఁ బూలఁబండ్ల బహుజీవహితంబగు భూజరాజమ
ట్లగణిత ధర్మబోధనల హంసజయం బగు నీదు సత్కృతిన్
దగిలి రసానుభూతి సుఖదంబుగ సత్కవిరాజ సంతతుల్
గగనము ముట్టఁజేయు కలగానము వింటిని దృక్శ్రవంబులన్.

ఉ॥ అద్దిర మేలు ! నీపరమ హంససుశీల విశారదత్వముల్
విద్దెలు దిద్దుబాటులును వింతలు వేడ్కలు జీవలీలలున్
అద్దముఁబోలు నీ విజయహంసమునం గని విశ్వరూప మ
ట్లెద్దియుఁ జేయ నోడితి నికేమని చెప్పుదు నీదుసత్కృతిన్.

తే॥ సకల భారతసోదరీ సంఘమందు, నాంధ్రసోదరీ ప్రతినిధివై వెలుంగు
నీకు నీ బహుసత్కృతి నిచయమునకు, నెల్లశుభములు శ్రీరాముఁ డిచ్చుఁగాత.

---

## సాహిత్యస్థాపక వాజపేయాజుల రామసుబ్బారాయుఁడుగారు

ఉ॥ నీవు కలంబుచేతఁగొని నేర్పెసఁగంగఁ గవిత్వతత్త్వ సు
శ్రీ విలసిల్లఁ బ్రాజ్ఞగుణరీతులు చిల్కఁ రచింతు వెంతయున్

దావి జనించు నీదు కవనంబున నింతటి భాగ్య మబ్బఁగా
నే వరమందినావొ గణియింపఁగ శక్యమె యేరికైననున్.

ఉ॥ దేవనదీప్రవాహము గతిన్ విమలంబగు నీమనంబు నీ
భావముఁలున్ గుణంబులును బావనమైన చరిత్రయున్ మహా
భావులు మెచ్చు దానమును భక్తియుతంబగు తత్త్వశీలమున్
దైవవితీర్ణముల్ దలఁపఁ ద్వాదృశు లేరి ధరాతలమ్మునన్.

సు॥ పలుచోట్లన్ వినుచుంటి నీదగు గుణవ్రాతంబు సత్కీర్తియున్
విలసత్ప్రాభవ వైభవోన్నతులచే వేవేగ వర్ధిల్లుమా
యెలమిన్ సత్కవితాసరస్వతివియై యేపారు మాంధ్రావనిన్
గలుగున్ నీకుఁ జిరాయురున్నతులు నెక్కాలమ్ము స్త్రీరత్నమా.

---

## బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు, విద్వాన్.

తే॥ తత్త్వబోధ రహస్యముల్ దఱచి తఱచి, తేట తెల్లంబుగా ముద్దు తెలుఁగునుడుల
నిలిపి యవతార సామ్యంబు నిలుపుకొన్న, అమ్మ! కనకాంబ! సాష్టాంగమమ్మ నీకు.

---

## కవితాకళానిధి బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు.

చ॥ కవితిలకాంచితంబయిన కాంచనపల్లి కుటీరమందు భా
ర్గవి కొలువుండి కోడలు సరస్వతి గాన కవిత్వముల్ త్రయీ
శివిధరహస్యముల్ నుడువ వించు ముముక్షులు గొల్వ సంతతో
త్సవములతోడ నారవిసుధాకరతారకమున్ రమించుతన్.

---

## బ్రహ్మశ్రీ పండితరాజ దంటు సుబ్బావధానులవారు.

ఉ॥ పుట్టితి నందబాలకుఁడు పుట్టిననాఁడు మహానుభావవై
పట్టితి సద్గురూత్తముల పాదము మోదముతోడ మున్మునుల్
ముట్టిన మోక్షసత్పథముఁ బొందితి విద్దర బొందితోడ నీ
పుట్టువు సాకంబని కవుల్ వొగడన్ గనకాంబ వింతయే.

---

శ్రీభాష్యాయ నమః

# తోమాలియ



## ఆమోదము

శ్రీ తోమాలియ యను ప్రాస్తావికగ్రంథమును రచియించిన కవయిత్రీమణి కవితిలకాయమాన యగు కాంచనప కనకాంబగారు. నానావిధ పర్ణపుష్పములతోఁ గూర్చిన మహామాలికను "తోమాలె" యందురు.

అట్లే యాయా ప్రస్తావములయందుఁ గవయిత్రి రచించిన పద్యమాలికలతో రచించిన మహామాలయే యీ 'తోమాలియ' యను పొత్తము.
కైసేత = కూర్చుట. తోమాలియను గట్టుట.

### పద్యములకు లఘు టీక

1. తాను గూర్చిన తోమాలియ లక్ష్మీనాయకునకుఁ గవయిత్రి సమర్పింపఁగా నది ధీమంతులగు భక్తులు ప్రసాదముగాఁ గంఠమున ధరింతురనియు దాని వాసనలు బుధులకు సంతోషమును గలుగఁజేయు ననియు నీ పద్యమందలి భావము.

2. ఆఁడుపుట్టువులకుఁ బుణ్యవశమునఁ గాని విద్య లభింపదు. అట్టి విద్య యలవడిన వారు వినయముతో గురువులను సేవించుట యరిది. గురువుల భజించినను సత్కావ్య రచనా సామర్థ్య మబ్బుట దుర్లభము. అట్టి సత్కావ్యము భగవదర్పితముగా నిర్మించి మహనీయులకుఁ గానుక వెట్టుటను గురించి యింకేమి వచింపనగును? ఇట్టి యసాధారణసంపదలు గల కవయిత్రి 'నీరజేక్షణా విజ్ఞులు దీవన సేయ నెట్టులో నెట్టుచునుంటిఁ గాలము' నని చెప్పుకొనుట ప్రపత్తిలక్షణము. "పుట్టితి నాఁడుదాన నయి" అని వ్రాయుటచేఁ బుట్టువుచేఁ దాను స్త్రీయయ్యు బాల్యమందే తటంచిన వైధవ్యరూపమగు సన్న్యాసము చేకూరుట నాఁడువారికిఁ జెప్పఁదగిన సాంసారిక సంపద యేదియు లేదనియు, విద్యాసంప్రాప్తి, గురుదర్శనము, కావ్యరచనము మొదలగు నవియే విశేషములుగాన నవియే వర్ణింపఁబడినవనియు భావము.

## 1. అంబాస్తవము.

కీ. శే. మంగు రామానుజరావుగారు. వీరు కొంతకాలము బందరులోఁ గొంత కాలము నెల్లూరులోను న్యాయవాదిగా నుండిరి. ఆంధ్రగీర్వాణములయందుఁ జక్కని సాహిత్యము గలిగి కవితాసందర్భములు ఛందస్సు నెఱింగినవారుగా నుండిరి. కనకాంబగారికి బాల్యమునఁ దొలుత నాంధ్రభాషాలక్ష్యలక్షణములు నేర్పిన యాప్తులు వీరు.

డ్రిప్ డేలు:—ఈ యాంగ్ల యువతీమణి చెన్నపురిలో బ్రాహ్మణ వితంతు శరణాలయము స్థాపించి యందు మతాచారానుసారముగా నేర్పాటులు గావించి కవయిత్రి బందుగుల యనుమతిఁ బడసి యందీమెను బ్రవేశపెట్టి యాంగ్లవిద్యఁ జెప్పించినది.

3. నృసింహాచార్యపండితుఁడు:—మహాభాష్యసింహాసన మను నన్వ నామముగల విద్వద్వంశమున నవతరించిన యీ మహనీయులు చెన్నపురిరాజధాని కళాశాలలో నలువది సంవత్సరము లుపాధ్యాయవృత్తి నుండిరి. చెన్నపురి శ్రీ పార్థసారథిస్వామి సన్నిధి వీథిలో వీరు తొంబదియేండ్లు జీవించి పరమపదించిరి. కవయిత్రి సంస్కృతసాహిత్యసంప్రదాయము వీరియొద్దనే యభ్యసించెను.

4. విజ్ఞానసంఘముల్:—విజ్ఞానచంద్రికాగ్రంథమాల యను పేర నొక సంఘము జ్ఞానప్రచారమునకై యాంధ్రదేశమునఁ గనకాంబగారి బాల్యమున వెలయుచుండెడిది. ఆసంఘము పురుషులకు స్త్రీలకు వైజ్ఞానికపరీక్షలు నెఱపి యందుఁ బ్రథమస్థాన మలంకరించిన వారిని బహూకరించి ప్రోత్సహింపుచుండెను. ఆ పరీక్షలలోఁ గవయిత్రి యగ్రగణ్యాగా నుత్తీర్ణురా లగుటచే నొక సంవత్సరము రెండు నూటపదార్లు, నాలు బంగారుపతకములు సంఘమువారొసంగిరి.

ఆంగ్లేయవిద్య నింటరు మీడియేటు పరీక్షవఱకుఁ జదివి యప్పటికే యుదయించిన నివృత్తిమార్గేచ్ఛచేఁ గవయిత్రి విద్యాభ్యాసోద్యమమును విరమించుకొని పరమార్థసాధనకై యోగమార్గ మవలంబించుకొనుట యెఱింగి డ్రైసుడేలు దొరసాని యిట్లనియె.

"నీకొఱ కెంతయో శ్రమపడి యాదర్శప్రాయమగు విద్య నభ్యసింపఁజేసితిని. నాకష్ట మంతయు వ్యర్థముచేసి నీవు విద్యాభ్యాసము మానుట నా కెంతయు విచారకరము?" "ఆర్యవిజ్ఞానము కన్న నాంగ్లవిజ్ఞానమున విశేషములు లేవు. నా కింక స్వధర్మానుష్ఠానమునకు విరుద్ధమగు పరిస్థితులలో నుండు టిష్టములేదు. నేను సన్న్యాసిని. నాకుఁ గావలసిన తత్త్వవిచారముతోఁ గాలము గడపెద నని కవయిత్రి చెప్పెను. అందుల కాదొరసాని యేమియుఁ జెప్పలేక 'మాపాఠశాలలో నుపాధ్యాయవుగానైన నుండుము. నీ సాధన కిది యంత విరోధముగా నుండదు. నాకును గొంత సంతస మొదవు'ననియెను. 'నాకభ్యంతరము లేదుగాని సేవకావృత్తి శ్వవృత్తియని మావారల యభిప్రాయము. ఆయాజ్ఞలలో నే నిముడలే'నని కనకాంబగారు బదులు చెప్పిరి. అంత డ్రైసుడేలు నిన్ను గౌరవముగాఁ జూచునట్లును, నీమతాచారములకు విరుద్ధముగా నుండు సంఘసమావేశనములందుఁ గలియునట్లు నీకు నిర్బంధము లేకుండునట్లును నే కట్టుదిట్టము చేయుదు నిచెప్పి యొప్పించి కవయిత్రిని లేడీ విల్లింగ్డన్ హైస్కూలులో నాంధ్రవిదుషీమణిగా నుండున ట్లేర్పఱచెను. అచటఁ గొలఁది కాల ముండి పిమ్మటఁ గ్వీను మేరీకళాశాలలో నాంధ్రోపన్యాసకురాలుగఁ గవయిత్రి నియమింపఁబడియెను. ఉద్యోగారంభమునుండి పరీక్షలకుఁ బాఠ్యగ్రంథములు నిర్ణయించు సంఘ

మునందు సభ్యురాలుగాఁ బనిచేయుచువచ్చెను. చెన్నపుర్యాంధ్రో స్మానియా విశ్వ విద్యాలయములందుఁ బరీక్షాధికారిణిగాఁ బనిచేయుచున్నది.
౨ పద్యము :—

కవయిత్రి తన పన్నెండవయేట రంగశతకము నెల్లూరి శ్రీరంగనాయకులపై రచియించెను. ఆ విషయము నెల్లూరి విద్వత్కవి సాహిత్యస్థాపక అభినవ తిక్కన దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారిట్లు వర్ణించిరి.

"సీ॥ తన శేముషీమహత్త్వమునసే జనయిత్రి యాంధ్రవాక్సాహిత్య మందఁగలిగె."

చ॥ తెనుఁగున నేవిధంబునను ధీరత నీ వలరించుకొంటివో
వినుతగుణాఢ్య యవ్వహిని విశ్రుతమౌ నల హూణభాషయం
దును సముదారశక్తి యదితోడనె నీ కొనఁగూడకుండునే?
కనుఁగొన సూక్ష్మశేముషి యొకండెకదా! కళ లెన్నియైననున్.

కవయిత్రి చెన్నపురి వితంతుశరణాలయమున నాంగ్లభాష ప్రారంభింపక మున్ను నెల్లూరులో నాల్గవతరగతి వపాధ్యాయురాలుగా నుండి యది విరమించుకొని చెన్నపురి హూణవిద్యాభ్యాసమునకుఁ బోవు తరుణమున జరిగిన వీడ్కోలు సభలో జెప్పఁబడిన పద్యము లివి.

1936 సం॥ సింహపురంబున మొల్లజయింతిలోఁ గనకాంబగారికి సన్మానము జరిపినసందర్భమున నా దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారే చెప్పినపద్యము.

మ॥ కవయిత్రీమణి వంచు నిన్నుఁ బొగడంగావత్తునో లేక బ్ర
హ్మ విదగ్రీయుఁడు కృష్ణభూషణుని శిష్యంగాఁ బ్రశంసింతునో
చవి బాల్యంబుననుండి కవిత కిచ్చున్ గొన్న నీ బుద్ధి వై
భవ మగ్గింతునొ? తోఁపలేదు గనకాంబా! సాధుపూజాప్రియా!

బాల్యంబుననుండియుఁ గవయిత్రీమణి నెఱింగిన శర్మగారటి బాల్యంబునఁ గవితాప్రసక్తి గల కవయిత్రి గుణమును 'చవి బాల్యంబున నుండి' యని విశేషముగా వర్ణించినారు. పత్రికలలోఁ గనకాంబగారి పద్యములు వ్యాసములుఁ జూచి బుద్ధి చాతురికి విముగ్ధులై కాకినాడ మహిళాసంఘమువారీమెను నారీసభాగ్రాసనమునకు వరించిరి. సభాసమయమునకుఁ గనకాంబగారు వచ్చి బండి దిగుటతోడనే వారెల్ల 'నధ్యక్షురా లింత చిన్నపిల్ల యగునా' యని యచ్చెరువడిరి. అట్టులయ్యు సభాకార్య నిర్వహణములో నాశుకవితాప్రదర్శనము మొదలగు నామె వైదుష్యము నొద్దికయుఁ జూచి మహిళామణు లెల్ల నామోదముఁ జెందిరి.

అమృతవల్లి. ఇది యొక యరవనవల కనువాదము. ఈ అమృతవల్లికే రాధ యను నామాంతర మీయఁబడినది. కవయిత్రి విద్యాభ్యాసకాలములోఁ జెన్నపురిలో నరవపిల్లలు వినోదముగాఁ జదువుకొనుచుండగా విని యా గ్రంథమున కప్పటికప్పుడు రచించిన తెలుఁగిది.

అటుపిమ్మట నమృతానందనాథస్వామివారిదర్శనము. గుర్వాజ్ఞనుబొంది తదీయ బోధములెల్లఁ బ్రబంధములుగా రచించుటయు నవ్వానిని మహాకవులెల్ల రామో దించుటయుఁ గవయిత్రి 'కవితిలక' యను బిరుదప్రదానమున సమ్మానింపబడుటయుఁ దట ంచినది.

1. ఏనుఁగుపైనెక్కి :—'కింకవీంద్ర ఘంటాపంచానన కళాప్రపూర్ణ మహా కవి ప్రభృతి బిరుద విరాజమానులు జగత్ప్రసిద్ధులైన తిరుపతి వేంకటేశ్వర కవులలో నొకరగు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారు. ( గనాత్మకూరు సీతారామభూపాలుఁ డేన్గు నెక్కించి యూరేగఁజేసె.')

2. వీరు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు. శ్రీకృష్ణభారతరచనాధురీణులు. విజయవాడలో నీ మహామహోపాధ్యాయునకు గజారోహణ మహోత్సవము నృపా లక పరిషత్సన్మానము నితరనగరములయందు స్వర్ణాభిషేకము కవిగండపెండేరము మొదలగు విశేషసపర్య లొసంగఁబడినవి.

3. వీరు నాగపూడి కుప్పుసామయ్యగారు. ఆంధ్రగీర్వాణభాషలలో నీ మహా మహుఁడు విద్వత్కవి. శ్రీశృంగేరీస్వాములవారి శిష్యులు. వీరి కొమరులు న్యాయాధి కారమునం దున్నారు. చెన్నపురి విశ్వవిద్యాలయ పరీక్షాధికారులలోఁ బరిషత్తులలోఁ జిరకాలమునుండి గ్రాంధికభాషాగౌరవముఁ బ్రతిష్ఠింపుచుఁ గొలఁదికాలము క్రిందటనే కీర్తిశేషులైనారు. కవితిలక కవిత్వమునందు వీరి కెంతయో గౌరవము.

4. వీరు మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారు. వీరు తెలుఁగు సీమలోఁ దార్కికచక్రవర్తి యని ప్రసి గాంచిన గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రిగారిశిష్యులు. అవధానిశిరోమణులు. సాహిత స్థాపకులు. గీర్వాణభాషాప్రచారకులలో నగ్రగణ్యులు. వీరు సంగీతసాహిత్యములందే కాక యితర కళలయందు శిల్పముల యందును ప్రవీణు లైనవారు.

5. జీవయాత్ర కవయిత్రి రచియించిన గ్రంథములలో నగ్రగణ్యము. ఈ జీవ యాత్రి ప్రబంధముపై మహాకవు లందఱు గొప్ప యభిప్రాయము లిచ్చి కవయిత్రిని న్నపుర మహాసభలో 'కవితిలక'మను బిరుదుచే సమ్మానించిరి. (1925) అప్పటి ుండి రచించుచున్న గురుబోధములు శ్రీ గురువుగారి దీక్షానామ మమృతానందనాథ స్వామి యగుటచే నామైకదేశముగ నమృతసార మనియు, నానందసార మనియుఁ బ్రకటించిరి.

౫ పద్యము :—పండిత గమ్యవచాటను......

జీవయాత్రి వ్యాఖ్యాన సాపేక్ష మగుటచే, నందలి యితివృత్తము బోధము, సర్వజనసులభముగ నాటకముగ రచింపుమని కవయిత్రి కాజ్ఞాపించి యమృతానంద గురువులు పరమపదించిరి. (1932)

తరువాత రెండేండ్లకుఁ గవయిత్రి వేసవిలోఁ జల్లదనమునకుఁ గుత్తాళమునకు వెళ్ళినపుడక సాత్తుగ నామెకు గుండెజబ్బు వచ్చినది. పరిపూర్ణవిశ్రాంతిని దీసికొమ్మనియు, గ్రంథరచన మేమాత్రముఁ బనికిరాదనియు వైద్యులును, నాసమయము తనకు గండమని జ్యోతిష్కులును ఎన్నివిధములఁ జెప్పినను జీవయాత్ర నాటకముగ రచింపుమన్న గుర్వాజ్ఞను నిర్వహింప నైతినను పశ్చాత్తాపముచేఁ దన్నాటకరచనమునఁ గవయిత్రి నిర్మగ్నయై యొక్కొక్క యంకము పూర్తి యగుకొలఁది నామె క్రమక్రమముగా స్వస్థతగాంచి కావ్యము పూర్తియగు నంతకు సంపూర్ణారోగ్యముఁ బడసినది. చెంతనున్న కన్యాకుమారిని సేవించి యప్పరాశక్తి యనుగ్రహమున గండము గడచుటయు, గ్రంథము పూర్తి యగుటయుఁగూడ దటంచినది. ఈ విషయము పొగడపూలను కావ్యమున సవిస్తరముగ వర్ణింపఁబడినది.

ఉ॥ చేసితి జీవయాత్ర కవిశేఖరు లెల్లను సంతసిల్ల నో
హో సులభంబు గాదదియు నుర్వి జనంబుల కెల్లఁ దెల్లమా
బాసను నాటకంబుగ సెబాసన హంసజయంబు పేరిటన్
జేసి తరింపఁ జేయు మిఁక జీవుల దేశికదత్తభావులన్.

చ॥ అని గురుఁ డానతిచ్చి చనె నక్కట! నే నది చేయనైతి నీ
తను వది శాశ్వతంబె? పరతత్త్వము దెల్పిన సదురూక్తి చే
సినఁగద సాకంబు జని చేతికి నడ్డము రాకుఁ ౦క నా
పని కవిరోధమా నటుల వైద్యము చూడుఁ డటంచుఁ బల్కినన్.

ఉ॥ హంసజయంబు వ్రాసెఁ గనకాంబ గురూక్తిని నిర్వహించె నా
-కంసవిరోధిసత్కృపను గన్యకసత్కృప భక్తకోటికిన్
సంశయ మేల? నమ్మినను శక్తియ సర్వము గూర్చునన్న సా
రాంశము దేలె నీయమ మహాద్భుతచిత్రచరిత్ర మారయన్.

## 2. మొల్ల జయంతి.

వ మానశోభాలసదార్యగోష్ఠి, (Progressive union) అను పేరుతో నెలూరు పురమునఁ బ్రసిద్ధిఁజెందిన భాషాసంఘ మిది. భాషాలలనాసపర్యలన సరస్వ దేవి పూజ లనియు, విదుషీమణులసత్కార మనియు గ్రహింపనగును. మొల్లజయంతి సలుపు సందర్భమున శ్రీ గృహలక్ష్మీపత్త్రికా సంపాదకులు డా॥ కె. యన్. కేసరిగారు ఒక మహాసభ గావించి యందు శ్రీమతి చిల్కపాటి సీతాంబాకవయిత్రీమణికి గృహలక్ష్మి కంకణప్రదానము చేసిరి. ఆసభకుఁ గనకాంబగా రధ్యక్షత వహించిరి.

౧. పద్యము : బాల అనగా బాలాత్రిపురసుందరి యని యర్థము.

౨. ఇందుఁ గవయిత్రి వినయోక్తి. నెల్లూరు కనకమ్మగారని ప్రసి ( గనుటచేఁ

దన పుట్టినింటఁ దనయం దాదరముచేఁ దన కాఁడుబిడ్డ గౌరవము సలుపుటయేగాని అధికార మున్నదని కాదని యము.

3. కవయిత్రి తండ్రిగారు కీ॥ శే॥ కాంచనపల్లి రంగరావుగారు భూస్వాములుగ నుండియు, విద్యావైదుష్యముచేతను వితరణముచేతను వ్యవహార దక్షతచేతను మిక్కిలి ప్రసిద్ధి చెంది రైల్వేకంట్రాక్టరుగ బహు ధనమార్జించి, దానధర్మములు జేసి ప్రథమ వయస్సులోనే 32 యేండ్లకుఁ గవయిత్రి నెలల బాలికయై యుండ దివంగతులైరి.

౪. కవయిత్రి తాతలు పలనాటిసీమలో మాచర్ల, దాచేపల్లి, మొదలగు ప్రదేశములలో (జాలకీర్తిప్రతిష్ఠలు గాంచి జమీందారులవలె విలసిల్లిరి. ఆప్రాంతములలో నేటికిని గాంచనపల్లి వారి పేరు ప్రసిద్ధమే.

౫. కవయిత్రి మాతామహులు పంగనామాల బాలకృష్ణరావుగారు జగ్గయ్యపేటలోఁ దాసీలుదారుగ నుండి ప్రతిశుక్రవారము కరణములతోఁ గాళ్లకు గజ్జెలు గట్టుకొని తంబుర పట్టుకొని భజనలు చేయుట వేదాద్రిక్షేత్రమునకుఁ బోయి యచ్చట వారోత్సవము నియమముగ జరుపుచుండెడివారఁట.

౬. ఆ నృసింహ క్షేత్రమందు రాజ్యలక్ష్మీ దేవి సన్నిధి జీర్ణమైయుండఁగా వీరుద్ధరించి రనియు, నా దివ్యదంపతులపై ననే గీతము లాయన స్వయముగ రచించి గానము చేసెననియు, నేటికిని వారిపేరు వేదాద్రిలో వినఁబడుచున్నది.

౭. పంగనామముల రంగరావుగారు కవయిత్రికి బావగారు. అనఁగా నామె యక్కగారి భర్త. ఈ రంగారావుగారు బాల్యమునం దామె విద్యాభ్యాసమునకుఁ బ్రోత్సాహము నొసంగిరి.

౮. తన వంశాదికమును గీర్తించిన పిమ్మటఁ గవయిత్రి సభారంగమగు సింహపురిని వర్ణింపఁజొచ్చెను. అందు విద్వత్కవికి జరు కీ॥ శే॥ వేదము వేంకటరాయశాస్త్రిగారిని వర్ణించినది.

౯. ఇందు బ్రహ్మశ్రీ తూములూరి శివరామయ్యగారి ప్రశంస యున్నది. న్యాయవాదులలో నగ్రగణ్యుఁడు, సంపన్న గృహస్థుడు, నాటకకళాపోషకుఁడు, రసికుఁడు కీ॥ శే॥ ఆంధ్ర వాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారికి వీరొక గృహదాన మొనర్చిరి. సానికులగు వారే గాక పరస్థలములనుండి వచ్చిన పండితోత్తములకుఁ గూడ ఏ రం..దండయై సింహనగరంబున కలంకారమై వెలయుచున్నారు.

౧౦. ఇందు నేటితిక్కన, అభినవతిక్కన యను బిరుదువహించిన దుర్భాకుల బ్రహ్మణ్యశర్మగారి ప్రశంస యున్నది. వీరు కృష్ణస్తోత్రప్రియులు. శ్రీకృష్ణ భూషణ నామాంతరముగల అమృతానందనాథస్వామివారి గుణకీర్తనము చేయుటయందు

మిక్కిలి ప్రీతిగలవారు. త్రిలింగ పరిషన్మాన్యులు—ఆంధ్ర విశ్వకళాపరిషత్తునఁ బూజ్యులు. సద్వస్తూపాసనలాలసులు. ఈశ్వరోపాసనమం దధికేచ్ఛ గలవారు.

౧౧. మొల్లకవయిత్రి తండ్రి ఆతుకూరి కేసయ. పరమశైవుఁడగు కుమ్మరిసెట్టి మొల్లమ పుణ్యచరిత్రలలో నగ్రగణ్య యనియు, వని ల కందఱకు నాదర్శ ప్రాయ యనియుఁ గవయిత్రి యభిప్రాయము.

౧౨. ధర్మదృష్టాంతములు ;—ధర్మశాస్త్రమునందు నిర్వచించిన లక్షణములకు లక్ష్యములు మహాతులు. అట్టివా రెఱిఁగినదారి మనము పోయి వ్యామోహమునం దగుల్కొనక భగవంతు భజించుటయే యీ జయంతులకు ఫలముగాని వట్టి వేడుకకై స్త్రీ పురుషు లొక్క యెడ గుమిగూడుట కాదని యిందలి అభిప్రాయము.

౧౩. శ్రీమతి చిల్కపాటి సీతాంబ సరస్వతీదేవి ముంజేత నున్న చిలుకపాటిది. ఇంక నామె వైదుష్యమునకుఁ గవిత్వమునకు నేమిలోప మని ధ్వని. లక్ష్మి గృహలక్ష్మి నామైక దేశము. లక్ష్మి కంకణము నిచ్చినది. గృహలక్ష్మి కంకణము. అత్త కోడళ్ళగు లక్ష్మి సరస్వతులకు మాటలు కుదురుటయే కష్టము. కకణము నిడునె! ఎట్లో కోడలిపై ననుగ్రహించినను, కోడలి సంబంధురాలికిఁ గంకణ మొసంగుట మఱియు నాశ్చర్యము.

## 3. తి క్క న జ యం తి.

౧. మహారాజశ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు సింహపురంబున నేటేట జరుగు తిక్కన జయంతినాఁడు తమ తండ్రిగారైన కీ॥ శే॥ లక్ష్మీనరసారెడ్డిగారి పేర నేటేట నూటపదార్లు కవిసనా నములు జరుపుచుఁ బ్రథమ బహుమానము 1935 సం॥లో కనకాంబగారి కొసంగి. పూర్వసత్కవులయొక్క పేరు జనములకెక్కఁ జేయు ఘనసంఘ మనుటలో జనులలో వ్యాపకముఁజేయు గొప్పసమాజము, Nellore Progressive union సూచింపఁబడినది.

౨. కవులు ఋషితుల్యులు. కవి యనఁగా బ్రహ్మమును నర్థమును గలదు. కావునఁ గవులచే రచింపఁబడిన కావ్యములు తత్ప్రతిపాదకంబులు. అనఁగా బ్రహ్మమును గుఱించి చెప్పునవి. ఈకవికాలమందు దేవతాగురు నమస్కారమునందు విశ్వాసములేని పిన్నకవు లెంత పెద్దఱికముఁ దాల్చి సంభ్రమించుచున్నను సత్కవులప్రబంధరాజముల తాత్పర్యము లన్నిటికి నొక్క భగవంతుఁడే యగుటచే సాధువులు కవులను పూజించుచుందురు.

3. సులభము

౪. ఆంధ్ర విజ్ఞానమే యొకసముద్రము. అందొక్కొక్క మహాకవి ప్రబంధమొక్కొక్క మహానదివలె వచ్చి కలియుచున్నది. నదీసాగరసంగమము పుణ్యక్షేత్రమై సేవ్య మైనట్లుగా నొక్కొక్క మహాకవిజయంతి పర్వమనియు, నమ్మహా

కవి కవితావాహిని యాంధ్రవిజ్ఞానాంభోనిధిలోఁ గలియుటగా భావింపఁబడిన స్థలమే సుక్షేత్ర మనియు నిందలియభిప్రాయము. నెల్లూరు మండలము తిక్కన జన స్థాన మగుటచే నెల్లూరునఁ దిక్కనజయంతినాఁడు కవితాగోష్ఠిలోనుండుట తిక్క కవితావాహిని యాంధ్రవిజ్ఞానసాగరముతో సంగమించినచోటఁ బర్వదినమందు స్నానము చేయు పుణ్య మొసంగునని తాత్పర్యము.

౫. వేదము శ్రుతి. ఆవేదా మును బ్రతిపాదించు భారతము లేఖ్యామ్నాయము. వ్రాయఁదగిన వేదను, భారతము పంచమవేదమని ప్రసిద్ధి. నన్నపార్యుని మార్గము లక్ష్య లక్షణముల ననుసరించిన సపర్యాభావన. భారత రచనమే భగవదారాధన మనుకొని తిక్కన కవిభారతీవిభుఁడు = కవిబ్రహ్మ. మనుమసి రాజ్యసిద్ధి, గలిగి యుండి వైదికసంపత్తి నొంది పంచమవేదము రచించెనని భా ము.

౭. తిక్కన జయంతి నెల్లూరిలో జరపుచుండిరి గాని యీ పద్యము రచించు నాటికి రాజమహేంద్రవరములో నన్నయజయంతి జరపుటలేదు. కాకతాళీయముగా నీ పద్య ప్రకటనమైన పిదప నొక యుపసంఘ మేర్పడి రాజ మహేంద్ర వరమున నన్నయ జయంతి జరప నారంభించిరి.

౮. తిక్కవరపు రామిరెడ్డిగారు తిక్కన మహాకవి జయంతికిఁ గవి సన్మానము జరుపుట వింతగా నున్నది.

౯. కృష్ణభారత రచయిత శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. 2 శతవధాన ఖ్యాతిగల కవిసింహములు తిరుపతి వేంకటేశ్వరులు. 3. ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు 4 బ్రహ్మాండపురాణకర్త జనమంచి శేషాద్రిశర్మగారు.

౧౦. నా పుట్టింట : కవయిత్రి నెల్లూరు కనకమ్మగారను ఖ్యాతినొందిన కతన. శాంత అయోధ్యనుం బలెఁ ఇచట ద్వితీయ.

౧౧. తిక్కనమహాకవి యింటిపేరు పాటూరివారనియు, నావంశస్థులు నేటికిని నెల్లూరి సమీపమునఁ బెంపొందుచున్నారనియు, వారి యిండ్లలోఁ దిక్కన భారతము రచించిన ఘంటము పూజింపఁబడుచున్న దనియుఁ దిక్కన జయంతి జరపుటకై వా రొక మాన్యమునుగూడ గల్పించిరనియు నెల్లూరునఁ గల యైతిహ్యమిం దన్వయించు కొనునది.

## 4. కనక కంకణ తారావళి.

౧. గృహలక్ష్మి సంపాదకులు డాక్టరు కె. యన్. కేసరిగారు మొల్లజయంతి నాఁడు కవయిత్రీమణుల కొసంగఁబడు స్వర్ణకంకణము నుజ్జగించి శ్రీ కనకాంబగారు చేయుచున్న పండిత సత్కారాది దానముల కుపకరించునట్లుగా నైదునూటపదాఱులచే వారిని సమ్మానించిరి. కేసరిగారి యింటిపేరు కోటవారు. వదాన్యకేసరి అనఁగా దాతలలో నుత్తమదాత.

౭. ఉత్తముల వెదకితెచ్చి సమ్మానించుట కృతయుగధర్మము. వెంటఁబడిన పండితుల వెడలనడచుట కలియుగధర్మము. నోటితో లేదనకుండఁ జేతితో లేదను వారే యధమగ నున్నారు.

౮. సింహపురంబున నేనుఁగులు కన్నుమూసినఁ బ్రాణాపాయము నొందునని ప్రసిద్ధి. ఈ యూరి కవిసింహులముందు ధీరవేదండములు అనఁగాఁ బండితు లను నేనుఁగులుకూడ నేమరుపాటునఁ గనుమూసినఁ బ్రమాదమునొందుదురు. పరాభవము నొందుదు రని ధ్వని. ఇట్టిచోఁ బెద్దలు మెచ్చఁబల్కు నాకు సాధ్యమేయని ప్రశ్న. అది సాధ్యముగాదని వినయోక్తి. సాధ్యమే- అవధారణము, సాధ్యమగు ననుట. కారణము క్రిందిపద్యమున నున్నది.

౯. కవయిత్రి చిన్నతనంబున నెల్లూరనుండి యామె పెక్కు బహుమానము లను, బతకములను బొందెను. ఆ యూరివారు మహాసభలు సలిపి యామెను సన్మానించిన యుదంత మిచ్చట స్మరించునది.

## విజ్ఞానచంద్రికవారి ప్రశంస

ఆచంట లక్ష్మీపతి,
బి. ఏ. ఎం. బి. సి. ఎమ్,
మేనేజరు, విజ్ఞానచంద్రిక ఆఫీసు.

మదరాసు,
చింతాద్రిపేట,
ది 14—9—1912.

అమ్మా,

తా మీ సంవత్సరము విజ్ఞానచంద్రికా పరిషత్తునం దందఱికంటె నెక్కుడు గుణములు సంపాదించి యీ క్రింది బహుమానములను బడయఁగల్గితి రని తెలుపుటకు మిక్కిలి సంతసించుచున్నాము.

రొక్కముగా రు 216-0-0 లును, ఆఱు సువర్ణపతకంబులును దమకు బహుమానముగా నియ్యఁబడును. ఆంధ్రనారీరత్నములలోఁ దమబోటి విద్యావతి యింత జయమును గాంచినందుల కాంధ్రలోకమంతేయు గర్వపడవలసియున్నది. ఇంకను దమబోటి నారీరత్నముల నీ భారతవర్షమున జన్మింపఁజేయ భగవంతుని సదా ప్రార్థించుచున్నాము.

చిత్తగింపవలయును,

ఇట్లు
(సంతకము) వేమూరి విశ్వనాథశర్మ, ఎం. ఏ.,
కార్యదర్శి.

## శ్రీమతి కనకాంబగారి బహుమానములు

### వివరము

| | |
|---|---|
| 1. మొదటి బహుమతి మండలివారిది | రు 116-0-0 |
| 2. స్త్రీలలో నన్నిటియందు మొదటి బహుమతి<br>శ్రీ పిఠాపురము రాణీగారిది | రు 100-0-0 |
| 3. సాహిత్యములో మొదటి బహుమతి<br>శ్రీయుత నెమలి పట్టాభిరామారావుగారిది | బంగారు పతకము |
| 4. చరిత్రములో మొదటి బహుమానము<br>శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహద్దరుగారిది | బంగారు పతకము |
| 5. ప్రకృతిశాస్త్రములో మొదటి బహుమతి<br>శ్రీ రాజా పానుగంటి రామారాయనింగారు | బంగారు పతకము |
| 6. స్త్రీలలో సాహిత్యమునందు మొదటిబహుమతి<br>కృష్ణాజిల్లాలో నొక జమీందారుగారిది | బంగారు పతకము |
| 7. స్త్రీలలోఁ జరిత్రమునందు మొదటి బహుమానము<br>కృష్ణాజిల్లాలో నొక జమీందారుగారిది | బంగారు పతకము |
| 8. స్త్రీలలో శాస్త్రమునందు మొదటిబహుమతి<br>కృష్ణాజిల్లాలో నొక జమీందారుగారిది | బంగారు పతకము |

"సాఁకెం జిన్నతనాన సత్సభలలో సనా నముల్ సత్కృతుల్
నాకుఁ సింహపురంబుకూర్చి యిది జన్మస్థానమే కాన"

కవయిత్రీమణి కీ బహుమానములు పొందునాటికి వయస్సు పదునెం డేండ్లు. అంతకు లోఁగడ మూడు సంవత్సరములకు ముందు నరసాపురము పరీక్షలో స్త్రీలలో నగ్రగణ్యయై యీమె యుత్తీర్ణురాలై బంగారుపతకము పొందినది. సభనుండి బహుమానములఁ బతకములు గైకొని తోడి బాలికలతో సంతోషముగా నింటి కేగువో దారిలో నెవరో యీమె తలకుఁ దగులునట్లొక దారుణశిల విసరిరి. ఇరువది దినములు జ్వరపడి యాదెబ్బ కెట్లో దైవయోగమున జీవించినది. కాని యంతకుఁ బూర్వమే కసంత కెట్టి గ్రంథమునైన గ్రహింపఁగల ధారణ కొంత తగ్గినదని యీమె బంధుగులు చెప్పుచుందురు.

6. మదీయ సత్కృతులు – సత్కావుల్ గాపాడంగఁగడంగుటఁ

సమకాలికులగు మహాకవులందఱు కవయిత్రి గ్రంథములఁ గొనియాడుటయె కవచమై యామె గ్రంథములకు రక్షయగునని యభిప్రాయము. మహాకవుల యభిప్రాయము లనుబంధమువలనఁ గొన్ని చూడనగును.

7. ఈ పండుగులు, జయంతులు భగవంతుని స్మరించుటకు మహాకవులఁ బూజించుటకు మహా ప్రబంధములు స్మరించుటకు నవకాశ మొసంగుననుట.

8. 'నాదమునిల్పు' ప్రపంచఘోరణిలో భగవన్నామ మను నాద మణఁగిపోకుండ నిల్పుటకని యమ. శ్రీరామజయంతి, శంకరజయంతి, నృసింహజయంతి మొదలగు నవి జయంతులు. ఒక్కొక్క జయంతి యుత్సవముల ముచ్చట మఱవకమునుపే మఱియొక జయంతి వచ్చుటచే నాదము శాశ్వతముగా సంతత ముండుననుట.

9. కుమ్మరివారియింట ననుటచే నేకులమునందైనను స్త్రీరత్నము సమ్మాననార్హమైనదని తాత్పర్యము. కుండతో నీదుట ప్రసిద్ధముగాన మెల్ల శరీర మను ఘటముతో సంసారసాగరమును జల్లగా దాఁటెనని ధ్వని. బ్రహ్మ యేన కులాలవత్,.. బ్రహ్మాండ భాండోదరే"

11. కొండ దా దారికిఁ గంపఁగొట్టి - శాస్త్రప్రసిద్ధమైన యాదర్శమును జొకఁజేసి యసన్మార్గములను బోధించుచు సన్మార్గమునఁ బోవు వారి నడ్డగింతు రనుట.

12. "డొల్ల సమస్తమున్" లోకమున నన్నియు నిస్సారములు. బుడగల వంటివి.

14. రెండును రెండు త్రోవలు. పాశ్చాత్త్యుల మార్గము వ్యతిరేకము. మన దేశము (ప్రాక్కు) మార్గము. రామునివలె సంచరించి ధర్మము, కీర్తి, శాంతియుఁ గాంతురనుట అన్వయ మార్గము. రావణుని వలె సంచరించి యధర్మము నపకీర్తి యశాంతి గాంచుట వ్యతిరేక మార్గము.

ధర్మార్థ కామ మోక్షము లను పురుషార్థ చతుష్టయమును సంపాదింప యత్నించి కృతార్థులగుట యన్వయమార్గము, ధర్మమోక్షముల విడనాడి యర్థకామములఁ దగిలి యశాంతితోఁ గొట్టుకొనుట వ్యతిరేకమార్గము. పాశ్చాత్త్యుల మార్గము. "వీనిలో నుండెడు సారమున్ గురునిసూక్తి నెఱిఁగి వచింతున్" మూఢ విశ్వాసముతోఁ బల్కుదానను గాను. రాజధానిలో రాజభాష యగు నాంగ్లమును నేర్చి తద్ద్వారా పాశ్చాత్త్య విజ్ఞానము నెఱింగి ప్రాక్పాశ్చాత్త్య విజ్ఞానపరిపూర్ణు లగు నమృతానంద నాథులవారి సూక్తులు వినుటచే సర్వ సంశయము లణంగఁగాఁ బలుకుచున్నాను గనుక నా మాటయందుఁ బ్రమాణబుద్ధి మీ రుంచఁదగి యున్నదనుట.

15. మీరాబాయి, సక్కు, సుశీల, మొదలగు వారు గృహిణులుగా నుండిరి, వారి భక్తిని బరీక్షించుటకు భగవంతుఁడు వారిభర్తలను వ్యతిరిక్తుల నొనర్చెను. ధీరురాండ్రగుటచే వారి భక్తిని మానక శాశ్వతయశము నొందిరి.

సులభ:—భారత శాంతిపర్వమునం దీమె కథగలదు, ఈమె వాదమున జనకుని మెప్పించినది. తఱిగొండ వెంగమ్మ వింతతువుగా నుండియు భక్తురాలై పలువురచే నిందఁబడియు సిద్ధిం బ్రసిద్ధింగన్న యాంధ్రయోగిని.

18. స్త్రీలను బురుషులను సమానముగాఁ గని పెంచువారలు స్త్రీలు. అట్టిచో నేటి కాలమునఁ బ్రచారములో నున్న పురుషద్వేషము స్త్రీలకుఁ దగదనుట.

21. పురుషులయందు కంటె స్త్రీలయందు ధర్మదీక్ష దృఢతరంబై యుండు "విభుఁడు పతితుఁడైన వెలఁది పాతివ్రత్యమహిమఁ బుణ్యుఁజేసి మనుపవలయు" నను న్యాయమునఁ బురుషులను గూడ ధర్మమున నిలువఁబెట్టువారు స్త్రీలు. పిల్లలను బెంచుట, తలకట్టుఁ బెంచుట, ధర్మమును బెంచుట, తులసి మొదలగు పావన వృక్షములు, మల్లె మొదలగు లతలు పెంచుట స్త్రీలకు సహజము. నేటి తెగువలు సాహసములు నాతిని గోత్రినిఁజేసెను. వికారపుఁ జెయ్వులు చేయుదానిఁగాఁజేసెను. 'నిఘంటువులో గోత్రి యన నాతి యను న మున్నది. ఆ పదము నేటివారి కుపయోగపడుటకై నిర్మింపఁ బడినదని పరిహాసోక్తి.

21. అభవ్యంబైన మార్గంబులన్ – ధర్మవ్యతిరేకము లయినవి. అనఁగాఁ గాని త్రోవలు–అవస్థల్ మాఱఁగా– సమిష్టి కుటుంబములు చాలవఱకు నేటి కాలమున నంత రించుటచే ననాథలైన స్త్రీలు జీవనా ము శ్వవృత్తిలోనికి దిగవలసి వచ్చుచున్నది. అప ర్మమున నారీమణు లే వృత్తి నవలంబించినను, దమయంతి, ద్రౌపది పండిత కౌ కి మొదలగు వారివలెఁ దమతమ శీలములను గాపాడుకొనవలయు నని సూచన.

23. సత్య శౌచాది గుణములు లేకయే వట్టి చదువులు వ్య ము లనుట.

24. పతివ్రతలగు సతీమణులు తమ గుణములచే లీలలచేఁ గాంతుల సంతోష పరచుచు సమయము గనిపెట్టి ధర్మోపదేశముఁ జేయుదురనుట. అట్టి నేర్పు సి మగు నచేఁ గావ్యములు కాంతలవలె ధర్మము నుపదేశించు నను నుపమ కలిగినది.

26 కవయిత్రీమణి సన్మానము జరపిన వర్ధమానసంఘము (Progressive Union)న కగ్రాసనమున నధివసించి తత్కాల మందుఁగూడ రు 116–0–0 లచే నా యమను సత్కరించిన వారు రేబాల పట్టాభిరామరెడ్డివారు. ఈ పద్యమున వారి కాశీర్వాద మున్నది'

## గు రు జ య ం తి 1935.

(పుట 13) ౧. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠమున నొసంగఁబడు నమ తానందనాథ పారితోషికము ప్రథమమున బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి సమర్పించఁబడినది. ఆంధ్రశబ్దానుశాసనుండగు నన్నయభట్టారకుండు శ్రీపాదవారియింటఁ గృష్ణమూర్తికవి నామధేయముతో జన్మించి మొదటి పుట్టువునఁ బూర్తిచేయలేని భారతము నీ రెండవజన్మమునఁ బూర్తి గావించెనని భావము.

౨. శ్రీపాదకృష్ణ కవిసార్వభౌముఁడు ముగ్గురుమహాకవులు మూఁడు శతాబ్దము లలో ముగించిన యాంధ్రభారత సంహిత నసహాయశూరుఁడై పూర్తిఁగావించెనని భావము.

3. భారతరచన ప్రాణము తీయునని పరివాదము. శ్రీపాద కృష్ణమూర్తికవి తాను బ్రతికినను కొడుకును బలినియ్యక తప్పినది కాదు. గజారోహణాది ఘనగౌరవముల నొందిన మహాకవులుగూడ నీ కృష్ణకవి పాదసేవకులే, అనఁగా శిష్యులే.

౬. శక్తిలేక నూటపదియారు లిచ్చుట గాని కోటికోట్లకైన మీరు తగుదురు. ఇది కనకార నముగా మీరు భావింపఁ దగునని భావము. కనకాంబ యను పేరు గల్గిన కవయిత్రిమణి గావించు నర్చనము కనకార్చనముగా మీరు గ్రహింపవలె నని భావము.

## శ్రీ గు రు జ య ం తి 1936.

(పుట 14)

రెండవ యమృతానందనాథ పారితోషికము బ్రహ్మశ్రీ ఆమ్నాయా వాచస్పతి వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు పొందిరి. వీరు పిఠాపురసంస్థానమందలి విద్వాంసులు. ఈ సభకు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రుల వారధ్యక్షత వహించిరి. ఆరుమొగములు గలిగిన కుమారసామి తన యైదుమోములను నెమ్మిని అనఁగా తన వాహనమైన నెమలిని విడచివచ్చి లక్ష్మీనారాయణశాస్త్రిగారి రూపమును ధరించి వేదాము చెప్పినట్లుండెనని తాత్పర్యము. అధ్యక్షులు కృష్ణమూర్తిశాస్త్రిగారు కృష్ణ నామమును ధరించిన వేదవ్యాసుఁడే యగుటచే భారతమంతయు సమగ్రముగ రచియింపఁ గల్గెనని భావము.

౫. కృష్ణుఁ డనగా వాసుదేవుఁడు. కృష్ణుఁ డనఁగా కృష్ణద్వైపాయనుండగు వ్యాసుండు. కృష్ణుఁ డనఁగా శ్రీపాద కృష్ణమూర్తి కవి. గీతలు రచించిన వాఁడొకఁడు, గీర్వాణ భారతమును బొందుపఱచిన వాఁ డొకఁడు, ఆంధ్రభారతమును బొందుపఱచినవాఁడు మఱొకఁడుగ గనఁబట్టుచున్నను గృష్ణుఁ డొకఁడే యిన్ని రూపములు ధరించెనని సూచన.

## ప ద్య కు సు మా ం జ లి

(16 పుట) ౧. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము నమృతానందనాథ స్వామివారు స్థాపించిరి. వీరే కవయిత్రికి బ్రహ్మవిద్యాగురువులు. పీఠము యొక్క కృత్యము క్రింది పద్యములలో వివరింపఁబడినది.

3. వేంకటేశపంచాయతనము. ఆదిత్యుఁడు, అంబిక, విష్ణుఁడు, గణనాథుఁడు, మహేశ్వరుఁడు- వీరు పంచాయతన దేవతలు - ఇందు వేంకటేశ్వరుఁడు విష్ణువుగాఁ బ్రధాన దైవతముగాఁ బ్రతిదినము-త్రికాలముల నర్చింపఁబడును. ఇతర దైవతముల కొక్కొక్క సహస్రనామార్చనము తత్తన్మంత్రానుష్ఠాన పూర్వకంబుగఁ గావింపఁబడును. ఆర్ద్రచిత్తముల భక్తిరసము నిండిన డెందములతో మోక్ష మర్థించు భక్తులు సలిపెద రనుట.

౫. గుంపుదూరి—పామరసమూహమును గూర్చికొని యెట్టి యధర ప చారమున కైనను బాలుపడి యల్లరిపడి విచారపడనేల? ఈ జగమెల్లఁ దద్ధీనము. తత్తనఁగా బ్రహ్మము "మనుజులు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞ చెల్లెడుఁగా", అని విశ్వసించుట, తరించుటకు మార్గము.

౬. వినోదాలకు వింతలకుఁ బరమార్థము లభింపదు. వాక్కు౦గట్టి—మౌనము ధరించి, ఈ కాలపు టుద్యమములు పరిహాసపాత్రములు ఉభయభ్రష్టత్వ సంప్రాప్తి హేతుకములు, వ్యవహారమున లాభమును, బరమార్థమున మోక్షమును సంపాదింపలేని యడావుడులు.

౭. వేత్తల్ విత్తులు - అనఁగా జ్ఞానబీజములు పండితులవలననే పండి విజ్ఞాన ఫలము నిచ్చును. ధర్మరహితమైన భాగ్యము దౌర్భాగ్యమే యగును. కావుననే భాగ్యవంతులైన నవనాగరికులు కత్తులుకత్తులు కలుపుకొని పోరాడి చచ్చుచున్నారు.

౮. ఇక్కడ నేమొ చిక్కనని = ఇక్కడ భరతఖండమున సర్వసమన్వయము శాంతి చిక్కనని.

౯. నవీన శాస్త్రము - సంశయాత్మకమైన పాశ్చాత్య ప్రకృతిశాస్త్రము - ఋషుల సిద్ధాంతములు - సార్వకాలికములు - భవతారకములు.

౧౦. నేటివారికి గ్రహణశక్తి కొంత యున్నట్టున్నను ధారణశక్తి పూర్ణముగా లోపించినది, వేదశాస్త్రపాఠకుల కున్న ధారణ - జ్ఞాపకశక్తి ఆంగ్లేయ శాస్త్ర పాఠకులకు లేదు. అసువారము - ప్రాణపంచకము నిల్పుటయె భారమైనది. పైప్రజ్ఞ లేమియును లేవు. ఈపద్యమున నిట్లు సవరించుకొనునది. సువస్తునౌగదా! భారము నేటివారి కసువారము నిల్ప ననారతంబహో.

౧౧. అసచ్ఛాస్త్రుల్ - నాస్తిక శాస్త్రవాదులు ఛత్రముదాల్చి - జయోన్నతులఁబొంది - వీరు భక్తిగలవారియొక్క విశ్వాసమును ఖండింతురు. వీరికిఁ బామర తుష్టియే పుష్టి.

౧౨,౧౩. దేవునితోడ వేదము-నిగమముఁ బుట్టెననఁగా ననాదియనుట. మతిలేని దేశములనఁగా నితా నిత్యవస్తువివేకములేని దేశములు. దేవుని సమాన విభూతిని గాంచిరి. అహంబ్రహ్మాస్మి- త్వమసి మొదలగు మహావాక్యముల యనుభవముగలవారై 'కర్తుమకర్తు మన్యథా కర్తుం సమర్థః' అనునట్లు షడ్గుణైశ్వర్య సంపన్నులై భగవంతునితో సమానులైయుండిరి. ఉన్న భావములందును యోగాది సిద్ధులచేఁ గలిగిన ప్రభావమునందు నారు లే యందఱకంటె ముందుగాఁ బరిపూర్ణులైనారు. ప్రపంచము - పావన భరతఖం ముగాక తక్కిన మ్లేచ్ఛదేశములు నిద్రలేచి - నాగరికులై

౧౪. సత ము త్రికాలాబాధ్యము, అనఁగా మారునది కాదు. ఎల్లుండికి మాఱునవి పాశ్చాత్య ధ్ధాంతములు. తఱచు మాఱు స్వభావము గలవియనుట.

౧౫, ౧౬ ప్రాణములు కంఠగతము లగుచుండినను యవనభాష - మ్లేచ్ఛ భాష యుచ్చరింపఁగూడదని శాస్త్రముండినను, దైవయోగమున యవనులు మన దేశమునకు వచ్చి పాలకులైనపుడు వారి బాస రాక పోవుట వ్యవహారమునకు హానియని కొంత వఱకు మ్లేచ్ఛభాషయు నేర్చుకొనుటకు ఛాందసుఁడైన యప్పకవియు ననుమతి యిచ్చినాఁడు.

"క్షితి మ్లేచ్ఛభాష శ్రుతి గ. ర్హితమగు నట్లయిన నీధరిత్రిని దానిన్
మతిరోసి విడువఁగూడదు, సతతము వ్యవహారహాని సంధిలుకతనన్."

ఆంధ్రకవితా పితామహుఁడు అల్లసాని పెద్దన మొదలు శిష్టు కృష్ణమూర్తికవి పండితాఖండలులు వఱకుఁ బారసీక భాషలు తమ కవిత్వమందు వాడుట కూడ నప్పకవిమతము సమ్మతించునే కాని యవనభాషలో విశేషముగాని పరమముగాని యున్నదని కాదు.

నేటి కాలమున భారతీయు లల్పసత్త్వులగుటచే యవనభాషను వ వహారమునకు మాత్రము వాడక యందే స్వర్గము, మోక్షము నున్న వనుకొని పాశ్చాత్య భాషతోఁ బాటు భావములు పద్ధతులు నలవఱచుకొని కొంపలు ముంచుకొనుచున్నారు.

౧౫. పద్యమునఁ బాఠభేదము.

"ప్రాణమ్ములు పోవునట్టి తఱుణమ్మున నేఁ బరభాష లన్ని పే,థమ్మొనరించె."

౧౭. మును లంద అనుభవించిన యానంద మంతట దండిగ నిండియున్నది. ప్రాణము లనిత్యములు గాన గురుదేవతోపాసనాదులు మాని వట్టిమాటల మఱగినఁ బ్రమాదము.

(18 పుట)

౧౬ వ పద్యము- "స్వేచ్ఛాసముద్భవ దుస్తంత్రములందు మూర్చి" అని చదువ వలయును.

౨౦. బాల్యమున మనసు పూర్ణము- అనఁగా శు ము. కపటములేనిది. భౌతిక శరీరపుష్టి స్వల్పము. వయస్సు వచ్చినకొలఁది దేహమున రక్తమాంసాదులు వృ యై బలుపేర్పడును గాని మనశ్శాంతికిఁ గొఱంత కల్గును. అనఁగా నరిషడ్వర్గమునకు మనస్సులోఁ దావు రపడి యశాంతి ప్రబలి మొదటి చిత్తవిశ్రాంతికి శైథిల్యము కల్గును. భారతవర్షము తొలుదొల్త సర్వసంపత్సమృద్ధమైయుండి రాను రాను భౌతికపుష్టి సన్నగిలి మానసికశాస్త్రము లేక ఆత్మశాస్త్రము ప్రాధాన్యము వహింపఁబ మోదనిలయమైనది. నేటి నవనాగరికు లీ విషయము గ్రహింపనేరక యది దు తి యని కలఁగుచున్నారు. ఆత పరిపూర్ణత లేక మాంస మీమాంస మాత్ర మొనరించు పాశ్చాత్త దేశములు పెరుగుచున్నవి. వాని యీ పెరుగుట కండలు పెరుగుట వంటిదే యని తె యునది. పాఠాంతరము- "బాలత్వంబునఁ జిత్త మచ్ఛమగుఁ గాపట్యంబు లేకుండు. ప్రాచి - ప్రాగ్దేశము - భారతఖండము.

౨౧. పౌండ్రకవాసుదేవులు-వేషధారులు-పురాణప్రసిద్ధుఁడు నాఁడు వాసుదేవునివలె శంఖ చక్రములు ధరించుచుఁ దానును వాసుదేవుఁడ నైతి నని విఱ్ఱవీగుచుఁ బరాభూతుఁ డయ్యెను. పండితబ్రువు లిట్టివారే.

౨౨. కలఁ చెఱ గలిరెంటిని - కలిపురుషుఁడు రాజులు పాలింపఁదగిన స్థూలధర్మమును, గురువులు పాలింపఁదగిన సూక్ష్మధర్మమును రెంటిని జీకాకుపఱచెనని తెలియునది.

౨౩. ఏమొనరింప నేమియగు . నవీనసంస్కారు లేమిచేసినను నిష్ప్రయోజనమనుట. ప్రపంచములో భారతీయులే తప్ప మఱి యే జాతివారును వస్నెకెక్కలేని కళలయందును శిల్పములందుఁ దత్త్వజ్ఞానమునందు మనకు నాడెము నిల్వఁబెట్టుటయే తగినపని.

౨౪. ధర్మతత్త్వముఁ దెల్పు పెద్దలను గొలఁవక చిన్నలగువారు పెద్ద వేసములు వేయుచుఁ దమ కలవడిన దురాచారములను ఖండింపలేని యెడ్డెగుంపును సభాభవనములందుఁగాక పశువులనువలె దొడ్లయందు నిల్వఁబెట్టి "కల్పములేని జల్పముల" వేదశాస్త్రప్రమాణములేక మనసునకుఁ దోఁచిన ట్లెల్లఁ బ్రసంగింపుచు జట్టుగట్టుకొని నీచమగు సిద్ధులకై ప్రయత్నింతురు.

పోటీలఁబడి యొకరినొకరు నిందించుకొనుచు మందిని గట్టుకొనుచు బురపాలకాది సంఘములలో సభ్యత్వమునకై ప్రయత్నించుటవంటి స్వల్పసిద్ధు లిందు సూచింపఁబడినవి.

౨౫. ప్రపంచమున కంతకు నుపదేశము చేయఁదగిన వారిలో మొదటివారాంగ్లేయు లని వారి వేషభాషల నవలంబించిరి. వారి తరువాత బెంగాలీయులను జూచి వారి ననుకరించిరి. జాతి దొరలవలె లాగులు చొక్కాలు దొడిగి టోపీలు పెట్టుకొనుట కొంత కాలము, బెంగాలీబాబులవలె ధోవతులు గట్టుకొని చొక్కాల దొడిగి జుట్టుఁ గత్తిరించుకొని యుత్తరీయములు లేకుండఁ దిరుగుటతోఁ గొన్నాళ్ళు గడచినది. సంస్కృతాంధ్ర గ్రంథముల నుజ్జగించి యాంగ్ల గ్రంథములు చదువుటతోఁ గొన్నాళ్ళు, బంగాళ గ్రంథము లాంధ్రములోని కనువదించి చదువుటతోఁ గొన్నాళ్ళు నడచి మాయ మర్మ మెఱుంగక పరబుగులఁ బట్టి మోసపోవు ముగులగు వారికి ప్రౌఢత్వము వివేకము గలిగించుటకై యెన్నే గ్రంథములు తెలుఁగుభాషలోఁ గవయిత్రి రచించెననుట.

౨౬. స్త్రీ శూద్రులకొఱకు సంస్కృతమునఁ బురాణములన్నియు వ్రాయఁబడినవందురు. నేఁడు గీర్వాణ మంతరించినదని నన్నయాదులు త్రిలింగభాషలో గ్రంథములు వ్రాసినారు. నేటివా రదియు దెలియలేక గ్రాంథికభాషలయందు ద్వేషభావము గలవారై గ్రామ్యవాదమును జేయుచున్నారు.

౨౯. నన్నయభట్టు ఆంధ్రశబ్దానుశాసనుఁడు. ఆంధ్రవ్యాకరణము సంస్కృతమున వ్రాసినవాఁడు. బాలవ్యాకరణకర్త తెలుఁగునఁ దెలుఁగు వ్యాకరణము వ్రాసినవాఁడు. నన్నయ మొదలు చిన్నయ వరకు కాలపరిమితి 800 (ఎనిమిదివందల) ఏండ్లు. ఈమధ్యకాలము వారు నియమవంతులై యుండిరి. ఇటీవల వారు కట్టుబాటులు తొలఁగించుచున్నారు.

౩౦. ఆచారమునందు విధినిషేధములను బ్రహ్మభావసంపన్నులైనవా రతిక్రమించి నట్లే నిరంకుశులైన మహాకవులు ఋషికల్పులె చట నేని వా కరణపు హద్దులను దాటినను నవి సహృదయులు లోపమనక యార్షము లని శిరసావహింతురు. "రసో వై సః" అను శ్రుతివాక్యమునుబట్టి తమ మహాకావ్యములయందు బ్రహ్మానందరసమును బ్రతిపాదించుటచేఁ దద్రసలుబ్ధులైన పండితులెల్లరుఁ బరమానంద మనుభవించిరి. నిస్సారమగు తొక్కుడుగడ్డి పెంకముగ మోపులు కట్టినట్లు సారహీనమైన రచనలను జూడఁ జక్కనగు పుస్తకములుగఁ గుట్టి కట్టి సభలలోఁ బ్రకటించుట పామరతుష్టికే గాని సాధుసమ్మతము కానోపదు.

## అమృతానందనాథ పారితోషిక ప దానము.

(పుట ౨౧)

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యా పీఠస్థాపనాచార్యులును దమకు గురువరులును నగు శ్రీమదమ తానందనాథస్వామివారి పేరుతో నమృతానందనాథ పారితోషికమును గవయిత్రీమణి త్రిలింగదేశమునందుత్తములైన పండిత ప్రకాండులకు సగౌరవముగ సమర్పించుట కేర్పాటుచేసిరి. ఆంధ్రదేశ పండితవీరులైనవా రందఱు నీ పారితోషికముచే బహూకరింపఁ బడినవారే. వివరము లాయాపండితుల ప్రశంస సమయములందుఁ గాననగును.

## విజయవాడ శాఖ

పదము ౧ - ఫణీంద్రకలాపు- త్రిలింగపీఠము నాగభూషణ గురువరేణ్యునిచే స్థాపింపఁబన పీఠము, పరాశక్తియగు దుర్గ బెజవాడలో స్థాపించె ననుట.

౨. ఆనాఁడె శ్రీకృష్ణభారతకర్త యగు శ్రీపాదకృష్ణ కవిసార్వభౌముఁడు శ్రీ త్రిలింగపీఠమువారి ప్రోత్సాహమున విజయవాడపౌరులచేరు 1116-0-0 సనా నము పొంది యేనుఁగునెక్కి యూరేగివచ్చి యేతత్త్రిలింగ మహావిద్యాపీఠమును మిక్కి ప్రశంసించెను.

౩. కవులు కవులను సన్మానించుట సోమయాజినాఁడు కృష్ణరాయలనాఁడు నుండె నని వినుటయేకాని కవిపండితభూయిష్ఠమైన త్రిలింగపీఠము వా రా ఘనకార్యము నిర్వహించుట యీనాటి కనన్యసాధారణముగ నున్నది.

## శ్రీ గురు జయంతి 1937.

పుట ౨౨ స్వాగతము పొందిన దెందుకూరి నరసింహశాస్త్రిగారు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారును (శ్రీ పిఠాపురం మహారాజావారి ఆస్థాన పండితులు.)

దెందుకూరువారు మైసూరుదేశము వెళ్లి వేదాంతశాస్త్రమును సమగ్రముగ సాధించి యాంధ్రదేశమునకు వచ్చి విద్వాంసులలో నుత్తమ పరిచారము గావించిరి. శ్రీపాదవారు తర్కశాస్త్రమందుఁ గడుంగడు ప్రసిద్ధి వహించిరి. ఈ త్రిలింగపీఠము వారు గురుజయంతికిఁ బూర్వ మీ పండిత ద్వితయమునకుఁ జెన్నపురిలో మహా స్వాగత మొసంగిరి. ఆ సభకు ఆంధ్ర ప్రముఖులు ధర్మరత్న బిరుదాంకితులు ఉన్నత రాజోద్యోగులు నగు మహారాజశ్రీరావుబహద్దూరు మంత్రిప్రగడ నరసింహం పంతులు గారధ్యక్షత వహించిరి. ఈ పండితద్వితయమును "మహామహోపాధ్యాయ" తాతా సుబ్బరాయశాస్త్రి గారికినిఁ కవయిత్రి యగు శ్రీమతి కాంచనపల్లి కనకమ గారు "అమృతానందనాథపారితోషికములచే" గురుజయంతినాఁడు సన్మానించి. చెన్నపురి రాజధానియగు మదరాసు పట్టణమున జరిగిననాటి మహాసభ మహారాజాధి రాజులతో న్యాయాధిపతులతోఁ బురప్రముఖులతో నిండియుండి దేవేంద్రుని సభవలెఁ గన్పట్టెను.

పుట ౨౮ — ౧౦, ౧౧, ౧౨ పద్యములందు నీ విద్వాంసులకు ముువ్వురకు త్రిలింగపీఠమువారిచే నీయఁబడిన బిరుదములు వర్ణింపఁబడినవి.

దెందుకూరువారికి — వేదాంత సార్వభౌమ లనియు
శ్రీపాదవారికి — తార్కిక చక్రవర్తి లనియు
తాతావారికి — వైయాకరణ సమ్రాట్టు లనియు
బిరుదు లొసంగఁబడినవి.

పుట ౨౮ పద్యము ౧౫)

"తనమది సంశయంబుడుప" ఈ పద్యమునందలి భావము కవయిత్రిచే రచింపఁ బడిన హంసవిజయ నాటకమున ద్వితీయాంకమున విద్యాగోష్ఠిలోఁ జక్కగ వివరింపఁ బడినది.

## శ్రీ గు రు జ య ం తి 1938.

(పుట ౨౫ పద్యము ౧)

'గురుంప్రకాశయేత్' — గురుమూర్తియొక్క ఖ్యాతినిఁ బ్రకటించుట శిష్యు లకు ధర్మము కావున నస్మద్గురువర్యుల సుగుణస్తోమమును బండితులు వినునట్లు వర్ణిం చెద ననుట,

పద్యము ౨. ఆశ్రయించిన శిష్యులను దిద్ది తీర్చిన వారికిఁ దత్త్వము తెలుపుటకును గృతకృత్యులైన ధ్ధీరుల గౌరవమిట్లు "సభారాజ, అమృతానందనాథ పారితోషిక ప్రదానము మున్నగు సత్కారములద్వారా నిలుపుటకును అస్మద్గురువర్యులచే నీ త్రిలింగపీఠము స్థాపింపఁబడినది.

3 వ పద్యము, ఆచార్యత్రయపీఠములు. శ్రీ జగద్గురువులైన శ్రీ శంకర, రామానుజ, మధ్వస్వాములచే స్థాపింపఁబడిన పీఠములు వాని శాఖోపశాఖలు.

౫. "శ్రుతేరివా ం స్మృతి రన్వగచ్ఛత్" - శ్రుతియనఁగా వేదము. స్మృతి యనఁగా మనువు పరాశరుఁడు మొదలగువారిచే రచింపఁబడిన ధర్మశాస్త్రములు.

వేదములయొక్క యములు ధర్మశాస్త్రములు ప్రచారము చేసినట్లుగా మేమును మతత్రయస్వాములకు నమస్కరించియే వారి యాశయమును దేశమందుఁ బ్రచురించుట కనేక మార్గముల నుద్యమించుచున్నాము.

పద్యము ౯. పాశ్చాత్య వ్యామోహముచేఁ గన్నులు కప్పఁబడి ధర్మమార్గము తెలుఁగకున్నారు. ఎదురుగాలిలోఁ బోవువారికి వెనుకనుండి పిలిచినవారి కేక అంద నట్లుగా నవనాగరకత యను పడమరగాలి కెదురుపోవువారికిఁ బూర్వులు చెప్పిన మాటలు చెవికెక్కుటలేదు. పుణ్య పాప విచారణ లేకుండఁబొట్టనింపుటయుఁ బ్రొద్దు గడపుటయు నొనర్చుచున్నారు. విదాహముచేఁ దృష్ణచే నోరెండిపోఁగా నొక్క చుక్కయైన బోధామృత వర్షము లభించుటలేదు. వాడిపోయిన శాస్త్రములు కళలు నను మంచిమొక్కలను కాపాడుట యెట్లోకదా!

౧౧ ప - సద్యోనిర్వృతి = వెంటనే యానందము కల్గునట్లు. అర్వాచీనుల = నేటివారల మదిలోని దురభిప్రాయములు మాఱునట్లుగాఁ బండితులు సంతసించు నట్లుగా.

పౌర్వాపర్యము = వెనుకముందులు చూచి గ్రంథమును చెప్పితిననుట.

౨౫ ప - ఘనవిభ్రాంతరాశములు మాఱుమ్రోగిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగార్ల విద్యావివాదమిందు సూచితమైనది. మీయంతటి మీరు శమింపవలయునేకాని యొరులు మీకుఁ జెప్పఁగలవారు లేరనుట.

౨౬ ప - బ్రహ్మ శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి సాన్నిధ్యమున బాలకులు కూడ కవిత్వముచెప్పుట ప్రసిద్ధము. వారి దర్శన ప్రభావముచేతను వారి గ్రంథపఠ నముచేతను పలువురు పద్యములు చెప్పువారైరి. ఇట్టి ఏకలవ్య శిష్యులు మాకెందఱో కలరని శ్రీ వేంకటశాస్త్రిగా రనుచుందురు.
(పుట ౨౯)

## గురు జయంతి 1939.

(పుట 29)
పద్యము ౧ - నైమిశారణ్య వృత్తాంతము దేవీభాగవత ప్రసిద్ధ మిందు సూచి తము. బ్రహ్మ మనోమయమైన చక్రమొకదానిని దేవతలకిచ్చి యది దొలుపు కొనుచుఁ బోఁగాఁ బోఁగా నది యెందుండి పడిపోవునో యది సత్రయాగము సలు పుట కుచితమైన చోటు. మానస చక్రము విశీర్ణమగుట యనఁగా మనోవృత్తులు నశించుట. అచ్చోట సత్రయాగము సలిపిరి. అట్లే మేమును శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ పీఠమును బ్రతిష్ఠించుటకై మానస చక్రము నక్కడక్కడఁ దిరుపతి, తుంబూరు (సువర్ణ ముఖ తీరము, నెల్లూరు మండలము) కోడూరు (విరజానదీతీరము

కడపజిల్లా) చెన్నపురి మొదలైన చోటులఁ దిప్పి కడకు విజయవాడయందు మనస్సు లయించుటచే నిక్కడఁ బ్రతిష్ఠచేసినామని యర్థము.

"ఈ స్థానము కృష్ణనామమునఁ దా విజయం బిడు" ఈ కృష్ణానదీతీరము, కృష్ణామండలము, కృష్ణభూషణగురువులకు జన్మస్థానము, కవయిత్రికి జన్మభూమి, గుంటూరి నాఁడు ప్రత్యేకముగా వ్యవహరింపఁబడుచున్నను నదియుఁ దొలుతఁ గృష్ణా మండలాంతర్గతమే. త్రిలింగ పీఠ ప్రధాన భక్తులకును జన్మభూమి. కృష్ణుఁడనఁగా విజయుఁ డను నామాంతరముగల వాఁడిచటఁ దప మొనరించి పాశుపతాస్త్రముఁ బడయుటచే నిది విజయవాడయై సకల ధర్మోద్యమములకు విజయము నొసంగునది యగుటచే మా మనసు లిక్కడ నిల్చినవి. కావునఁ ద్రిలింగ పీఠము నిందే నిల్పితి మని య ము.

౨. శ్రీ తిరుమలకొండ మీదనున్న శ్రీనివాసమూర్తిని సద్గురుమూర్తి యను కల్ప వృక్షమున కంటుగట్టి యాశాఖను శ్రీత్రిలింగ పీఠమను కుండలోనికి దించి స్థలాంతర ముల దానిఁగాపాడుకొనుచు వచ్చి యీ విజయవాడ యనుకుదుటిలోఁ బ్రతిష్ఠించితిమి. (30 వ పుట)

3. ఏటికి బెండుమాటలున్, శుష్కపిప్రియము లెండుల కని య ము. ఇందలి దుత్తము 'శూన్యహస్తము'లను లోకోక్తిని సూచించును.

౪. ద్విజోత్తములు = ద్విజులలో శ్రేష్ఠులు.

జంకి—"తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్' అను భగవద్వచనమును నమ్మి స్వధర్మమున నుండుటకు జంకి.

౫. పాపులు—నాలుగు జాతులవారును వారివారి ధర్మమును వీడుట యను పాప మొనర్చిరయే యున్నారు. ధనమే ప్రధానముగా నెంచుచున్నారు.

౬. దుర్భావులు భరతఖండములోని మంచి భావముల నెఱుంగక పాశ్చాత్య నాగరికతవలనఁ గలిగిన దుష్టభావములవారు, లోకమును దమదారికే త్రిప్ప యత్నించు చున్నారు. అట్లలో నసహ్యపడు ధీరులకుఁ బండితులకు దేవుఁడే దిక్కు. సంఘము, తెలిసిన పండితులను గౌరవింపదనుట.

3౧ వ పుట.

౯. శ్వపచవృత్తికి – మాల మాదిగలు చేయు వెట్టిపనివంటి మానరహితమైన దాస్యముకొఱకు భేదముపెట్టుకొని కలహింపరాదు.

౧౦. పరవస్తువారు పెద్దపండితులు. ఆచార్యపురుషులు. వారిలో రంగాచార్యుల వారు మిక్కిలి కీర్తిగాంచిరి. "కోశవాన్ ఆచార్యః" అను బిరుదము వారికిఁ జెల్లినది. నేటికి విశాఖపట్టణములోఁ బరవస్తువారిపుస్తకభాండారముఅర్ష పుస్తకభాండాగారము, జగత్ప్రసిద్ధి వహించినవి. ఆ పరవస్తువారి వంశమఁదగు రామానుజస్వామిగా రమృతా నంద జయంతికి సంవత్సర మధ్యక్షులుగా వచ్చినారు.

(౩౧ వ పుట ౧౨ వ పద్యము ౧౩ వ పద్యము)

ఇందు వర్ణింపఁబడినవారు భక్తశిఖామణి బిరుదాంచితులు బ్రహ్మశ్రీ శ్రీరంగం బాల సుబ్రహ్మణ్య అయ్యరుగారు. వీరు శ్రీ శృంగేరీ పీఠాధిపతులగు నృసింహ భారతీస్వాములవారి శిష్యులగు శ్రీ వాణీ ముద్రాక్షరశాలాధికారులు. గుర్వాజ్ఞ శిరసావహించి శ్రీశంకర భగవత్పాదాచార్యులవారి గ్రంథము లన్నియు సమగ్రముగా నచ్చువేయించిరి. ఇంకను దక్షిణదేశమునఁగల యమూల్యమగు సంస్కృతగ్రంథముల నెన్నెని యచ్చువేయించిరి. శ్రీరంగక్షేత్రమందు వీరొక శంకరగురుకులమును స్థాపించి యందు శ్రీ శంకరులవారియొక్కయు, తమ గురువగు శ్రీ నృసింహ భారతీస్వామివారి యొక్కయు, శ్రీ మహా త్రిపురసుందరీ అమ్మవారియొక్కయు శిలావిగ్రహము మనోహరముగా నొక విమానమునఁ బ్రతిష్ఠించిరి.

శ్రీ అమృతానందనాథ గురుజయంతిలో నొకనాటి సభకు వీ రధ్యక్షులుగా వరింపఁబడి యమృతానందనాథ పారితోషికముచేఁ బూజింపఁబడిరి.

౧౪ పద్యము. బ్రహ్మశ్రీ వావిలాల శివావధానులవారు త్రిలింగదేశమునఁ బ్రసిద్ధులు. కవయిత్రియందును వారి గ్రంథములయందు హెచ్చు గౌరవముగలవారు. వీ రాంగ్లాంధ్ర సంస్కృతములయం దపార ప్రజ్ఞగలవారు. శ్రీ విద్యారణ్యచరిత్ర. బ్రహ్మసూత్రసారము మొదలగు గ్రంథము లనేకములు రచించియున్నారు.

౧౫ పద్యము. శ్రీ రామచంద్రారెడ్డిగారు బెజవాడ వంశసంభూతులు. కవయిత్రియందుఁ గవయిత్రి గ్రంథములయందు మిక్కిలి సానుభూతికలవారు. కవయిత్రి గ్రంథములను నెల్లూరుమండలమునఁ బ్రచారముగావించిరి. ఈ గురుజయంతినాఁడు ప్రత్యేకముగ నెల్లూరునుండివచ్చి శ్రీ త్రిలింగపీఠమును బ్రశంసించిరి. శ్రీ రామచంద్రారెడ్డిగారు జమీందారులు. శాసన సభాధ్యక్షులు. ఆంగ్లమునం దాంధ్రభాషయందుఁ బారంగతులు. కవులు, నాటక కళాకోవిదులు. సంస్కృత సాహిత్య రసాస్వాదన లాలసులు. అట్టివారు గుణగ్రహణ పారీణులు, ధీరులు పూనుకొన్నచో నార్యవిజ్ఞాన బీజములు తప్పక నిల్చునని కవయిత్రి యాశయము.

## గు రు జ యం తి 1940.

(౩౨ పుట)

పద్యము ౧ – శ్రీ విజయవాడ కనకదుర్గ సువర్ణవృష్టి కురిపించినదని పెద్దలందురు. ఆ తల్లి యనుగ్రహమువలన శ్రీ త్రిలింగ పీఠముద్వారా ధర్మప్రచారమయి పండితులకుఁ దుష్టి, పుష్టి, ధర్మము, తపము, నైహికమున కుపయోగపడు కనకవర్షము నాముష్మికమునకు సుధావృష్టి బ్రహ్మానందామృత వృష్టియులభించుఁగావుత మనిభావము

పద్యము ౨– "సకలాంధ్ర భూమి కిదియొకద గుండియ" కళలతోఁ గూడినవారు సకలులు, పండితులు, పండిత రంగమున కీ పీఠము గుండియ యనగా హృదయము, ఉత్తమపండితులయొక్క యాశయము లిందుఁ గానఁబడు ననుట.

పద్యము 3 - కీ. శే. బ్రహ్మ శ్రీ మల్లాది శ్రీరామకృష్ణ చయనులుగారి జన్మస్థానము కృష్ణాతీరమందలి అమరావతి. వీరు మహీశూరు (మైసూరు) దేశమున బ్రహ్మసుందరశాస్త్రిగారి యొద్ద వేదాంత శాస్త్రము నేర్చినారు. ఉపన్యాస ధోరణిలోను గంభీరముగా మధురముగా సయుక్తికముగా భాష్య ప్రవచనము గావించుటలోను వీరగ్రగణ్యులు. శ్రీ త్రిలింగమహా విద్యాపీఠమున నీ పండిత ప్రవరుండు తన చరమదశయందు పీఠమువారి యాదరణమున రెండు సంవత్సరము లవిచ్ఛిన్నముగ శ్రీపీఠసన్నిధిలో భాష్యప్రవచనము గావించిరి. వీరు నమ్మిన ధర్మమును ధీరతతో నాచరించి యెట్టి తటినైనను జంకక చివరవఱకు ధర్మలక్షణమునకు లక్ష్యభూతులై యుండిరి.

కర్మజ్యేష్ఠులు,చయనాంతము క్రతువులు గావించి సత్సంతానముఁ బడసి పుత్రుల నాంగ్లవిద్యల పాలుచేయక స్వధర్మ ప్రచారకులగు పండితులఁ గావించిరి.

ఆకారము, ప్రజ్ఞ, సాహిత్యము, తత్త్వజ్ఞానము, కర్మశ్రద్ధ ధర్మప్రచారము శ్రీరామ కృష్ణచయనులగారి యందు సమరసభావము పొంది మిక్కిలి ప్రకాశించినవి.

(పుట 38)

పద్యము ౫ శ్రీమతి గుడిపూడి ఇందుమతీ దేవి, మహారాజశ్రీ గుడిపూడి రామారావుగారి సతీమణి. ఆంధ్ర పురంధ్రీ రత్నము. స్వస్థానవేష భాషలతో వెలుంగుచున్న విదుషీమణిని శ్రీ త్రిలింగ పీఠమువారు "కవయిత్రీమణి" యను బిరుదమిచ్చి మన్నించు సందర్భమున శ్రీ కనకాంబగారు చెప్పిన పద్యమిది.

౬. పద్యము "పండితరాజ" రాజేశ్వరశాస్త్రిగారు. ఈ మహనీయులు కాశీ నగరమున సాంగవేద పాఠశాలకుఁ బ్రధానాచార్యులు. అమృతానంద నాథజయంతి కధ్యక్షులుగా దయచేసిరి. జగత్పండితులగు నీ ధీరవరునకు శ్రీ త్రిలింగ పీఠమువారు "సర్వతంత్ర స్వతంత్ర" బిరుదము నొసంగి పూజించిరి. ఆ తరుణమున గురుభక్తావతంసులగు శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారు శ్రీవారికి రెండు నూట పదారులు నొక రజత కుంజరమును సమర్పించి యర్చించిరి. బెజవాడలో శ్రీమదమృతానందనాథ జయంతికి నీ సర్వతంత్ర స్వతంత్రు లొసంగు గీర్వాణ భాషోపన్యాసములు వేలకొలఁది జనులు మూడు దినము లాకర్ణించి వాన కురియుచున్నను లెక్కసేయక శ్రీవారి వాక్మాధుర్యమును గొనిరి.

ఆ మహాసభలో శ్రీ కనకాంబగారు శ్రీవారి యానందముకొఱకు సంస్కృతమునఁ జెప్పిన శ్లోకములివి. శ్రీ కనకాంబగారి గీర్వాణకవిత్వ మతి మనోహరము. దేవతాస్తవాంచితశ్లోకము లందఱు జీవయాత్రయందొప్పారు. కీ. శే, "విమర్శకాగ్రేసర" నాగపూడి కుప్పుస్వామయ్యగారు కవయిత్రి సంస్కృత కవిత్వము నిట్లు ప్రశంసించియున్నారు.

సీ॥ "బొండుమల్లెయ పూలదండలో

అనుబంధము - పుట 3 పద్యము 5 (చూడుడు)

౯. శ్రీశైలము "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే", శేషశైలము తిరుపతికొండ "కలౌ వేంకటనాయకః" అని ప్రసిద్ధిగాంచిన వేంకటేశ్వరునికి నివాసము. కృష్ణా గోదావరీ నదులును త్రిలింగ దేశమందు భూతలమునందు పవిత్రమైన వని ప్రసిద్ధిజెందినవి.

౧౦ పద్యము. కృష్ణరాయలు, త్యాగరాయలు, పండితరాయలును త్రిలింగ దేశమువారయ్యు లోకపూజ్యులు.

ఎల్లలోకములకు పూజ్యమైన వేదమునకు భాష్యము వ్రాసిన విద్యారణ్యులవా రుద్భవించుటచే నీ త్రిలింగదేశ మగ్రగణ్యమైనది.

౧౧ పద్యము — సుగమము.

౧౨ పద్యము — రాజేశః = రాజేశ్వరశాస్త్రిగారు

ప్రాజ్ఞరాజేశః = పండితరాజుల కీశ్వరుఁడు

సురేశ గురుసన్నిభః = ఇంద్రుని గురువగు బృహస్పతితో సమానుఁడు, సర్వతంత్ర స్వతంత్రుఁడు.

రాజరాజేశపూజితః = మహారాజాధిరాజులచేఁ బూజింపఁబడినవాఁడు.

రాజరాజు = కుబేరుఁడు, అతనివలె ఈశుఁడు సమర్థుఁడై చుండూరు వెంకటరెడ్డిగారిచే రెండు నూటపదారులచేఁ బూజింపఁబడినవాఁడని ధ్వని.

## సాహిత్యస్థాపక దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు.

(౩౪ పుట)

నెల్లూరుమండలమున పెక్కేండ్లుగా ఖ్యాతి నార్జించియున్నారు. ఘనులు = వేదము వేంకటరాయశాస్త్రులవారు సుబ్రహ్మణ్యకవిగారి పద్యధోరణిఁజూచి సభాముఖమున వారి "నభినవతిక్కన"యని ప్రశంసించిరని ప్రతీతి.

(౩౫ పుట)

కవిపుత్రుఁడు = వీరిపుత్రుఁడు కవి - కవిగురుండు = వీరిశిష్యులు కవులనేకులు గలరు.

కృష్ణగురుమిత్రుండు=కృష్ణభూషణుం డను నామాంతరము గల యమృతానందనాథస్వామివారికి మిత్రుఁడు. వీరి పద్యములు గురుపరంపర వ్యాఖ్య చివర చూడనగును.

## గు రు జ య ం తి 1941.

## గు రు ప రం ప ర

౧. నారాయణుఁడు బాలకుఁడై మఱ్ఱాకున బండియుండి పరాశక్తిచే "సర్వం ఖల్విదమేవాహం నాన్యదస్తి సనాతనమ్" అను సర్ధశ్లోకభాగవతము నుపదేశింపఁబడినట్లు దేవీభాగవతమునఁ బ్రసిద్ధము.

౨. బ్రహ్మ రెండవగురుఁడు. భాగవతమున ద్వితీయ స్కంధమునందుఁ బ్రసిద్ధమైన గాథ యిది. తామర తూఁ డరయలేక తనస్వరూప మెఱుంగలేక "తప తప" యను రెండుమాటలు వినంబడిన పిదప తప మొనరించి బ్రహ్మ వైకుంఠుని దర్శించి నట్లున్నది.

3. సర్వ సంపత్ప్రదమగు వసిష్ఠుని హోమధేనువును విశ్వామిత్రుఁ డిమ్మని యడుగుటయు నందుల కతఁ డంగీకరింపక యుండుటయు, విశ్వామిత్రుఁడు తన క్షాత్త్రబలముతో వసిష్ఠునిఁ దాఁకి బలవంతముగా నా హోమధేనువును గొంపోవఁ గడంగియు నాతఁడు బ్రాహ్మణబలమునుందుఁ దన క్షాత్త్రబలము చాలకపోవుట యెఱింగి చింత నొంది ఘోరతపం బొనరించి బ్రహ్మర్షియైన వృత్తాంతము పురాణప్రసిద్ధము.

4. వసిష్ఠుని కుమారుఁడు శక్తి, శక్తి కొడుకు పరాశరుఁడు. పరాశరుని బాలమందే తండ్రి స్వర్గమునకేగెను. బాలుఁడు తనతండ్రి యేడని తల్లినడిగెను. నాయనా అంతటి భాగ్యమా! నీ తండ్రి స్వర్గతికిఁ బోయెనని యనెను. నేను నాతండ్రిని చూచి తీరవలెను. చూపెదవా లేదా ? అని తల్లిని బాలుఁడు బలాత్కరించెను. నాయనా! నీవు నీతాత నడుగుము. అతఁ డేదేని యుపాయముఁ జెప్పు ననియెను. అంత పరాశరుఁడు తాతయొద్దఁ బంచాక్షరీ మహామంత్రముపదేశమయి దాని బలంబున దివికేగి తన తండ్రినిఁ జూచివచ్చెను. దివికిఁబోయిన తన్ను శరీరముతో వచ్చిచూడ శక్తి గలిగిన పరాశరుఁడను సుతుని గనిన శక్తి గలవాఁడు "శక్తి" యని యనుము. ఈ శక్తి నాల్గవ యాచార్యుఁడు. ఆ పరాశక్తినామము కేవల మీరీతి ధరించి వాఁడు మఱియొక్క గురుఁడు లేఁడు.

(3౬ పుట)

౫ పద్యము పల్లెపిల్ల సత్యవతి. ఈమె వసురాజు కూతురు. దైవయోగమున దాశరాజునింటఁ బెరుగుచుండెను. పరాశరమునీశ్వరుం డీ చిన్నదానియందుఁ దన తేజంబునుంచి వ్యాసునిఁ బుట్టించి యామె కన్యాత్వము దూషింపఁబడ కుండునట్లు వర మొసంగెను.

౬. కలిసియున్న వేదంబుల చిక్కులు విడఁదీసి నాలుగుగాఁ బంచెను. విభజించెనని యనుము. పుత్రునికై తపమ్మొనర్చి వరంబుఁ గాంచి వ్యాసమహర్షి వివాహము లేకయే శుకునిఁ గుమారునిగాఁ బడసెను. శుకరూపము ధరించిన ఘృతాచి యను నచ్చరమచ్చెకంటినిఁజూచిన బాదరాయణునిమనస్సు చలించి రేతస్స్ఖలనముగాఁగా నుద్భవించె శుకుఁడని పురాణ ప్రసి ము.

౭. సమాధినిష్ఠుఁడగు శమీకునిపై నలిగి యాతని మూపుపై భుజగశవంబు వైచి తత్పుత్రుఁడగు శృంగి వలన నేడు దినములలోఁ జచ్చునట్లు శపింపఁబడి ప్రాయోపవిష్టుఁడై సద్గతికై తపించు పరీక్షిన్న రేంద్రు ననుగ్రహించి శ్రీమద్భాగవతం బుపదేశించి సప్తాహంబులలో మోక్షసిద్ధి గలిగించిన మహానుభావుఁడు శుకమహర్షి లింగభేద మెఱుంగఁడు. తనప్రోల వలఁవలు విడిచి జలకములాడు వేలుపుఁ జెలువలఁ దిలకించియుఁ జిత్తమున నెట్టి వికృతియుం జెందని ధీరుఁడు.

౮. శుకమహర్షి కిఁ దరువాత గురుండు గౌడపాదాచార్యులవారు. వీరు గౌడ పాదకారికలు రచించిరి.

౯. గోవిందయోగీంద్రుఁ డెన్నఁడు బాహ్యసంచారము చేసియుండఁగరు. గుహయందుండియు జగద్గురుం డగు శంకరునకు సంపూర్ణతత్త్వము నుపదేశించిన మహనీయుఁడు గోవిందయోగివిభుఁడు. 'సర్వమూర్తిద్రవ్యసంయోగిత్వం విభుత్వమ్', గుహను గూర్చుండియుఁ దన విభుత్వముచే లోకమంతయు నాక్రమింపఁగలవాఁడు గోవిందయోగి యనుట.

౧౦. శ్రీ శంకర భగవత్పాదులవారు దిగంతవిశ్రాంతయశోవంతులు. వారి మొదలు స్వగురుపర్యంత మగు నాచార్యపరంపర పూజ్యమైనది. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠస్థాపనాచార్యు లగు నమ్మృతానందనాథస్వామి వారు కవయిత్రికి గురువులు.

౧౫ ప. ఆతతాయిగిరిజంభారాతి - శత్రువు లను కొండలకు దేవేంద్రునివంటి వాఁడనఁగా రెక్కలు కత్తిరించువాఁడు. వీరి ప్రతాపమున కోర్వలేక యనేకులు మాంత్రికులు వీరిపై ప్రయోగములు సేయుచుండెడివారు. వారి యభిచారములకుఁ బ్రత్యేక ప్రతిక్రియలు చేయనక్కఱలేక యే యొక మాటొక జపమాల మంత్రించి యచ్యుతగురువులు ద్వారమునకు బయట వేలఁగట్టుచుండువారు. ప్రబలమైన శత్రు ప్రయోగమున కొక్కొక్క పూస పగిలెడి. గురువులు సంతతము శివభక్తిపూజా పరులైయుండిరి. షట్ప్రయోగములు మంత్రశాస్త్రప్రసిద్ధములు.

౧౬ ప. మల్లాదిబిరుదు - మల్లులలో మొదటివాఁడనుట. దీనికొక గాథకలదు. తన మేనగోడలి యింటిపెరటిలో శత్రువులు ముగ్గులు పెట్టి నిమ్మకాయలు కోసి యేమేమో చేయుచుండఁగా నామె భయపడి వచ్చి వారితో విన్నవించుకొనియెను. అంతట శ్రీవారువచ్చి రహస్యముగా నింటి పంచలోనుండి యాతతాయు లైదుగురు వచ్చి ముగ్గులు పెట్టుచుండఁగా నయ్యైదుగురి నొక్కమాఱుగా జుట్టులు కలిపి పట్టుకొని పాదరక్షప్రయోగముచే దేహశుద్ధిచేసి శరణాగతులైనంత వదలిరి. పశుజనుల పట్ల షణ్మంత్రయోగములకన్న నీతిశాస్త్రమందలి పంచతంత్రములనే యమ్మహనీయుఁడు ప్రయోగించువాఁడు.

ప్రబలదీక్ష నచ్యుతుం డన - దీక్షనుండి చ్యుతియనఁగా జారుపాటు లేనివాఁ డగుట నచ్యుతుఁడు. రాముఁడు - బ్రహ్మ యందు రమించువాఁడు, భక్తులను రమింపఁ జేయువాఁడు. అచ్యుతరామ గురుమూర్తి నామసార్థక్యము నిరూపించుచు శ్రీవారి శిష్యులు యోగానందనామాంకితులు కోరాడ నాగేశ్వరశాస్త్రి గారిట్లు గురుస్తవ మొనరించిరి.

శ్లో॥ శ్రీయోగినం సదానంద మచ్యుతం రామమాశ్రయే
లభ్యతే హి యతో జ్ఞానం తారకం భవనాశకమ్.

కవయిత్రియు నదే నామవిభాగ మవలంబించినది.

౧౭. కొరాడ రామచంద్రశాస్త్రిగా రాధునిక సంస్కృత కవులలో నగ్రగణ్యుఁడు. ఘనవృత్తము, శృంగార సుధార్ణవము, కుమారోదయము, దేవీవిజయము మొదలగు నుత్తమగ్రంథము లొక శతము రచించినారు.

౧౮. సురభాషా కవిచంద్రులయిన కొరాడ రామచంద్రశాస్త్రిగారి ధారణ యసాధారణము. తెల్లవారుజామున వారు కాలినడకను బొలములు దిరిగివచ్చు సమయమునఁ బద్యములను నూటికిఁబైఁగా ధారణపట్టియుంచి యింటికివచ్చి తమ యనుష్ఠానమును దీర్చుకొని తీరి కూర్చుండునపు డా పద్యములన్నియు వరుసను వ్రాయుచుండువారు. ఇట్లు వారు రచించిన గ్రంథము లొక నూటికిఁబైఁగా ముద్రితములు, నముద్రితములును బ్రహ్మశ్రీ కొరాడ రామకృష్ణయ్య ఎం. ఏ., గారి యింటనున్నవి. రామకృష్ణయ గారు మదరాసురాజధాని విశ్వవిద్యాలయ పరిశోధనశాఖయం దాంధ్రమున బ్రధానోపన్యాసకులుఁగ నున్నారు. వీరు శ్రీరామచంద్ర కవికులతిలకుని పౌత్రులు.

౧౯. శిష్టుకృష్ణుని - శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారిని గొరాడ రామచంద్ర శాస్త్రిగారు మున్ను శ్రీకృష్ణునిఁ గృష్ణుఁడు (అర్జునుఁడు) కొలిచినట్లు కొలిచెను. రామచంద్రశాస్త్రిగారి సాహిత్యగురువులు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు. ఆ గురుశిష్యుల యోగముచూచి పండితులందఱుఁ బరమానందము నొందుచుండిరి. సమకాలికుల యందేమి ముందేమి ? వెనుకేమి ? శిష్టు కృష్ణమూర్తి కవిచంద్రుని సాహిత్యమువంటి సాహిత్య మితరులయందుఁ గని విని యెఱుంగము.

వైదికుఁడు, సర్వశాస్త్రవేత్త, మహావైణికుఁడు, సంగీతశాస్త్ర పారంగతుఁడు, సకల లోకమునందు సకల రాజాస్థానములయందు మన్ననగన్నవాఁడు. ఆంధ్రదేశమున నేటికిని బురాణముఁ జెప్పు సంప్రదాయ మా కృష్ణకవిచంద్రుని యనుకరణమే. ఆకాశపురాణ మను ప్రజ్ఞావిశేష ప్రదర్శన మీ మహనీయుఁడే ప్రారంభించెనని తోఁచుచున్నది. ఏ గ్రంథమైనఁ గొన్ని పుటలుఁ దొలగించి యా సాహిత్య చక్రవర్తి కిచ్చిన నాతఁ డా గ్రంథముఁ జదువుచు లోపించిన పద్యముల నున్నవానినే చదువుచున్నాఁడా యనిపించునంత తొందరగా గ్రంథకర్త కవితాధోరణికిఁ దులఁదూగు శైలితో నూతన శ్లోకము లల్లి పురాణము చెప్పుచుంటఁజూచి యతండు పుమాకార సరస్వతి యని చూచినవా రనుకొనుచుండిరి. వీణావాదన కౌశలమునఁగూర్చి యమ్మహనీయుఁడు రచించిన మాలిక యనుపమానము. గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారు రచించిన యాంధ్రకవుల చరిత్రమున నీ కవివరేణ్యుని చరితలోని కొన్ని యంశములు గలవు. పిండిప్రోలు లక్ష్మణకవి యీతని సమకాలికుఁ డగుటచేఁ గొంత ప్రశస్తి గాంచెను. పాండిత్యమునందు లక్ష్మణకవి కృష్ణమూర్తికవికిఁ జాలఁడని యొప్పుకొనుచుఁ జరిత్రకారుఁడు గొన్ని మాటలలో నతఁడు కృష్ణమూర్తికవిని మించిన ట్లేవో కొన్ని గాథలు ప్రకటించిరి. అవన్నియు లక్ష్మణకవికిఁ బ్రఖ్యాతి గూర్చునవియే కాని కృష్ణకవి కపకర్ష గలిగింపనోపవు. శిష్టు కృష్ణమూర్తిగారి 'హరికారికలు' 'కంకణబంధము' వారి పాండిత్యప్రౌఢిమ నాచంద్రతారకముగా వెలయించుచున్నవి. వారి శిష్యపరంపర

యేతత్సంగీత కళావిశారదత్వము వెల్లడించుచున్నది. ఒకప్పు డొకకవి తాను రచించిన పద్యము లీకవిచంద్రునికిఁ జూపెనఁట. తన కవిత్వము నిర్దుష్టమన్న గర్వముతో నతఁడు 'బాబూ! అంతసేపు చూచుచున్నారు తప్పులా?'యని యడిగెనఁట. దానికిఁ గృష్ణమూర్తిగారు 'లేదు నాయనా! ఒప్పులే చూచుచున్నా'నని సమాధానము చెప్పిరట. 'తప్పులకేమి? సమృద్ధిగా నున్నవే. ఒప్పులకొఱకే యింత సేపు చూచుచున్నా' నని దీని యర్థము. 'మీరుమాలా?'అని లక్ష్మణకవిగారడుగఁగాఁ గృష్ణమూర్తిగారు 'ఔ మాదిగా' యన్నారఁట. ఇట్టి ప్రత్యుత్పన్నమతి గల కృష్ణకవిచంద్రుని మాటల కంటతన మడుగవలెనా?

౨౦. బ్రహ్మశ్రీ ఇంగువ రామస్వామిశాస్త్రిగారు మంత్రదీక్షా గురువులు. రామస్వామిశాస్త్రిగారు సకలప్రయోగము లెఱింగినవారనియు, మహారాజు లెందఱోని వారి యనుగ్రహమునుగోరి తమతమ కార్యములయందు సిద్ధిఁబడయు చుండిరనియుఁ బ్రసి ద్ధి లోకమం దున్నది. ఇందు శ్రీ శిష్ట కృష్ణగురువులను గుఱించియు, రామస్వామి గురువులను గూర్చియు శ్రీరామచంద్రశాస్త్రిగారు తమ శృంగార సుధార్ణవము నందును, కుమారోదయ మందును నిట్లు రచించియున్నారు.

శ్లో॥ యదీయాహ్నా యత్రిప్రథిమవిజితో౽భూజ్జలజభూః
పితుర్జాడ్యాశంసీ చకిత సకలాశాకృతముఖః
సమాచుః ప్రాంచో యత్ప్రకృతి జనుషః పుష్కలకలా
స్స విద్వత్కోటీరో భువి జయతి కృష్ణాభిధ బుధః.

శ్లో॥ యేన స్వైర మకారి సారశరణం వేదాననం శక్రవై
రూప్యాదాత్మ సరస్వతీ స్వజనితాం సీతా పరం ప్రాణితా
సత్కాణాదకళా౽భవత్కృతపరిష్వంగేవ గాంధర్వికా
మీమాంసాసరణౌ పదాని మృదితా న్యశ్రాంత మశ్రాంతితః.

శ్లో॥ తాదృక్ ఛిష్టకుల ప్రకాశనకర శ్శ్రీసక్తి నిత్యోత్సవః
స్వాచ్ఛందం వసుదేవపోషణమనా శ్చంచత్కలాభావుకః
దృప్యత్పూర్వబుధప్రధావృతి లసత్సాదర్శన శ్రీకరః
శ్రీకృష్ణస్సుమన శ్శిరోమణి రిరా కామి ప్రసూనుః పరమ్.

శ్లో॥ మంథానక్షోణిభృత్సంక్షుభిత శరధిరాడ్గర్భ గర్భాయమాణా
దభ్రోద్యద్భంగ భంగ ప్రతిఘటన ససరంభభంగీ ప్రగల్భాః
సంవర్తానేహ సాధ్యున్మద సలిలవహా వ్యూహనిష్ఠ్యూత ధారా
పారంపర్యాద్భటోత్పాటన పటుతర సద్విభ్రమాసాన వాటాః.

శ్లో॥ యద్వాగ్గుంభాశ్శుశుంభు ర్భుజగపరిబృఢాక్షీణసంక్షీబభావో
త్పక్షప్రత్యర్థి దృప్యత్కనకధరలసచ్ఛృంగభంగాధిసృష్టౌ
ప్రోద్యజ్జంఝూనభస్వద్భ్రమణ గణలసద్గుంభ శుంభ న్నగర్భాః
ప్రావృడ్ధారాధరాఘోద్భవ దశనిసమార్భట్యధిక్షేప దక్షాః.

శ్లో|| శరద్వ్యాకోచాంభోజనివనవిహారోన్మదసిత
చ్ఛదశ్రేంకారాహంకృతి హృతి కలాకల్పకలనాః
పి యాలోకోల్లాసి స్మర తదభి కాకర్షణ మనః
కురంగాక్షీపాదాంగద మధుర శింజాసహచరాః.

శ్లో|| తదనుగ్రహ నారితాజ్ఞతా జనితాంచత్కవితావతారకః
కృతి గుంభిత మాధురీభరో వరకౌండిన్య శుభాన్వయోదయః.

శ్లో|| తపశ్చర్యాయత్త్రీకృత పరమ దేవీ వరకృపా
ఝురీధారాధౌతాధిక జడిమ జంబాల విమలైః
స్ఫుటీకుర్వ ద్విస్ఫ్వ్యాంసకల సుకలారామవిహృతౌ
బుధేంద్రైస్సాకల్పై రుచిర కలకంఠాఖ్య బిరుదమ్.

శ్లో|| తాదృక్కోకారాడ వంశే సముపగత జనిర్లక్ష్మణార్య స్సుమిత్రా
నంద శ్శ్రీరామ పాదాంబుజ భజన సమాయత్తచేతః ప్రవృత్తిః
తత్పుత్రః కృష్ణకృష్టిట్పరిచరణ లసద్భవ్య వాగ్గుంభ భార
స్సుబ్బాంబా గర్భసింధోరివ మణి రభవ ద్రామచంద్రస్సుధీంద్రః.
(శృంగార సుధార్ణవే)

శ్లో|| శ్రీరాజచ్ఛిష్ట హింగ్వన్వయ జలధి సుధా దీధితీ కృష్ణమూర్తి
శ్రీ రామస్వామి సూరీ వివృతతర మహాభాష షడ్దర్శ కౌ
విఖ్యాతౌక్ల ప్త నానాకృతి కృతి నిచయాత్ వ్రచర్యై స్తపోభిః
శుశ్రూషయాస్సమా ధే ర్య మనుజగృహతుః పుత్రవాత్సల్యలక్ష్మ్యా.
(కుమారోదయే)

౨౧ ప. యోగానంద దీక్షానామకుఁడగు గురువరుఁడు శ్రీరామచంద్ర సద్గురువుల కుమారుఁడు శ్రీ దుర్గా నాగేశ్వరశాస్త్రిగారు. అతి శాంతుఁడు, సర్వకాలముల యందు సమముగా నుండువాఁడు. ముని, మౌనముతోఁ దుల్యమగు మితభాషి. సాధిత సర్వార్థుఁడు. సమస్తమైన ప్రయోజనములను సాధించినవాఁడు. పరమ ప్రయోజనమగు మోక్షమును సాధించినవాఁడనుట. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సర్వమనఁగా బ్రహ్మమని యర్థము. సర్వమను నర్థము సర్వార్థము. బ్రహ్మమను నర్థము, దానిని సాధించినవాఁడు. ఏకాంతుఁడు- గోష్ఠియందు విముఖుఁడు; మహాముద్రాధారియై యుండువాఁడు. రామచంద్ర పరిచర్యోత్సాహి, దుర్గా నాగేశ్వరశాస్త్రిగారి నిద్ర గాఢమైనది. వీధిలో నఱుగుమీఁదఁ బరుండి శివగంగోత్సవ కోలాహలము సన్నిహితమైనను మేల్కొననివాఁడు. లోపల నుండి తండ్రిగారు 'అబీ' యని పిలువఁగానే 'ఆ' యని లేచి వారి చెంతకరిగి తత్కాలోచితోపచారము చేయ వచ్చుచుండువారు. ఆద్యయోగులు - మొట్టమొదటి తపసులగు సనకసనందనాదులు మెచ్చుకొనఁదగు చిత్తపరిపాకము గలవాఁడు.

౨౨. మాగురుదేశికుండు - కవయిత్రికిగురుండైన యమృతానందనాథస్వామికి గురువులైన నాగేశ్వరశాస్త్రిగారు పిల్లవానివలెఁ బిచ్చివానివలెఁ బిశాచమువలెఁ గానఁబడుచు నవధూతలు తమ నిజతత్త్వమును దాచెదరన్నమాట వీరియందుఁ జెల్లును. అనిమేషులై కన్నులు తెఱచుకొనియుండియు నంతర్లక్ష్యమును జూచుచు, బాహ్యప్రపంచమును గుర్తింపక, తాదాత్మ్యము ననుభవించుచు నుపాధినిబంధనమును దాటి యెల్లయెడలఁ దామై బ్రహ్మానందము ననుభవించుచుండిరి.

౨౩. ఒకమారు చెన్నపురిలోఁ దన కీ్రఁగడుపున లేచిన వ్రణమును మత్తుమందు లేకుండఁ గోయవలయునని నాగేశ్వరశాస్త్రిగారు వైద్యులకు సూచించిరి. ఈ వృద్ధుఁడింత దారుణమైన కోఁతను భరింపఁగలఁడా యని శంకించియు శ్రీవారియందుఁ గల గౌరవముచే వైద్యులూరక శస్త్రముచేయుట కుపక్రమించిరి. శాస్త్రిలవారు కన్నులు తెఱచుకొనియే బల్లపైనఁబరుండిరి. కత్తులు, కత్తెఱలు, కారులు వినియోగపఱచి కోయవలసిన కోతయంతయునై కట్టుగట్టి మంచముమీఁదఁ బరుండఁబెట్టుటకుఁ దమయొద్దకు వచ్చిన వారినిఁజూచి నాగేశ్వరశాస్త్రిగారు "ఇఁకను బ్రారంభింపరేమి?" యని యడిగిరి. వైద్యులు శ్రీవారి స్థైర్యము యోగసిద్ధియుఁ జూచి యాశ్చర్యపడిరి.

౨౪. మంత్రివాది సూర్యనారాయణశాస్త్రిగారు మహావిద్వాంసులు. వీరిది నూజివీడు సంస్థానము. మంత్రివాది శ్రీరామశాస్త్రిగారి కుమారులు, శ్రీరామశాస్త్రిగారి వ్యాకరణపాండిత్య మనన్యమగుటయేగాక వారి వాక్సిద్ధి జగత్ప్రసిద్ధమైనది. రాజసభలో నధికారమత్తుఁడొక మహాపండితగోష్ఠిలో "వేదములన్నియు బ్రాహ్మణులు తమకనుకూలముగా వ్రాసికొన్న గ్రంథములుగాని యపౌరుషేయములుగావు" అని యధిక్షేపించుచుండెనఁట. శ్రీరామశాస్త్రిగారొకటి రెండు మాఱులు సైరించిరి. మూఁడవమాఱుకూడ నట్టులే యాతఁడనువఱకు "వేదము నిందించినవానినోట పుండు పుట్టదా!"యని శాస్త్రిగారన్నారనియు నటులనే మండలము దినములలోపుగా నాతనికా త్రి కలిగినట్లు నైతిహ్యము శిష్టులలో నేటికిని వినఁబడుచుండును.

వాక్సిద్ధిఁగన్న పండితుఁడని తపస్వియని మంత్రివాది శ్రీరామశాస్త్రిగారినిఁ జూచిన ప్రభువులు ప్రజలు భయభక్తులతో మెలంగుచుండిరి.

మంత్రివాది సూర్యనారాయణశాస్త్రిగారు మహాభాష్యాంతము వ్యాకరణ మసంఖ్యాకులగు శిష్యుల కధ్యాపనముచేసిరి. శ్రీమాన్ పరవస్తురంగాచార్యుల వారికి శాస్త్రిగారు సమకాలికులు. ఒక్క వాక్యార్థములోఁ బరవస్తు రంగాచార్యులవారిని వీరు నిరుత్తరుల్నుగాఁ జేసిరఁట. అచటనున్న సభ్యులలో నొకరు "శ్రీరంగాచార్యుల వారి కన్యభాషలుగూడ వచ్చు" నన్నారఁట. అందుపై సూర్యనారాయణశాస్త్రిగారు "అవి నేఁ జదువలేదుగాని ఇందులో నెంతో యందులోఁగూడ నంతే"యన్నారఁట. ఇందులో గెలిచినట్లే యన్నిటిలో నేనుగెలుచువాఁడనే యని వారియభిప్రాయము.

శ్రీకోరాడ నాగేశ్వరశాస్త్రిగారు శుక్రవారమురాత్రి బందరు బయలుదేరి శనివారము నాఁడుదయమునకు నూజివీడువచ్చి శని, ఆదివారములు సూర్యనారాయణ

శాస్త్రులవారియొద్ద వ్యాకరణశాస్త్రముఁ జదివి యాదివారమురాత్రి బయలుదేఱి సోమ వారము బందరువచ్చి నోబులు కాలేజిలోఁ దమ యుద్యోగమున కందుకొనుచుండు వారఁట. ఈప్రకారముగా నైదువారములు నూజివీడు వచ్చి యంతలోనే వ్యాకరణ శాస్త్రము సమగ్రముగా నిస్సందేహముగా నాగేశ్వర శాస్త్రులవారు గ్రహింపఁ గల్గి రఁట. ప్రతిభావంతుల శక్తి ప్రతిభావంతులకే విదితముకదా

౨౫. రామచంద్రీయమని యొక పత్రిక నెలకొల్పి నాగేశ్వరశాస్త్రిగారు తమ తండ్రిగారి గ్రంథములు కొన్ని యచ్చుఁ గూర్చిరి. కొన్నిటికి వ్యాఖ్యానములు రచి యించిరి. భాష్యాములను గావ్యములఁబోలె నవలీలగా బోధించిరి. ఒకరి నాశ్రయిం చుటగాని యనుకరించుటగాని నాగేశ్వర శాస్త్రిగా రెఱుంగరు. ఈశ్వర దత్తమైన లక్ష్మీ ఘనముగా జీవించుటకు వారే నిదర్శనము.

౨౬. గోవింద యోగీంద్రులవంటి యంతర్ముఖులు నాగేశ్వర శాస్త్రిగారు· శంకరాచార్యులవంటి ధర్మ సంస్థాపకులు శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యా పీఠ సంస్థాపనాచార్యు లగు నమృతానంద నాథస్వాములు.

39 పుట. పద్యము ౨౯.

కుశాగ్రబుద్ధు లందని వినువీథిఁబట్టి, - ఎంత బుద్ధిసూక్ష్మము కలవారును నందు కొనలేని విహంగ మార్గ మవలంబించి.

30 వ పద్యము. మూఁడవ పాదము. "చదివితె మేలు మేల్ పయిన సాగఁగ నిమ్మను" ఈరీతిగాఁ జదువవలయును. శాస్త్రులవారి యనుజ్ఞ చేతనే తమకు శాస్త్రబో ధము కలుగఁగలదని యమ తానందులవారి విశ్వాసము. మహాభాష పాఠ మారంభింపు మని చెప్పి నాగేశ్వరశాస్త్రిగారు నిద్రపోవువారు. 'ప్రారంభింపు మని యాజ్ఞదక్క విరమింపుమని యాజ్ఞ యుత్తరువు లేనందున శిష్యు లట్లే చదువుచుండు వారు. శాస్త్రుల వారు నిద్రలేచి "మీరింకను జదువుచునే యున్నారా?" యని యడుగఁగా 'విర మింపు'మని యాజ్ఞలేనందునఁ జదువుచున్నామని శిష్యులు బదులుచెప్పిరి. మేలు పైనఁ బాఠము సాగని'మ్మని గురువులు చెప్పిరి. ఇట్టి గురుశిష్యుల యేకాంతానుభవము "అభ్యనుజ్ఞనే చదువులఁ బాడుకొల్పెదరు ఛాత్రుల మానసమందు సద్గురుల్" అను నర్థాంతరన్యాసమునఁ గవయిత్రి స్పష్టపఱచెను.

3౧. శ్రీకంఠునేఁ - సర్వజ్ఞునైనను వాదమునందు గెల్చునని భావము. దగ్గఱ త్రోవ గురుమంత్ర దేవతావిశ్వాసం. పామరు లది యెఱుంగలేక "యేదో దగ్గఱ త్రోవ యుండవలెను. మనకది తెలియు"దని యనుకొనుచుండువారు. మహామంత్రాను ష్ఠానపరుల యొకుట 'సర్వవిచ్చ జడతి" సర్వజ్ఞుఁడుకూడ జడునివలె శోభింపఁడు.

3౨. ఆత్మప్రకాశమున కహంకారమే అడ్డము. గురుసేవచే నహంకార మడఁ గినవారి కంతయుఁ బ్రకాశమే. వారికి శాస్త్రాధ్యయనము నిమిత్తమాత్రమే. మహా భాష్యముఁ జదువుచుండఁగా నొకనాఁడు నాగేశ్వరశాస్త్రులవారు "అహంకార మడఁ గిన శాస్త్రములే యడ్డములేక యమగు" నని రఁట. గురుమూర్తి యీ మాటయన్న

తోడనే యంతకుఁ బూర్వము విలాసముగఁ బెంచుకొన్న శిఖాశ్మశ్రువులు తీసివైచి జోలెకట్టుకొని మధుకరముచేయుచు నమృతానందులు భాష్యము చదివిరి.

38. ఒకనాఁడు శివరాత్రినాఁడు కృష్ణభూషణస్వామి శివాలయమునకుఁ బోవ సంకల్పించి శివగుర్వైక్య రసపానావేశమున నొడలెఱుంగక యె శివాలయము దారివిడిచి గురుమందిరమును బ్రవేశించెను. అప్పటికి నాగేశ్వర శాస్త్రులవారు "శివోఽహం" మ్మనుకొనుచు నైక్యానుసంధానము చేయుటంగాంచి సద్గురువులకుఁ బ్రదక్షిణించి తాఁదెచ్చిన నారికేళ ఫలమునందె సమర్పించి హారతి నొసంగి నమస్కరించి నిశ్చింత ముగఁ గృష్ణభూషణస్వామి యింటికరిగిన వృత్తాంతమిందు సూచింపఁబడినది. "శివాయ గురవేనమః" శివగురువుల కైక్యము సి ము. అదియే 'శివోఽహమ్' అనుకొనుచుఁ దత్పరతఁ అను శబ్దమువలన స్ఫుటతరము గావింపఁబడినది. అట్టి గురుమూర్తితోఁ బన్నగభూషణుం డైక్యానుభవము నొందె ననుటచేఁ గవయిత్రి సర్వము శివమయముగ వర్ణించినట్లయినది.

39. కృష్ణభూషణస్వామి ప్రథమభార్య సీతారామాంబిక. భర్త కనురూప ముగ మానస వ్యాపారమునం దభేదముగ వర్తించిన మహాపతివ్రతాశిరోమణి మూఁడు నాలుగు సంవత్సరములు మాత్రమే కాపురము చేసి కాలధర్మము నందెను. అట్టి ధీరగేయ యగు గురుజాయకుఁ గవయిత్రి మ్రొక్కుట వర్ణింపఁబడినది.

39. ఉండు దండిగన్ - కృష్ణభూషణస్వామి ప్రథమభార్యా వియోగ మైన నాటినుండి 12 సంవత్సరములు వివాహమునూటయే తలఁపక మంత్రయోగనిష్ఠలో నుండి తమ్ముఁడైన సత్యనారాయణశాస్త్రి వివాహముచేసి "తాను త్రిదండి నయ్యెద" నని అనఁగా "సన్యసింతు"నని నిశ్చయించుకొని యుండఁగా హఠాత్తుగా సోదరుఁడు పోవుటయు వంశవిచ్ఛేదము సహింపఁజాలక తల్లిగారు దుఃఖించుటయు, వివాహము చేసికొని మాతృశోక పరిహారము చేయవలసినదని శాస్త్రులవా రాజ్ఞాపించుటయుఁ దట స్థించుటచే భూషణస్వామి యిది యంతయు దైవికము సి మని యెంచి 'బ్రహ్మశ్రీ రాళ్లపల్లి సన్యాసయ్యగారి కుమారికయగు శ్రీమతి సుప్రసన్నమ్మ' యను సాధ్వీమణిని పెండ్లియాడి యామెవలన రాముఁడు, సోముఁడు నను హరిహరాత్మక నామంబు లుంచఁబడిన సుతులను గాంచిరి. కృష్ణభూషణస్వామి గృహస్థాశ్రమమున నతిథి పూజకు లోటులేకుండ దండిగ నుండెను. అనఁగా గొప్పగ నుండెను. ఆయన అంతరంగమున దండిగన్ (దండము ధరించినవాఁడు - సన్న్యాసివలె) సంసార లేప మేమియు నంటకుండునట్లు సంచరించి రని భావము.

"మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షతతమాః" అను శాంకరవచనము నకు భూషణస్వామి లక్ష్యముగా నుండెను.

---

ఈజయంతి సందర్భమున బ్రహ్మశ్రీ సాహిత్యస్థాపక దూర్భా సుబ్రహ్మణ్య
శర్మగారు స్వామివారిని గూర్చి రచించిన పద్యములు క్రింద
పొందుపరుపఁబడినవి.

# అమృత సంస్మృతి

సీ॥ 1 ప్రథితి నెయ్యదనఁ గోరఁడుగాక కోరిన, విశ్వవిఖ్యాతుఁడై వెలయకున్నె?
2 వాఙ్ముఖకలన కొప్పఁడుగాక యొప్పిన, నెనయకయున్నె వాగీశసంజ్ఞ?
ప్రభుల సన్నిధినిఁ జేరఁడుగాక చేరిన, సచివముఖ్యుఁడై చనకయున్నె?
అడిగినఁగాని చెప్పఁడుగాక చెప్పిన, జ్ఞానసుధ 3 సమోర్విఁ జల్లకున్నె?

గీ॥ ఉన్నవని లేవనియుఁ జూపనొల్లఁడనియుఁ, బరిచితులుభక్తులొక్కరొక్క రుపచించు
సిద్ధులకు దవ్వయి నిజాత్మసిద్ధిగన్న, పూర్ణపురుషుండు శ్రీకృష్ణభూషణుండు.

సీ॥ ఒకమాట చాలు నాటుకయున్న బహుజన్మ,విచికిత్సలను వికావిక లొనర్ప;
నొకలీల చాలు వారక బ్రహ్మవిదుని చేష్టితము లిట్లుండునన్ మతిఁదలంప;
నొకనవ్వు చాలు నంతికగతులగువారి దుర్దైవయాతనన్ దులిపివైవ;
నొకగర్జ చాలుఁ బాయక యెంతస్వైరినే, విపథంబునకుఁ బాపి వినతుఁజేయ;

గీ॥ నొక్క త్రుటి చాలు నితఁడెవ్వఁడో,మహాత్ముఁ,డరితిమనతోడమాటాడెననిగ్రహింప
నప్రధృష్యుడు నభిగమ్యుఁ డార్ద్రబుద్ధి, పుణ్యచరితుండు శ్రీకృష్ణభూషణుండు.

సీ॥ "వైద్యరాజ"ఖ్యాతి వఱలిన శ్రితునిఁ బం,డితరాజుఁ జేసిన వితతదయుఁడు;
"కవయిత్రి"మాత్రగాఁ గ్రాలుధీమతినిఁ బా,వనతత్త్వవేత్త్రిఁ జల్పినఘనుండు,
"ఆనందనాథ" విద్యా సంప్రదాయంపుఁ, జరమదీక్షను గొన్న శాక్తవీరుఁ
డఖిల భారతభవిష్యద్భాగ్య కలన కే,తత్ప్రతి నిలిపిన ధర్మనిరతుఁ

గీ॥ డపరగురునకుఁ దగిన ప్రజ్ఞాతిశయము, బ్రహ్మవిదుని స్వత్వంబైన భయరహితత
కడఁగిమూర్తి ధరింపనేర్పడిన వ్యక్తి, పూజ్యపూజ్యుండు శ్రీకృష్ణభూషణుండు.

మ॥ ఎవఁడే శాస్త్రమునం బ్రవీణుఁడో యెవండే విద్యయం దాఢ్యుఁడో
యెవఁడే యే కళలందు శిక్షితుఁడో తా వీక్షించి తత్తన్మతి
వ్యవసాయంబున కుద్దిగాఁ బయి రహస్యాంబు లందిచ్చు గా
రవ మింకే కడఁ గందు మయ్యమృతవాగ్వ్రాతంబులన్ దక్కఁగాన్.

చ॥ గణితము కాదు జ్యోతిషము కాదు నిరుక్తము కాదు కాదు త
ర్కణభట్టా వృత్తి యేదయినఁగాని సమస్తము నిర్మలోరుద
ర్పణమున నెట్లొ యట్లె గురువర్యుని చిత్తమునందుఁ దోఁచు; "భూ
షణ మఖిలజ్ఞుఁడా" యనెడి శంక సుహృత్తతి కంకురింపఁగాన్.

---

1 యశము. 2 ఉపన్యాసము. 3 సమోర్వి = సకలభూతలమునందు.

ఉ॥ ఆంగల మందు సంస్కృతమునందుఁ దెలుంగున యందువారి పా
రంగత మెట్టిదో తెలియరాదు తదుక్తులు సూత్రపంక్తులై
"కొంగున బంగరట్లు" స్మృతి కూలములన్ జెలలాడుచుండుఁ ద
త్సంగతి నెట్టి చట్టయిన ధన్యుఁడగున్ గతసర్వశంకుఁడై.

శా॥ సామాన్యోక్తుల నెల్లరుం దెలియు దృష్టాంతంబులన్ హేలగాఁ
బ్రేమం జెప్పని యట్లు చెప్పెదవు గంభీరంపుఁ దత్త్వా మున్
స్వామీ! తాదృగనన్యసాధ్యపటుదీక్షాస్ఫూర్తికిన్ మిముఁ బ్రే
క్షామాన్యుల్ నవశంకరుండ వని సంశ్లాఘించినం జెల్లదే

చ॥ పలికినపల్కు లాగమనిభంబులుఁ జూచిన చూపులెల్లఁ బే
శలకరుణామృతార్ద్రములు సల్పినలీలలు దత్త్వవిజ్ఞనం
బులకు మనోరమమ్ములు నృభూషణ నిన్ మఱవంగ వచ్చునే
యొలసి క్షణ మేని భవదుజ్జ్వలబోధము విన్నవారికిన్.

చ॥ ఒకతఱి మౌనదీక్ష మఱియొక్కతఱిన్ బటుయోగదీక్ష వే
ఱొకతఱి ధ్యానదీక్ష మఱియొక్కతఱిన్ బరియాచకంబు బా
లకతతితోడ, నిందొకటి లాఘవముల్ మఱి యొందుగౌరవం
బౌకొ! యఖిలాత్ముఁడాతనికి యోగ్యవినోదనలీల లన్నియున్.

ఉ॥ ఏదశ నున్న నెప్డయిన నే స్థలి నున్న వినీతులైన శి
ష్యాదుల సంశయాళిఁ దెగటార్చుట జీవికయయె మీకు నా
పై దయకల్మి మీరు తొలివాసిగఁ జేసినబోధకున్ భవ
త్పాదములన్ సభన్ దలఁచు భాగ్యము నేటికిఁగల్గె ధీనిధీ.

మ॥ చిరకాలంబు భవత్పదాబ్జముల సంసేవించి యా వెన్క నీ
సరణి న్నిదుజయంతులన్ జరపు యుష్మచ్ఛిష్యబృందంబు మీ
కరణిన్ జ్ఞానసమృద్ధమై జగతికిన్ గలా ణమున్ గూర్చుతన్
మఱి నా ట్లు ల ంచుఁగాతఁదఱిఁ బే మన్ మిమ్ముఁ గీర్తింపఁగన్.

శా॥ నీయాపీతము ధర్మమేఘమయి పూన్కిన్ శాంతిపీయూష మే
చాయన్ జిల్కునుగాత దేశమున శాస్త్రంబుల్ కళల్ వేదముల్
నీ యాశీస్సునఁజేసి తొంటివలె శాంతిం బర్వెడుంగాత దే
వా! యుష్మద్దయ మాకుఁ జేకురుత బ్రహ్మాత్మైక్యవిజ్ఞానమున్.

౪౧-వ పుట. ఇనుగంటి సరస్వతీదేవి, జమీందారిణి.

"సాధ్వి నిను గంటి శ్రీసరస్వతినిగంటి"— బ్రహ లోకమునుండి కవులు రచించిన గ్రంథములను దాఁ బరోక్షముగా వినుచుండియు స స్వతీదేవి సమస్త సత్కారములు వారికి దాతలద్వారా కలుగఁజేయుచున్నది. ఇనుగంటి సరస్వతీదేవిగారు కూడఁ దాను శుద్ధాంతమున నుండియుఁ ద్రిలింగపీఠపరిచారశ్రవణమాత్రముననే వారి

యా స్థానవిద్వాంసులద్వారా సనా నము పంపిరి కావున శ్రవణమాత్రమున సన్నానముఁ జేయునో సాధ్వీ, నినుఁగంటె రెండవదానిని శ్రీసరస్వతిని గంటియనియును సాధ్వీని-ఇనుగంటి సరస్వతిని గంటిననియు సభంగ శ్లేష.

౪౨ పుట. ప్రవీణుఁడవౌదు - పెద్దవీణవాయించగల వైణికుఁడ వగుదు వను శబ్దా ముకూడ నీతనిపట్ల నిక్కము - లోకములో లాక్షణికా మే. ఉ. - కుశల ప్రవీణాది శబ్దములు.

౪౨ వ పుట.

"చాక్షుషమైన యజ్ఞమని సత్కవి చెప్పెను మున్ను"

"దేవానా మిద మానయంతి మునయః కాంతం క్రతుం చాక్షుషమ్"

ఉపవాసవ్రతము, ధూమము, దర్భలు మొదలగు రూక్షోపకరణములతో యజమానునకు దేవతలకుఁగూడ శ్రోత్రయ ములు విధివిహితము లగుటచే గ్రాహ్యము లగు చున్నవే గాని నాట్యములు మాత్ర ము శ్రవణములకు నయనములకు నుత్సవము గలిగించుచు రసపారవశ్యమున నానందప్రదము లగుటచే నాక్రతువులకంటె భరత యజ్ఞములు దేవతలకు కాంతమ్—మనోహరమైన యజ్ఞముగాఁ గాళిదాసు మహాకవి తన మాళవికాగ్నిమిత్రమను నాటకమునందు నిరూపించినాఁడు.

## శ్రీ కృ ష్ణ స్త వ రా జ ము

౪౩ వ పుట.

౨ వ పద్యము "శిష్టులఁ గాఁచి" యని చదువవలెను. మొదటి "శి"వర్ణము అచ్చులో లోపించినది "నూర్గునిండవా?"-దుష్టులకు ఆయువు ఏరలేదా? లేక, శిశుపాలునికి వలె నూఱుతప్పులు పూర్తి కాలేదా? సర్వశక్తిమంతుఁడు గూడఁ గాలము కూడినప్పుడే దుష్టశిక్షణకుఁ గడంగినట్లు కానవచ్చుచున్నది. ఉదా॥ శా॥ వేధోదత్త వరప్రసాదగరిమ౯ వీఁడింతవాఁడై మిము౯ బాధంబెట్టుచు నున్న ............ ............నేసాధింపన్ దతిగాదు..................మీఁదటన్ సాధింతున్

(సప్తమస్కంధము -- భాగవతము)

౪ వ పద్యము. రాముఁడై - రాముఁడవై, ఎంతచేసినను నరులను సంతుష్టి పఱచుట దుర్ఘటమని రామావతారమున నిర్ణయించినవాఁడ వగుటచేఁ గృష్ణావతారమున సాధువులగు గోవులతో సహవాసము చేయుచుంటివా యని భావము.

౫ వ పద్యము. మూర్ధముండఁబఱకున్ - శిశుపాలుఁడు శ్రీకృష్ణుని నిందించుట తల పడిపోవుట కారణముగా నాగెనే కాని తల యుండినచోఁ దిట్టుచునుండువాఁడే యని ధ్వని.

"రాత్రి రేవ వ్యరంసీత్" రాత్రి విరమించెను గాన సీతారాముల నర్మసంభాషణము ముగిసెను గాని లేకున్న జరుగుచుండెడిదే.

"కరణ మేల తినఁడు కడుపులో నున్నప్డు తల్లిమాంసమన్న దానిపైన
దయకలిమినిగాదు దంతాలు రామియే కారణంబటంచు ధీరులంద్రు.

౪౪ వ పుట.

వంశమనఁగా వెదురు - ధనుస్సున కుపయోగించునదియే శ్రీరామునిచేత నిలిచి చెప్పినట్లు శిక్షపొంది రామబాణమని ప్రసిద్ధి గాంచినట్టి వంశములోఁ బుట్టినదగుటచే మురళిని (వెదురుగొట్టమును) శ్రీకృష్ణుఁడు చేపట్టి లాలించుచున్నాఁడనుట. ఇందలి యర్థాంతరన్యాసము మనోహరము. మొదట శిక్షకులొంగినవారే లాలింపఁ బాత్రులు గాని శిక్షకు లొంగని వారు లాలింపఁదగరు.

౭ వ పద్యము. ప్రావరణము - ఉత్తరీయము - నా హృదయమున నీవు ప్రవేశించినచో నేను గనకమ్మ నగుటచే నీకుఁ బ్రావరణ మగుదును. నీవు కనకచేలుఁడ వగుదు వని భావము.

౯ వ పద్యము. మహనీయుల సాహస మెంతురు గాని పామరులు వారి మాహాత్మ్యము గ్రహింప లేరనుట. నీ రూపము - నీ స్వరూపము, నిర్ రూపము - నీరూపము, రూపము లేకుంట యెఱుంగలేరు. నీరూపము ఇది నీరంధ్రమువంటి ప్రయోగము.

౧౦ వ పద్యము: గోపికలను సనకాదుల నొక్కతరగతిలోఁ జేర్చుటకుఁ గారణము గోపికలుగా నున్నవారు తొలుత ఋషులే యని యితిహాసము.

౧౧ వ పద్యము: "యత్ర యోగేశ్వరః కృష్ణః" యను శ్లోకము నిచట నన్వయించుకొనునది. యాగసంరక్షకుఁడను కీర్తి శ్రీరామునకుఁ జెందినది. విశ్వామిత్రుఁ డనుగ్రహింపఁబడినవాఁడు పోలె నున్నాఁడు. భారతమునఁ గిరీటి కిరీటివి. కృష్ణుఁడు కేవలము బండితోలువాఁడు. గురుశిష్యుల మర్మము గురుశిష్యులకే తెలియును గాని భేదబుద్ధి గలవారు పెద్దలజాడ లెఱుంగలే రనుట.

౧౨ వ పద్యము: "కృష్ణ" యను పే రర్జునునియందు, ద్రౌపదియందుఁ గూడఁ గానవచ్చుటచేఁ దన పేరుగలవారియందుఁ దన కభిమానము. సభలో నొకనాఁడు "ధర్మరాజు సోదరుల భక్తిగొప్పదా? శ్రీరాముని సోదరుల భక్తిగొప్పదా?" యను విచారణ వచ్చినప్పుడు శ్రీకృష్ణరాయలవారు "పాండవుల మైత్రి గొప్పద న్నారఁట. అచట వింజామరము వీచు చాకలివాఁ డొకఁడు "మహాప్రభూ! అవతారము మాటి నను నభిమానము మాఱలే" దన్నాఁడఁట. ఈ కథ నిందుఁ బొందుపఱుపఁదగును.

౧౪ వ పద్యము: "వెన్నల వెన్నెలన్ బసుల" యని చదువవలెను. రెండును వెన్నలయని యచ్చు తప్పుపడినది.

౪౫ వ పుట

౧౬ వ పద్యము చల్ల చేసితివి - చల్లఁబడునట్లు చేసితివి, చల్ల చేసితివి, మథించితివి కలంచితివి యని య ద్వయము చెప్పుకొనవలయును.

౧౭ వ పద్యము: ప్రమదారత్నములట్టి మహర్షుల - గోపికా రూపమును ధరించిన మునులను వేంగమ హృత్కైరవసోము - వేంగమ యను యోగినిహృదయమను కలువను వికసింపఁజేయు చంద్రుఁడు శ్రీ కృష్ణుఁడు.

సుధానాము - అమృతప్రాయమైన నామముగలవాఁడు - వేంగమకై శ్రీకృష్ణపరమాత్మ తానే వచ్చి ప్రబంధము రచించెనని ప్రతీతి. శ్రీ జయదేవుఁడు, పోతరాజు మొదలగు భక్తులనుగూడఁ బరమాత్మ యట్లే యనుగ్రహించె నని యితిహాసము.

౧౯ వ పద్యము: పిల్లవానితోఁ బాటు వాని యాటలకు వినియోగపడు గిలకపండ్లు, బంతులు మొదలగునవి తెచ్చునట్లు నీకుఁ బ్రియమైన యమునాదులు నేఁడేఁజాలను.

౨౩ వ పద్యము: వశుల్ - జితేంద్రియులు.

౨౪, ౨౫ పద్యములు: "వారి చరిత్ర వ్రాయ మొదలుపెట్టిన భారతాలు భాగవతాలు నగు" నను లోకోక్తి నిం దనుసంధానము చేయవలయును.

౨౯ వ పద్యము: రమ్మని వ్రాసిన జవరాలు- శ్రీ రుక్మిణీదేవి. తొల్లింటి భక్తులకై నీ వెంతో శ్రమపడవలసివచ్చినది. నాకు నీ ధ్యానము మాత్ర మొసంగినఁ జాలుననుట,

౩౧ వ పద్యము: శృంగారసన్న్యాస దీక్షలు- శృంగారమువలె బాహ్యార్థమునఁ దోఁచుచున్నను, నిందు బ్రతిపాదింపఁబడినది యుత్తమాధికారికిం దగిన తీవ్రసన్న్యాసమే యని యెఱుంగఁదగును.

౩౭ వ పద్యము: "ఒక్క-రాత్రియే జననంబు నొందినాము" అని చదువవలయును. అచ్చులో యతిభంగమైనది. బాదరాయణ సంబంధము—— ఇంటికి వచ్చిన యతిథి తన భర్తచుట్టమని భార్యయుఁ, దనభార్య చుట్టమని భర్తయు ననుకొని గౌరవించి వానికి భోజనము పెట్టుచు వచ్చిరి. దంపతుల యేకాంతంబున నాతఁ డుభయులకు బంధుఁడు కాఁడనియు, వంచకుఁడనియుఁ దేలినది. అంతట "నీకు మాకు నేమి సంబంధ" మని యింటివా రడుగఁగా మీ దొడ్డిలో బదరీవృక్షము (రేగుచెట్టు) న్నది. మేమువచ్చిన బండికి రేగుకఱ్ఱచక్రము లున్నవి గాన మనకు బాదరాయణ మనియెనఁట. అందుచే లోకమున నేదేనియున్నదో లేనిదో యొక స్వల్ప సంబంధము గల్పించుకొని బాంధవ్యమును బ్రకటించుట బాదరాయణసంబంధ మనఁబఱుచు వచ్చెను. దైవికముగాఁ గనకకవయిత్రి జన్మదినము, గనకచేలని జన్మదినము నొక్క-టియే యగుటచే నిదియే బాదరాయణసంబంధ మని గ్రహించి న న్ననుగ్రహింపుమనుట. అదిగాక "వ్యాసో నారాయణో హరిః" యనుటచే వా సునకుఁ గృష్ణునకు నభేదమగు సంబంధము. అదిగాక- వ్యాసునకుఁ గృష్ణుఁడని పేరు. అతఁడు నీ చరిత్రము వ్రాసినాఁడు. ఆ చరిత్ర భక్తురాలనగు నేను చదివినదానను. వ్యాసుఁడు బాదరాయణుఁడు. నీకును నాకును నడుమ బాదరాయణసంబంధము కలదనుట మహాప్రౌఢమైన యమున్నది. ఇట్లు కవయిత్రికిఁ గుమరుట దైవానుగ్రహమని యెఱుంగఁదగును.

48 వ పుట.

౩౯ వ ప. తక్కిన యవతారములవలెనే ప్రత్యేకకృత మునకై రాకపోవుటయు నాశ్రితుల కనురూపముగ సంచరించుటయే కాని తన కెట్టి యభిమానము లేకపోవుటయు నెందును వాసనలేక తత్త్వమూర్తియై యర్జునుల కుపదేశించుటయు సర్వధర్మములు పరిత్యజించి నా శరణముఁ బొందుఁడని తా నుపదేశించినయట్లు తానును సర్వ ధర్మ కర పరిత్యాగము చేసిన యవధూతస్థితిలో నుండుటయుఁ బట్టిచూడ శ్రీకృష్ణపరమాత్మ య తారములోఁ బరిగణనము సేయఁబడలేదు. "విష్ణు ర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసంకటే" దశావతారము లనునరణ్యమున విష్ణుమూర్తి సంకటపడినట్లున్నది' త న్నైకర్మమంటని బ్రహ్మమై యున్నమూర్తి కృష్ణమూర్తి.

"మూర్తిత్రయాత్కృష్ణో వై పృథగ స్తి కో౽ ప్యవికృతః. సచ్చిన్మయో నీలిమా'
అవతారాణా మంతర్యామీ ప్రవర్తకః కృష్ణః. —శ్రీ శంకరః'

౪౪ వ పద్యము. శబ్ద స్పర్శ రూప రస గంధము లను పంచేంద్రియముల ద్వారా ప్రపంచమునఁ గాంచి యాత్మ నిన్నుఁ గాంతు —అనఁగాఁ బ్రపంచమునే నిన్నుఁగాఁ గాంతును. " హరియని సంభావించును" అను భాగవతవచన మిట ననుసంధేయము.

౪౬ వ పద్యము.

అంతరంగైక్య ముభయులకుఁ గలదు. అది యందఱకుఁ దెలియదని బహిరంగ ములయందలి విభేద మొండొరులు వస్త్రములు ధరించుట చేఁ బోఁగొట్టిరి.

౪౯. సకల బంధుఁడవుఁ గృపాసముద్రుఁడవునైన నిన్ను మఱచి యీ పాపి, బాంధవులు హితులను మోహపాశముచేఁ గట్టఁబడి సంసారమను కూపమునఁ గూలు చున్నాఁడు. అట్టి విపద్దశనుండి నన్ను రక్షింపుము.

౫౩. సాధుసంతానచైత్రమ్—సాధువులను కల్పవృక్షములకు వసంతర్తువై వికాసము కలుగఁజేయువాఁడు. పుష్పవన్నేత్రమీడే — పుష్పవంతులు నేత్రములుగాఁ గలవాఁడు. అట్టివానిని స్తుతించుచున్నానని య ము. పుష్పవంతులు - సూర్యచంద్రులు.

౫౬. బంధుభ్రాంతిగలవారికి భగవంతుఁడు గానరాఁడు. భగవత్సాక్షా త్కారముగలవారికి బంధుభ్రాంతి యుండదు.

౫౭. మిత్రునకుఁ బుత్త్రమరణము గల్పించితివి - ఆ కడుపుమంట చల్లార్చు టకుఁ గవ్వము క్రింది మజ్జిగ నిచ్చితివా? తాను గవ్వపుఁగొండను మోచినవాఁడగుటచే బోధామృతము నిచ్చితివా యని ధ్వని.

౬౦. 'అనన్యుల్ గారె నీ వారహో' "నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని వారి విడువ నెట్టివారలైన" అనుపద్యా మిచ్చుట ననుసంధేయము.

౬౨. ప్రపంచము నీపై తోఁచు - అఖండమైన దిక్కొక్కటయ్యును వృక్షమో స్తంభమో ఆధారముగఁ జేసికొని దశదిక్కు లేర్పడినట్లు బ్రహ్మమునందు

అహంభావముచే భిన్న భావము లేర్పడు చున్నవి. అయ్యహంభావము పోయిన నంతయు బ్రహ్మముగనే తోఁచునని యిందలి భావము.

౬౩. ఇందుఁ గవయిత్రి యాత్మ నివేదనమున్నది. "పుట్టితి" సర్వజనసామాన్యమైన జననము కలిగిన పిదప గురుండు ప్రబోధ మొసంగువఱకుఁ జెప్పఁదగిన విశేషము లేమియు లేవనుట ఆ గురు ప్రబోధమున మోక్షసత్పథము గల్గుఁగావున దానిని గట్టిగ నిలుపుమని ప్రార్థన. జననముతోఁబాటు మరణ మనివార్యమైనచో "ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి" అను సనత్సుజాతీయభాష్యము ననుసరించి యట్టి ప్రమాద ముఖమునఁ బడనీయకుమని భావము.

## కవితానుభవము

52 వ పుట.

౧ వ పద్యము. కలవారలకు - డబ్బుకలవారలకుఁ గవితానుభవ ముండదనుట.

53 వ పుట.

౨ వ పద్యము. ఘూకవి-ఘూకమను పక్షి -గుడ్లగూబ. అట్లే కాకవి - కాకమను పక్షి.

3 వ ప. కవిచేతఁ బరుసవేది కలదనుట.

౪ వ ప. కృష్ణరాయఁడు, పోతరాజు, శ్రీనాథుఁడు, భీమకవి, పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి అల్లసాని పెద్దన మొదలగు మహాకవులు ఆయా వర్ణనముల కుదాహరణము గుదురు.

ఈశులౌటచేన్ - సమర్థులగుటచేత, తత్పరులు - ఋషులగుటచే బ్రహ్మ తాదాత్మ్యము నొందినవారు.

౫ వ ప. గుహావృత్తులు-మనసులోని యోజనలు, 'రవి గాననిచోఁ గవి గాంచునేగదా'.

ఈశుతోనైన— "ముదియంగా ముదియంగ".

"మోక్షం బిచ్చిపొమ్మన్న నీ శ్రీభాండారములోఁ గొఱంతపడునా శ్రీకాళహస్తీశ్వరా !"

"కదలు మిటమాని దివిజగంగాభవాని" కవికిఁ జాలినమిత్రుఁడు — అప్తుఁడు సూర్యుఁ డనిభావని.

54 వ పుట.

౧ వ పద్యము. పురి.— చెన్నపురి.

౨ వ పద్యము. త్రికాలములయందు మాఱకుండునది సత్యము. "సత్య మబాధ్యమ్ బాధ్యమ్ మిథ్యా" అట్టి సత్యము బ్రహ్మపదా మొక్కఁడె.

౩ వ పద్యము. వాగీశుల్ కవుల్ - ఆంధ్రకవులు కేవలము పద్యము లల్లువారు మాత్రము కారు. దేవాసుర గురువులగు బృహస్పతి శుక్రాచార్యులతో సమమగు మతిప్రాగల్భ్యము గలవారనుట. విద్యారణ్యులు శాయన మాధవాచార్యులవారు. ఇట నరణ్యశబ్దము సన్న్యాసుల కుచి మగు బిరుదము, రాయ లిర్వురు—కృష్ణ రాయలు, పండితరాయలు. ఒకఁడు విద్వాంసుఁడై ప్రభుఁడైనవాఁడు. ఒకఁడు విద్వాంసులలోఁ బ్రభుఁడైనవాఁడు. భాస్కరరాయలు, త్యాగరాయలు మొదలగువా రెందఱో కలరు. త్రిలింగదేశమున సంగీతముకూడ యోగులచే నిర్మింపఁబడినది. ఉదా: త్యాగరాజయోగి కృతులు, నారాయణతీర్థుల తరంగములు.

౫ వ పద్యము. దానవ డింభకుఁడు – ప్రహ్లాదుఁడు.

౬ వ పద్యము. కవుల కాలనిర్ణయమునకై వివదించుటకంటె వారి కృతుల లోని భావమును గ్రహించుటమేలు. చవాకు లవాకులు – వ్యర్థప్రలాపములు.

(జాతీయము)

౭ వ పద్యము. విజ్ఞుల సేవయే సిద్ధిప్రదము — అదిమాని దేశకాలము లను కూలింపలేదను వారధములు.

౮ వ పద్యము. ఆయువే అన్నము నొసంగునని పెద్దలు భరతఖండమునఁ దమ యోగక్షేమములు పరమేశ్వరునకు వదలి తాము స్వధర్మనిష్ఠులై యుందురు. నేఁడా ధైర్యము తగ్గిపోయినదని సూచన.

౯ వ పద్యము. పరమార్థశూన్యమైన చదువులు, సంపదలు, యు కౌశలములు పడమటిదేశములవారికి ఆనంద మొసంగఁజాలెనే. ఆ సుఖము బహుదుఃఖమిశ్రమే. అచట స్త్రీలు పురుషద్వేషిణులై, పురుషులు సంసారభారము నొల్లక తిరుగుఁ బోతులై నిమిత్తమాత్ర ప్రసక్తులు కలవారై యుండుటయే మిగిలె. తూర్పుదేశమున ఋషులు కనిపెట్టిన ధర్మములే సుఖప్రదములు.

౧౧ వ పద్యము. ఇరుబాసలు – సంస్కృతాంధ్రములు – మూలము చాలులేని యుద్దండులు. సంస్కృతము తెలియక సంప్రదాయము తెలియక యుండువా రని భావము. ఇది జాతీయము. వీరి దండకములు. ఇది పరిహాసోక్తి. పామరరంజకంబు లగు గంభీరోపన్యాసము లని భావము.

౧౨ వ పద్యము. సూరులు – పండితులు. ప్రధానపరిశోధన – ప్రకృతిని బరి శోధించి తత్త్వవర్తకుడగు పురుషునిఁ బరమేశ్వరు నెఱింగిరని, శూరులకు – ఇది పరిహా సోక్తి. ఇప్పటి పరిశోధకులు ప్రధానవిషయముల విమర్శింపఁజాలక యప్రధానములగు దేశకాలాదుల విమర్శనలతో గొప్పవా రగుచున్నారు. వారిని వారింపఁగల విద్వత్ప్రభువులు లేకపోవుటయే కారణము.

౧౪ వ పద్ము. "వీండనుమాట" దీర్ఘాక్షరము మీఁద బిందువు నన్నయ నిషేధించుటయు, ండు ప్రయోగము నన్నెచోడుఁడు తన కుమారసంభవమున వాడు

టయుఁ జూడ నొక విమర్శకుఁడు నన్నయ్యకంటెఁ బ్రాచీనుఁడు చోడుఁడని పెద్దసిద్ధాంత మును బ్రతిషించి సాహిత్యలోకమునఁ బెద కలగుండు పెట్టెను. ఈ ప్రమాదము త్రిలింగ సాహిత్యలోకమును ముప్పది సంవత్సరములుగా నలయించుచున్నది. నన్నయ దీర్ఘము మీఁద బిందువు వ్యాకరణమున నంగీకరింపలేదే కాని లోకమున లేదని చెప్ప లేదు గదా! దక్షిణదేశమున శూద్రు లందఱు నేటికిని కోంతి వచ్చినది, లేంత కాయ, పాంత బియ్యము, పేండ, చేంట మొదలగు ప్రయోగములు చేయుచున్నారు. వీరం దఱు నన్నయ్యకేల ప్రాచీనులు కాఁగూడదు? ఇట్టి చర్చ దండుగ. అయుక్తియ మునకు హేతువు.

56 వ పుట.

౧౫ వ పద్యము. ఆగ్రహము - తమతమ సిద్ధాంతములందు సనఁగా సూహ లందుఁ బట్టుదల యభిమానము ప్రగ్రహశూన్యములు - శాస్త్రముయొక్క సూత్రము లకుఁ గట్టుబాటులకు లొంగని మాటలు. శిష్టులపై, విగ్రహము - యుద్ధము. ప్రవీణులు. ఇది పరిహాసోక్తి. ఇట్టి వారికే నేఁడాచార్యపదవి. ప్రభు పరిగ్రహము కలిగెననుట.

## మంచి మాటలు.

### చెన్న రాజధాని కళాశాల

౩ వ పద్యము. ఎంచకుంటకంటె మంచిలేదు. హరిమయమై జగముండుట నిది మంచి యిది చెడ్డ యని యెంచక యంతయు హరిమయ మనుకొనుటయే నిజ ముకు మంచి యని భావము.

౫౮-౫౯ వ పుట.

౧౫ వ పద్యము. ఇందు గురుని యావశ్యకము సూచింపఁబడినది. నేటి కాల మున వ్యాపారప్రకటనము లెల్లెడల నానారూపములతోఁ జిత్రించుటకుఁ బ్రకటించుటకుఁ బరమప్రయోజన మెవఁడేది చూచి యాకర్షింపఁబడి వస్తువును గొనునో యనియే కదా! అట్లే ప్రాచీనులు సర్వస్థలములయందుఁ బాటలు, పద్యములు, చిత్రములు, శిల్పములు పరమార్థబోధకములు రచించుట యేనాఁ డెవ్వఁడు దేనిచేత నాకర్షింపఁబడి కృతార్థుఁ డగునో యనియే.

70 వ పుట.

౧౭ వ పద్యము. మామిడిచెట్టుయొక్క యుత్తమఫలము పండ్లుగాని నీడ కాదు. ఈ పావన భరతఖండమునఁ బుట్టినందులకు నుత్తమఫలమగు తపస్సును బొందక జీవితమాత్ర క్షుద్రప్రయోజనములతోఁ దృప్తిపడి నిష్ప్రయోజనములు నాయాసకరములునగు మబ్బునీడలకై పరుగెత్తవచ్చునా?

**71వ పుట.**

౨౨వ పద్యము. ఛందస్సు పాదము లనియు కావ్యము ముఖ మనియు వాగీశ్వరి వర్ణింపఁబడినట్లు "మంతవ్యమ్" - మననము చేయఁదగినది. "ఆత్మా వారే...... మంతవ్యః" అన్నట్లాత ధ్యానము సేయక చిత్తమునకు సంక్షోభముగలిగించు పుస్తకములు వినఁదగినవని యన్నుఁ గూర్చి పంచిపెట్టుచుందు రనుట.

**72వ పుట.**

౭వ పద్యము. భరతఖండ సంస్కారములు సంప్రదాయములు సత్కళలు కాలప్రవాహమునఁ బడిపోవుచున్నవి. నేఁడు పెద్దతికము వహించుచుఁ బత్రికలలో ప్రచుర మగుచుండువారల కీవిషయము పట్టదు. ఆర్యవిజ్ఞానము నిల్వంబెట్టఁగోరు వారలకుఁ బ్రభావము చాలదు.

**73వ పుట.**

౭వ పద్యము. కావ్యమందు రసములు భోగ్యములు కాని లోకమున మర రసములు నేహ్యములు. చంద్రమతి దుఃఖమును నాటకమున రూకలు కర్చుపెట్టుకొని పోయి చూచును గాని లోకమునఁ బుత్రవియోగముచే దుఃఖపడు తల్లి నొక్క నిముసము చూడలేఁడు. లోకమందుఁ బీడఁగాఁదోఁచునదెల్ల కావ్యమునఁ గ్రీడగాఁ దోఁచును. ధాతసృష్టి సుఖదుఃఖమిశ్రితముగాని కవిసృష్టి 'హ్లాదైకమయీ' కేవల మానంద జనకమే యని యాలంకారికు లనిరి.

**75వ పుట.**

౧౪వ పద్యము. కట్టలలో నది యెప్పుడేనిఁ బొంగి పొరలినను సర్వసాధారణముగాఁ దటిని (యొడ్డులుకలది) యను పేరుతో గట్టుల నడుమనే పాఱుచుండును గదా! అట్లే మహనీయుల కవిత శాస్త్రనిబంధనలకు లొంగియే యుండును. ఎప్పుడైన మీఱినచో నది యార్షమని మహాకవుల నిరంకుశత్వమని యందురు. కుకవుల కవితలు శాస్త్రనిబంధములేక వానవఱదలవలె నన్నిటిని ముంచివేయును గాని యెవ్వరికి సంతసముఁ గూర్పవు.

**76వ పుట.**

౯వ పద్యము. ఆసురసంపదల్ - రాక్షస సంపదలు. ఆ సురసంపదలెల్లఁ గల్లఁగా - దైవీ సంపదలెల్ల నాశనమగునట్లు.

**78వ పుట.**

౫వ పద్యము. కొన్ని పత్రికలు ప్రచారము లేకున్నను దమ యున్నచోటనే తమ నోటి కందిన వానిని గఱచి మ్రింగును. అట్టివి కొండచిలువలు. కొన్ని తాఁచులు చకచక ప్రచారము చేయుచు నిరుపక్కలఁ దమ నోటి కందిన వానినెల్లఁ గఱచుచు నిందించుచుండు పత్రికలు. సహస్రముఖముల - బహుముఖముల విజృంభించి ధర్మము నన్ని వైపుల నాదుకొను త్రిలింగవంటి పత్రికలు ఆదిశేషునివంటివి.

80 వ పుట.

౬ వ పద్యము. శూరత్వముచేత నీతిచేత రాజ్యములు వచ్చునుగాని హిందీనేర్చుకొని కూర్చున్నరావు. క్రొత్తసంసారమునకు ముందుగా నుప్పు బస్తాలు కొని కాలువ యొడ్డుననే పెట్టి యింటికి వచ్చెనఁట. ఆ రాత్రి వాన కవి యన్నియుఁ గఱగి పోయినవి. స్వభాషను మఱచి సంస్కృతముఁ దోసి రాష్ట్రముకొఱకు హిందీమాత్రము నేర్చుకొని కూరుచుంట యనుచితమని భావము.

౯ "స్వస్థాన వేషభాషాభిమతా స్సంతః" అని నన్నయ్యభట్టు సూత్రము. ఇప్పుడా దేశభాష లేదు. దేశపువేషము లేదు. రాజకీయావసరములంబట్టి యేవేసము వేసినను మనసున స్వధర్మాభిమానము మానని గొప్పవా రచ్చటచ్చటఁ గలరు.

౧౦ వ పద్యము. పైకి వైదికవేషము కలిగియు నందు విశ్వాసములేక తమ బాలకులకుఁ బరభాషలు నేర్పి వారు పరవేషముఁ దాల్చి ధనము సంపాదించుచుంటఁజేసి మనసులోఁ బొంగుచుండువారు పరిహాసాస్పదులు. స్వధర్మమునకు శత్రువులకంటె నపకారులు.

౧౧ వ పద్యము. పాశ్చాత్య విమర్శనామాత్రములనుబట్టి మన శాస్త్రములను బరిశీలించుట తప్పు. ఈ తప్పుదారిని బోవువారి కందుఁ బరమా ము కనఁబడదు. ఆ కారణంబున వెఱ్ఱి వ్యాఖ్యానములు సేయుదురు. ఈ పిచ్చివ్రాఁతలకుఁ బొంగిపోవు పిచ్చివారలు పెద్దలఁ జౌక యుదురు.

83 వ పుట.

౪ వ పద ము. వేయికరముల - వేయిమంది చేతులలో రవీంద్రుని పొత్తము లుండుటచేఁ బ్రాక్పశ్చిమముల రవీంద్రకవీంద్రున కస్తమయము లేదనుట.

85 వ పుట.

౧ వ పద్యము. తులాధారుఁడు - ఈతఁడు వైశ్యముని. స్వధర్మానుష్ఠానముచే సర్వజ్ఞుఁడైనవాఁడు. భారతమున నీతని కథ యున్నది. 'జాజలి' యను ఋషి యీతని వలనఁ దత్త్వబోధ పొందెను.

86 వ పుట.

౧ వ పద్యము. దూరదృష్టితో దేశక్షేమ మెట్లు కల్గునో యని విచారణ సేయువా రరుదుగ నున్నారు.

౨ వ పద్యము. ఎంతగాఁ బడమటిదేశము ననుకరించినను బ్రయోజన మేమియు లేదని తాత్పర్యము.

3 వ పద్యము. బాంబుల భయమునకు ముక్కులు మూసికొని బొక్కలలో దూరుమని ప్రచారమే కాని యేకాంతమందుఁ బరమేశ్వరానుగ్రహమునుఁగోరి ముక్కు మూసికొనుట-ప్రాణాయామము చేయుట-మంచిదని యెవ్వరును జెప్పరుకదా!

౮ వ పద్యము. లోక మంతయు వ్యతిరేక మైనను దేశికుని యాజ్ఞపై నిల్వఁబడుట ధీరత్వము.

87 వ పుట.

౫ వ పద్యము. అవధానులు — పండితరాజ బిరుదముచే దంటు సుబ్బావధానులుగారు ది 10-11-1940 వ తేదీన విజయవాడమహాసభలో సత్కరింపఁబడిన నాఁడు కవయిత్రి చెప్పిన పద్యము లివి. పద్యమాలయందు నిరూపింపఁబడిన సులక్షణములకు లక్ష్యమని సూచన. ఆనాఁటి మహాసభలో నవధానిశిరోమణి సాహిత్యస్థాపక కాశీ కృష్ణాచార్యులవా రిట్లు చెప్పియున్నారు.

ఉ. దంటుకులా చంద్రుఁ డవధానిపదాంకితుఁ డాంధ్రదేశపుం
బంట కవీశ్వరుండు నవపండితరాయఁడు సుబ్బనార్య మీ
వంటి రసజ్ఞు లీ విజయవాడ మహాసభ సత్కరింపఁగాఁ
గంటను గాంచి సంతసము గాంచఁగవచ్చితి నీడ కిత్తతిక్.

89 వ పుట.

౧౧ వ పద్యము. ఇప్పటికే జాతిలక్షణములు చాలవఱ కదృశ్యములైనవి. పాశ్చాత్యభావసముద్రమునందు మునిఁగి యన్నియు నదృశ్య మగుచున్నవి. జాతిలక్షణము లెన్నో నిలుపఁదగినవి యుండఁగా వానిపై లక్ష్యముంచక యెంత సుగుణసంపద యెంతశాస్త్ర మెన్నికళలు మునిఁగిపోవుచున్నను గోఁతిపట్టుగా వ్యవహారమే పట్టుకొని ముందఱచేటు గానలే రనుట.

కోఁతిపట్టు—విడువఁదగిన సమయమందును వివేకములేక విడువనిపట్టు.

90 వ పుట.

౨వ పద్యము. గురుమథనంబునం బడి-గురుసన్నిధానమున శుజీవ మలినజీవుల రాపిడి యను మథనమున రాలిన జ్ఞానమను అగ్నికణమున భక్తి యను గాలితో నూది పెద్దదిచేసి ఆ వెలుఁగున నిర్మింపఁబడిన దీ హంసవిజయాఖ్యనాటకదీపము. రాధాకృష్ణపండితుఁడు త్రివిక్రముని లె నొకయడుగు ప్రాగ్భూగోళార్ధమున నొక్కయడుగు పశ్చిమభూగోళా మునఁ బెట్టుచు మహోన్నత వీథి సంచరించుటచే ననఁగాఁ బ్రపంచమంతయు వ్యాప్తి లిగియుండుటచే నట్టి మహోన్నతపురుషుఁడు ఈ దీపమును జేతఁ బట్టుకొనిన లోకమంతకు వెలుఁగు వ్యాపించునని భావము.అనఁగా నీ గ్రంథమున కుపోద్ఘాతము వ్రాయునిమిత్తమున నెల్లెడలఁ దత్ప్రచారమునకుఁదోడ్పడవలయుననుట.

93 వ పుట.

3వ పద్యము: వక్తలకు శ్రోతలకుఁ దెలియని వేదాంతమని పాశ్చాత్యదేశపు వారనుకొందురు. వక్తల కనుభవములోనుండి శ్రోతల కనుభవము లోనికి వచ్చునది తత్త్వమనియు గురు బోధలచే జీవత్వము పోగా జీవుఁడే పరబ్రహ్మమని యిచ్చటి పెద్దలు నిరూపింపఁ గలరనియుఁ బ్రపంచ మంతయుఁ జాటఁదగుననని భావము.

౬. ధర వృక్షమునకు వేదముమూలము. శాఖలు తర్క_వ్యాకరణాదులు. వర్షము వలె వీనినిఁ బోషించువాఁడు లేఁడు. పిందెలు పడుచుండఁగనే- కోతులు-“ రచిత్తము లేనివారలు. పడమటి గాడ్పులకుఁ జెట్టే కదలిపోవు చున్నది. ఇట్లున్నను మొగలి పొగడ మొదలగు పూవులవలె, లతాంతములు- పూవులను బోలిన వేదాంతము, వాడ కుండ నీదేశమున నిలిచియున్నది. ఆవేదాంతవేత్తల సాన్నిధ్యంబునఁ దద్వాసన మబ్బిన రాధాకృష్ణ పండితుఁడు, వాడల వాడల-దేశదేశముల వేదాంతవాసనఁ బర్వచేయఁగలఁ డనుట.

౭. పరదేశములకుఁ బోయి గౌరవములఁ బొందువారు స్వదేశముననుండి యెన్నఁడు పరదేశమున నడుగుపెట్టని దీక్షగల మహావిద్వాంసుల నచటఁ గీర్తించుట ధరము. ఇక్కడ నున్న పెద్దలవద్ద నేర్చుకొని కొంచెముతోఁ బరదేశములయందుఁ బెద్ద గౌరవములఁ బొంది తమ ప్రఖ్యాతికి హేతుభూతులయిన పెద్దల స్మరింప కుండుట ధర్మము కాదని సూచన. ఇటఁ బండితరాయుల శ్లోకము “ లాలుంఠిత” యనునది సమన్వయించుకొనవలెను.

౯౮-౮. ధర్మబీజము నిల్పువారు- నట్టి పండితులఁ గళాకోవిదులఁ బోషించు రాజులు - స్వధర్మమును బ్రతిపాదించు సద్గ్రంథములు రచించు కవులు ధీరులు - వారే ధన్యులు - తక్కినవారు పొట్ట పోసికొనువారు.

౧.౨-౧౩. బాటప్రక్కనున్న చెట్లకుఁ, దాటిచెట్లకైన లెక్కయున్నది గాని పండితులకు శిల్పులకు లెక్క లేదు. ఇతర జనాభాతో పాటు వీరికి లెక్క నెత్తినచో గ్రమ క్రమమున సంఖ్య క్షీణమగుటఁ గాంచినచో గుండెపగులును. గతించినవారి స్థానమున నుండఁదగిన పండితులు ప్రభవించు వసతినిఁ గలుగఁజేయు ప్రభువులు లేరు. సంపన్నులు పైవారియొత్తిడిచే దానము చేయుదురే కాని గుణ మెఱిఁగి యవసరముకని పెట్టి చేయరు. ఆఁకలిగొన్న వాని కత్తరు రాచినట్లు లౌచిత్తి యెఱుంగని దానములు వ్యర్థము లనుట. “దానం యదవసరే దత్తమ్”.

౧౦౦-౨౩. అధీతి, బోధ, ఆచరణ, ప్రచారణములలో నితరుల సాయ మవసరము లేనివి - ఆత్మాలంబనము చేతనే జరిగినవి. ఆశ్రయించి గురువులయొద్దఁ జదువుకొనుట, యాశ్రయించిన వారికి బోధించుట, యథాశక్తిగ నాచరించుట జరిగినవి. ఇఁక సాఁగవలసిన ప్రచారమునకు సంపన్నుల సహాయము గావలయును గాన శ్రీ త్రిలింగ పీఠమున మే మొనరించు ప్రచారమునకుఁ దోడుపడుఁడని ప్రభువులకు సూచన.

౧౦౩-౫. కొమ్మలపై నాడు కోతులవంటి చపలచిత్తుల నగ్రస్థానములఁ బ్రభు మందిరముల సన్మానముచేసి, రాజులచే సన్మానింపఁదగిన పండితులను శిల్పులను బిచ్చ మెత్తుకొనుటకు వీథులలోఁ దోలు దుష్కాలము వచ్చినది. ఇంటి పట్టులు దీపము లేని దిబ్బలు కాకుండ నే కళ యెఱింగిన పండితుని యింటిపట్టున నా కళాపరంపరను నిలఁబెట్టు పండితుని నిల్వఁబెట్టఁ గర్తవ్యము. అట్టి పని చేయలేకపోయినను నోటినిండ నా మాట పదిమంది యనరాదా ?

౧౦౪-౮. "బ్రిధానములం బరిరక్ష సేయుఁడీ" గ్రామములోఁ బ్రిధానము లనఁగా నెయ్యి, బియ్యము. ధర్మ సంస్థానములందుఁ బ ధానము లనగా, శ్రుతి, స్మృతులు, శూరులు, ధీరులు, పండితులు, శిల్పులు. దస్తు శిస్తు లెవరు పుచ్చుకొన్నను దేశమున విద్యల వర్తనములు దేశస్థులు ప్రభువుల సహాయ మున్నను లేకున్నను నిలుప వలెనని భావము.

౧౦౫-౧౫. పాశ్చాత్యనాగరకత యను గాలిదుమారము పడమటినుండి వీచు చున్నది. అందఱుఁ బడమర మొగంబులై నడచుటచేఁ గన్నులఁ దుమ్ముపడి, దారులఁ గానకున్నారు. వెన్కమాటలు వినరావు. ఎదురుగాలికిఁ బోవువారికి వారి వెనుకవా రెంతకేకలు వేసి చెప్పినను వినరాదు. పూర్వులు పెద్దలు చెప్పు మాటల నాధునికులు పాశ్చాత్యవ్యామోహంబున వినరనుట. కడపుమ సుగమము.

౧౧౪ - ౬. తోఁచిన ట్లెల్లఁ జేయంగఁ జూచు నొకఁడు

౧౧౫ - ౯. తోఁచినటు చేసి చెడియె ముల్లె దొవల ఱేఁడు. ఈ రెండు పద్యములు కలిపి చదివినచో భావము స్పష్టపడును. తొవలఱేఁడు-చంద్రుఁడు. తారా శశాంక మే యిట ననుసంధేయము.

౧౧౭ - ౧౩. "పశువులను జేయు రష్యనుపద్ధతులు" ఈ పద్యమును ౧౧౬వ పుటలోని 13 వ పద్యముతోఁ, జదివిన భావము స్ఫుటపడును. "పసులమంద గాక ప్రజల మాఁక".

౧౧౭ - ౬. వాతపిత్తశ్లేష్మములు- వికారమును జెంది జ్వరాది రోగములను గలిగించు, సత్త్వరజస్తమోగుణములు వికారమును బొంది, రాగద్వేషాద్యనంత మానస వ్యధలకుఁ గారణమగును. మొదటిది వ్యాధి - రెండవది ఆధి.

౧౨౨ - ౨. స్వశబ్దము - బ్రహ్మ మందు వర్తించునని శాస్త్రమర్యాద. "స్వ" యనగా బ్రహ్మముయొక్క తంత్రము= స్వతంత్రము-ఆబ్రహ్మముయొక్క తంత్రము. "స్వతంత్రము" తన తంత్రముగా నెవని కగునో యాతఁడు స్వతంత్రుఁడు - అనఁగా బ్రహ్మాతాదాత్మ్యమును బొందినవాఁడే స్వతంత్రుఁడుగాని పెద్దలను హద్దులను ధిక్కరించువారు స్వతంత్రులు కారనుట.

౧౨౫. "ఎఱిఁగి చెప్పిన నామాటలు". ప్రాచీనవిద్యల హృదయము గురు సన్నిధానమునఁ గవయిత్రి తెలిసికొన్నది. ఆధునిక నాగరకతలోని గుణదోషము లాంగ్ల విద్యాభ్యాసముచేతను, రాజధానియందు వసించుటచేతను, బాగుగాఁ దెలిసికొని చెప్పు చున్నది గానఁ దనమాట నమ్మఁదగినదని నిరూపించుచున్నది. తనమాట లనుభవములేని మాటలు కావనుట.

౧౨౭-౧౯. ఇంతకును మూలము స్త్రీలు - జాతియుద్భవమునకుఁ గారణ భూతలు. మగవారి నాఁడువారనిఁ బెంచవలసినవారు, గృహము నడపవలసినవారు. వారి పాతము జాతిఘాతము. వారి పూర్ణత జాతికిఁ బూర్ణత.

